# చతుర

323 వ సంచిక

డిసెంబర్ 2004

రూ.7/-



ఆరవల్లి నరసింహారావు

## పైసా లేని ప్రయాణం



కోణార్క దేవాలయ ప్రాభవం
ఫొటో: రవికిషోర్

నవ్యనవలా వేదిక

# చతుర

సంపుటి: 27 సంచిక: 11

డిసెంబర్ 2004 323వ సంచిక

## ఈ సంచికలో...!



కవర్ పేజీ ఫొటోగ్రాఫర్: కుమారస్వామి

# రచయితలకు ప్రత్యేకం

## కథలు-కబుర్లు

– ముక్తవరం పార్థసారథి

నవలలు, కథలు చదవాలనిపిస్తే చదవండి. లేదా మానెయ్యండి. కాని వాటిగురించిన వ్యాసాలూ, విశ్లేషణలూ మాత్రం చదవకండి. నవలలు, కథలు స్వేదబిందువులు. కన్నీటిచుక్కలు. చిరునవ్వు తుంపరలు. "గురించి"లో రుచి వుండదు.

"చక్కెర" అని కాగితం మీద రాసి నాకితే తియ్యగా వుంటుందా" అన్న అరిగిపోయిన రికార్డు వినలేదూ.

నవలా రచన గురించిన కబుర్లివి. రాసిన వాళ్లు తమ సాధకబాధకాల్ని మనతో పంచుకుంటారు. చెప్పినవి వాళ్ల అనుభవాలు. ఎంతవరకు పనికొస్తాయో ఎవరికివారే తేల్చుకోవాలి. స్వానుభవంతో సరిపోల్చుకోవాలి.

"నవల రాయటం కష్టమని కొందరెందుకనుకుంటారో అర్థంకాదు. చిన్నప్పుడు మనం అమ్మలదగ్గరా, అమ్మమ్మల దగ్గరా ఎన్ని కథలు వినలేదు. అందులో క్లిష్టమైన విషయం వుందని ఎప్పుడైనా అనిపించిందా? బహుశా ఎంతోమందికి ఎన్నో కథలు చెప్పేవుంటాం. కాని రాయటానికొచ్చేసరికొచ్చేటప్పటికి— ర్చుంటే "కథలు రాయటమెలా? " "నవలలు రాయటమెలా? " అనుకుంటాం.

మన అనుభవంలోని ఏ విషయాన్నైనా నవలగా మలచవచ్చు. చిన్నపిల్లలు చెట్లకొమ్మలు పోగుచేసి అరణ్యాల్నీ, గులకరాళ్లు కుప్పగా పోసి పర్వతాల్నీ సృష్టించగలరు. వయసు పెరిగినకొద్దీ మనలో ఈ ఊహాశక్తి తగ్గిపోతుంది కాబోలు. ఏ వస్తువునైనా ఉన్నదున్నట్టుగా గాక మరింత పెద్దదిగానో, చిన్నదిగానో, మరో వస్తువుగానో లేదా దాన్ని మనం చూస్తున్నట్టుగా గాక ఆ వస్తువు తన జీవితంలో అత్యంత ప్రధానంగా మారిన మరొక వ్యక్తి చూసినట్టుగా ఊహిద్దాం. ఉదాహరణకు: హంతకుడికి కత్తిపీట, దొంగలకు బ్రీఫ్‌కేసులో డబ్బు, హత్యలేదా ఆత్మహత్యకు పాల్పడిన వ్యక్తికి ఎత్తైన భవనం వగైరా.

మరణం ప్రస్తావన వచ్చింది గనక విషాదాంత కథ, విషాదాంత నవల రాస్తారా? భేషుగ్గా రాయండి. కాని పాఠకుల్ని ఏడ్పించకండి. చచ్చిన పాత్ర పక్కన మరో పాత్రను సృష్టించి ఆ పాత్రను ఏడ్వనివ్వండి. అప్పుడు పాఠకులు చావునూ, ఏడుపును కూడా ఆనందిస్తారు.

"కొందరు వ్యక్తులు, కొన్ని సంఘటనలు పరస్పరం ప్రభావితం చేసుకుంటే ఏదైనా కథే, ఏదైనా నవలే. ఇదీ ప్రస్తుతం మనం నవలకిచ్చే నిర్వచనం. అర్థవంతమైన కథనం ఉండాలని వేరే చెప్పనవసరంలేదు. కొన్నిసార్లు కథ లేదా నవల రాయాలనుకుని స్కెచ్ లేదా వ్యాసం లేదా రెండూ కలిపిన మరో వంటకమేదో తయారుచేస్తాం. అదీ కాకపోతే అభిప్రాయాలు చెప్పే సంపాదకీయం. కథలు, నవలలు రాయటంలో విఫలమైన వాళ్ళందరూ కథలు, నవలలు రాయటమెలా? పుస్తకాలు చదివితే ఆ బ్రహ్మరహస్యమేదో తెలిసిపోతుందనుకుంటారు.

ఓ కథా ప్రారంభం చూడండి.

"భూమ్మీది చివరి మనిషి గదిలో కూర్చున్నాడు. ఎవరో తలుపు తట్టిన చప్పుడైంది"

రెండు చిన్న వాక్యాలే గాని, పెద్ద నవల రాయగలిగినంత మసాలా వుంది. (కాపీరైటు లేదు. ఇది దత్తపదిగా తీసుకుని నవలా పూరణం చెయ్యండి.)

పాఠకుణ్ణి ఆకట్టుకునే ఒక ప్రక్రియ 'కథ' లేదా నవల అనుకుంటే అందులోంచి ప్రతి వాక్యమూ, ప్రతిభాగమూ అందుకనుకూలంగానే ఉండాలి. ప్రారంభంలోనే ఉత్కంఠ రేకెత్తించగలగాలి. ఆ తర్వాత పాత్ర చిత్రణ, వాళ్ల పరస్పర సంక్లిష్ట సంబంధాలు, సమ

4 డిసెంబర్ 2004 ఆంధ్రభూమి

స్యలు మొదట విపరీతంగా కనిపించి తర్వాత అనుకోని పద్ధతిలో పరిణామం చెందుతాయి.

ప్రతి మాటకూ తద్వ్యతిరేకార్థం కూడా ఉంటుందనేది చెప్పక్కర్లేని 'నిజం.

"కథానేపథ్యం కావాలా? ఎదుటి మనిషి జీవితం మనకు నేపథ్యం. మన బతుకు పక్కవాడికి నేపథ్యం"

-జాన్ ఆలెన్ పాలోస్

"సానుభూతివల్లకాదు. ఎదుటి మనిషిలో పరకాయ ప్రవేశం చేసినప్పుడు మాత్రమే కథలు రాస్తారు"

- జార్జ్ సిమెనన్

సూక్తులకేం కోకొల్లలు. ఆచరించాలనుకుంటేనే వస్తాయి చిక్కులు.

★ ★ ★

జపనీస్ చలనచిత్ర కళాఖండాల సృష్టికర్త అకిరాకుసవా సినిమా అంటే ఏమిటి? అన్న ప్రశ్నకు జవాబుగా ఓ పిట్ట కథ చెప్పాడు.

ఓ కుర్రాడు కుక్క బొమ్మ గీసి ఇలా రాశాడు, "నా కుక్క ఎలుగుబంటు లాగుంటుంది. కొందరికి అది తోడేలులాగా కూడా కనిపించవచ్చు. పరిశీలించి చూస్తే నక్క పోలికలూ కనిపిస్తాయి. ఒక జంతువును మరో జంతువుతో పోల్చి చూడటం చాలా సహజం. కాని నేను గీసింది కుక్క బొమ్మ గనుక అది కుక్కలాగే వుంటుంది"

బహుశా సాహిత్య ప్రక్రియలకు కూడా ఇది వర్తిస్తుందేమో! నవలంటే ఏమిటి? కథంటే ఏమిటి? తేడా ఏమిటి? వంటి చర్చలు నిష్ఫలమని ఎప్పుడో తేలిపోయింది. పొడుగునుబట్టి ప్రక్రియలను విభజిద్దామంటే ఇదివరలో పత్రికలవాళ్లు నవలల పోటీ పెట్టి వంద పేజీలకు తగ్గని రాతప్రతిని పంపమనేవారు. ఇది కనీసం నవల ఎంత పొడుగుండగలదు? సెర్వాంటెస్ రాసిన డాన్‌క్విక్సాట్, టాల్‌స్టాయ్ యుద్ధము-శాంతి, దోస్ట్‌వ్‌స్కీ 'బ్రదర్స్ కరమజోవ్' రెండు వేల పేజీలకు కాస్త అటూ ఇటుగా వుంటాయి. మార్సల్‌ప్రాస్ట్ రాసిన ఫ్రెంచి నవల 'ది రిమెంబరెన్స్ ఆఫ్ థింగ్స్ పాస్ట్' ఏడు సంపుటాలు. ఒక్కొక్క సంపుటం నాలుగు వందల పేజీల సన్నచ్చు. ఇంతకన్నా పొడుగైన నవలలు లేవని కాదు.

అలాగే చాలా కథలు ప్రస్తుతం ఈ పత్రికలో వున్న నవలకన్నా పెద్దవి. మచ్చుకు రెండుమూడు హార్ట్‌ఆఫ్ డార్క్‌నెస్ (జోసెఫ్ కొన్రాశ్), డబుల్ బారెల్డ్ డిటెక్టివ్ స్టోరీ (మార్క్‌ట్వేన్), డెత్‌ఆఫ్ ఇవాన్ ఇల్యిచ్ (టాల్‌స్టాయ్). ఇంగ్లిషులో యాభై అరవై పేజీలకు తగ్గని మాంచి కథలు ఎన్నో!

మంచి నవలకు పొడుగొక్కటే ప్రమాణం కాదుగాని వెంటనే స్ఫురణకు వస్తున్న పెద్ద తెలుగు నవలలు మాలపల్లి, వేయిపడగలు, నారాయణరావు, రత్తాలు-రాంబాబు, జానకి విముక్తి.

నవలలో ఎక్కువ పాత్రలు, ఎక్కువ సంఘటనలు, ఎక్కువ జీవిత చిత్రణా వుంటుందంటారు. మరి కథలో? అవే. సంఖ్య తక్కువ అంటే పేజీల సంఖ్య తక్కువ.

జేబురుమాలు చీర కాదు

ఉంగరం వడ్డాణం కాదు.

కథ చదివి ఇందులో ఏముంది అని పెదవి విరిచే వాళ్లను "ఏం కావాలి" అని అడగాలి.

రోజువారీ రొటీన్ విషయాల గురించి రాసినట్టు కనిపించినా నాటకీయత గలిగిన సన్నివేశాలు అంతర్లీనంగా చోటుచేసుకొని కథను ముందుకు నడిపిస్తాయి. కేవలం రోజువారీ జీవితం కథ కాలేదు. కథా ప్రారంభంలోనే కథలో రాబోయే ప్రధాన సమస్య ఏదో దర్శనమిస్తుంది. ఉదాహరణకు అస్తమానం ఇంటిచాకిరీ చేస్తూ అణిగిమణిగి పడున్నట్టుగా కనిపించే ఇల్లాలిలో అసంతృప్తి కట్టలు తెంచుకోవటానికి రెడీగా వుంటుంది.

బహుషా, పాత్రలు ఎంచుకోవటం కూడా కష్టంకాదు. పాత్రలతో ఏం చేయించాలి అని యుద్ధం చెయ్యటంతో పోల్చితే.

**(వచ్చే నెల మరిన్ని విశేషాలు)** ★

జ్ఞానతరంగిణి

## మహర్షి దాతాదయాల్‌గారి సందేశం

# స్వాధ్యాయం



మనిషికి అనేక అంశాలను సరిదిద్దుకునే అవకాశాన్ని పుస్తకం కలిగిస్తుంది. గ్రంథాలే మంచి మిత్రులుగా, సలహాదారులుగా పని చేస్తుంటాయి. హితబోధ చేస్తాయి. నడవడి నేర్పుతాయి.

అసభ్యమైనవీ, భయంకరమైనవీ అయిన పుస్తకాలను చదివి మనసులో దురాలోచనలకు స్థానమీయరాదు. దురాలోచనలు మనిషిని భ్రష్టు పట్టిస్తాయి.

సద్గ్రంథపఠనం చేస్తే అది రాసిన రచయితతో ముఖాముఖి చర్చించినట్లు భావించాలి.

రచయిత వ్యక్తిగత వివరాలూ, జీవన సంఘటనలూ మొదలైన వాటిపై ఆసక్తి చూపటం అనవసరం. స్వాధ్యాయ సమయంలో పుస్తకంలో వివరించిన అంశంపైనే ధ్యానాన్ని కేంద్రీకరించాలి.

చెడు మాటలు వినకపోవటం, చెడు సాహిత్యం చదవకపోవటం మంచిది.

మతాలను, ధర్మాలను విమర్శించిన పుస్తకాలను, మహాత్ములపై విమర్శలున్న పుస్తకాలను చదివితే మనసు కలుషితమై ద్వేషభావాన్ని పెంచే అవకాశాలున్నాయి. ఫలితంగా అన్ని మతాలపట్ల, ధర్మాల పట్ల చిన్నచూపు, ఏవగింపు కలుగుతుంది. పక్షపాత గుణం, కఠోరత్వం పెరుగుతుంది. అది పెరిగితే ఇక ఎంత ప్రయత్నించినా ధార్మికత అలవడదు.

తేనెటీగ పూలపై వాలి మకరందాన్ని సేవించటం వల్లనే రేకులు విచ్చుకుని పూవుకు మరింత సౌందర్యం పెరుగుతుంది. సువాసనలు సుదూర తీరాలవరకు వ్యాపిస్తాయి. మురికి గుంటలపై, మురిగిన పదార్థాలపై వాలే ఈగలు పూలకు నష్టమే మిగిల్చి దుర్వాసనల్ని వ్యాపింపచేస్తాయి. దీనివలన ఇతరులకు కూడా హాని కలుగుతుంది. ఇదే ఉపమానాన్ని పుస్తకాలకు కూడా అన్వయించుకోవచ్చు. మంచి పుస్తకాలు పఠిస్తే సద్భావనలు పెరుగుతాయి. చెడు పుస్తకాల వలన అశాంతి పెరుగుతుంది.

పుస్తక పఠనం ద్వారా నీవు గ్రహించిన మంచి విషయాలను జీవితానికి అన్వయించుకో. సత్పురుషుల ప్రవచనాలను, జ్ఞానబోధను విని అర్థం చేసుకో.

ఆలోచించకుండా, చదివిన దానిని అర్థం చేసుకోకుండా అదే పనిగా అతిగా చదివితే నీ మెదడు బలహీనం అవుతుంది. ఉదాహరణకు ఒకగదిలో అవసరాన్ని మించిన సామాను కిక్కిరిసేలా పెడితే గాలి కలుషి

6 డిసెంబర్ 2004 ఈనాడు

తమై, పరిమితమై కీటకాల్ని, పురుగుల్ని ఆహ్వానిస్తుంది. ఇది అనారోగ్య హేతువు. అలాగే మెదడులో అనవసర ఆలోచనా విచారాలను కూరి కూరి నింపితే అది బల హీనమవుతుంది. చివరికి పనికి రాకుండా పోతుంది.

మంచి పుస్తకాలను ఎన్నుకుని జీవిత పర్యంతం వాటిలోని నీతిని అన్వయించుకో.

గాడిద వీపుపై గంధం చెక్కలు మోసినా దానికి సువాసన విలువ తెలియదు. అలాగే మంచి పుస్తకాల్ని అర్థం చేసుకోలేని మనిషి దానిలోని సారం గ్రహించక, నీతిని అన్వయించుకోక మూర్ఖుడిగానే మిగిలిపో తాడు. ఇతడిని పైన చెప్పిన గాడిదతో పోల్చవచ్చు.

చందనం చెట్టు పక్కనే ఉంటే వేపచెట్టు సైతం సుగంధభరితమవుతుంది. ఇదే విధంగా సద్గ్రంథ పఠనం వల్ల మనిషి ఉత్త ముడుగా మారతాడు. అలా మారని మనిషి చెట్టుకంటే అల్పుడనవచ్చు.

మంచి పుస్తకం చిన్నదైనా మేలే! అన్నిటి కంటే చిన్న పుస్తకం భగవద్గీత. అతి పెద్ద గ్రంథం మహాభారతం.

మంచి మనుషుల ఉత్తమ ఉపదేశాలే సద్గ్రంథాలు. దుర్బుద్ధి ప్రబలంగా ఉన్న వారి వచనాలు చెడుపుస్తకాలు.

సద్గ్రంథ పఠనం వల్ల మంచి సంస్కా రాలు ఉత్పన్నమవుతాయి. వాటి నుండి సారం గ్రహించి లోకమనే గ్రంథాన్ని చదువు. దీని వల్ల బుద్ధి తీవ్రమూ, హృదయం విశాలమూ అవుతుంది. తరు వాత నీ శరీరాన్ని చదువు. ఇది ప్రకృతి యొక్క పరిపూర్ణతను ఆపాదించుకున్న చిన్న పుస్తకం. దీని వలన మనసు నిండి పోతే హృదయపు గ్రంథాన్ని చదువు. ఇది అత్యుత్తమ గ్రంథం. ఎన్ని పుస్తకాలు చది వినా నీ హృదయమనే పుస్తకం వైపు దృష్టి మళ్ళించకుంటే స్వాధ్యాయం ఫలితం లభిం చదు.



బయటి పనులపై తిరిగి తిరిగి ఇంటి కొచ్చి విశ్రాంతి తీసుకున్నట్లే బయటి పుస్త కాలు చదివాక నీలో గల నీ లోపలి పుస్త కాల్ని, హృదయపు పుటల్ని తెరిచి ఆలోచన చేయాలి. సుఖానందాలు ఎక్కడో లేవు. నీలోనే ఉన్నాయి. జ్ఞానం కూడా నీలోనే ఉంటుంది. దానిని అన్వేషించే పద్ధతిలో అన్వేషించు. దర్శనమిస్తుంది.

పుస్తకం అద్దం వంటిది. ప్రపంచం కూడా దర్పణమే. దర్పణంలో మన రూపం కనిపిస్తుంది. బుద్ధిమంతుడు దానిలో తన రూపును చూసుకుని సవరిం చుకుంటాడు. మూర్ఖుడు గమనించడు. సవరించడు. నీవు బుద్ధిమంతుడవు కావాలే గాని మూర్ఖుడివి కారాదు.

\- సేకరణ: **జ్యోతిరాణి**

★

# మినీ కథలు

## ఔరా! గడుసరీ!

హౌరా నుంచి హైద్రాబాద్ వెళ్లే ఈస్ట్‌కోస్ట్ ఎక్స్‌ప్రెస్ మూడు గంటలు లేట్‌గా నడుస్తోంది. దూర ప్రయాణం చేస్తూన్నవారికి పరమ విసుగ్గా వుంది.

టాటానగర్ నుంచి ఉదయం ఆరు గంటలకే స్టీవ్‌సిటీ ఎక్స్‌ప్రెస్ ఖరగ్‌పూర్‌లో దిగి, అక్కడ ఈస్ట్‌కోస్ట్ ఎక్స్‌ప్రెస్ ఎక్కాడు గుండూరావ్. ఫ్యామిలీతో హైద్రాబాద్ వెళుతున్నాడతను. ట్రైయిన్ అన్ని గంటలు లేటయ్యేసరికి విసుగు, చిరాకు ఎక్కువయిపోయాయి. అది రూల్ అన్నట్టుగా ప్రతిరోజూ లేట్‌గా నడిచే ఈస్ట్‌కోస్ట్ ఎక్స్‌ప్రెస్‌నీ, 'ఆలస్యం తమ జన్మహక్కు' అన్నట్టు పంక్చువాలిటీ పాటించని రైల్వేస్‌నీ గుండూరావు తూర్పారబట్టసాగాడు.

తోటి ప్రయాణీకులంతా ఆసక్తిగా ఆలకిస్తూంటే, "మన రైల్వేస్‌కి టైమ్ సెన్స్‌లేదు. నడకలాంటి పరుగుతో తీరిగ్గా డెస్టినేషన్ చేరుకుంటాయి. స్పీడు పెంచితే వారి సొమ్మేం పోతుందో! ఆలస్యం చేస్తే వోవర్ టైమ్ ఎలవెన్స్ వస్తుందన్న ఆశ కాబోలు! రైళ్ల ఆలస్యం కారణంగా ఎందరు ఎటువంటి ఇబ్బందులకు గురవుతున్నారో వారికెలా అర్థమవుతుంది? ... అదే విదేశాల్లో అయితే ట్రెయిన్ ఎరైవల్‌ని బట్టి వాచీలు కరెక్ట్ చేసుకోవచ్చునట! అసలు జపాన్, జర్మనీ, ఫ్రాన్స్‌లలో అయితే గంటకు సుమారు రెండు వందల కిలోమీటర్ల వేగంతో నడుస్తాయట ట్రైన్స్. మన రైళ్లూ నడుస్తాయి, నత్తల్లా!..." అక్కసునంతా వెళ్లగక్కుతూ అన్నాడు గుండూరావ్.

అతనితో ఏకీభవిస్తున్నట్టుగా తలలు వూపారంతా. ఓ అరగంటసేపు అదే ధోరణిలో రైల్వేస్‌ని దుయ్యబట్టి, ఆనక అలసిపోయి, ఫ్రూటీతో నాలుక తడుపుకుని, బెర్త్ మీద వాలాడతను. ఎవరికి వారే బెర్త్‌ల మీద నడుం వాల్చడంతో నిశ్శబ్దం ఆవరించుకుంది కంపార్ట్‌మెంటులో.



ఆగకుండా పరుగెడుతున్న ఈస్ట్‌కోస్ట్ ఎక్స్‌ప్రెస్ తుని స్టేషన్‌లో ఆగింది. ఎంతకూ కదిలే సూచనలు కనిపించలేదు. రైలుదిగి విషయం తెలుసుకుని వచ్చిన ప్రయాణికులకు గుండెల్లో రాయిపడింది... విజయవాడ నుంచి భువనేశ్వర్ వెళుతున్న ఫాస్ట్

8 డిసెంబర్ 2004

పాసెంజర్ ఒకటి పిఠాపురం దాటాక పట్టాలు తప్పిందట. ఇంజన్‌తో సహా మూడు బోగీలు ప్రక్క ట్రాక్‌మీద పడిపోయాయి. పాతికమందికి దెబ్బలు తగిలాయట. అదృష్టవశాత్తూ ఎవరూ మృతిచెందలేదనే ఊరట. ఇంజన్‌నీ, బోగీలనూ మళ్లీ పట్టాలపైకి చేర్చి ట్రాక్స్ క్లియర్ చేయడానికి కనీసం నాలుగైదు గంటలైనా పడుతుందట. అంతవరకు ఇరువైపుల నుంచీ రైళ్ల రాకపోకలు బంద్!... ఎదురుచూడని ఆ పరిస్థితికి హతాశులయ్యారంతా.

గుండూరావ్ ఆవేశంతో మళ్లీ చెలరేగిపోయాడు- "ఇదండీ, మన రైల్వేల వరుస! రైలు నడిపేటప్పుడు కనీసపు జాగ్రత్తయినా పాటించొద్దా? నడుపుతున్నది రైలన్న మాట మరిచిపోయి, పైలెట్‌లా ఫీలయిపోతూ విమానంలా పరుగులెత్తిస్తే ఎలా? ఇదేమైనా జపానా, జర్మనీయా? మన దసలే లూజ్ సాయిల్. ట్రాక్సూ వీకే. పరిమిత స్పీడుకే పనికిరాని పట్టాలమీద కళ్లు మూసుకుని స్పీడు పెంచితే ఎలా? ఇక సిగ్నలింగ్ ఎక్విప్‌మెంట్ సరేసరి. మన ముత్తాతల కాలం నాటిది... అన్ని వందల మంది ప్రాణాలు తన చేతిలో వున్నాయన్న సంగతి మరిచిపోయి రైలును విమానంలా నడపాలనుకుంటే కలిగే ఫలితం ఇదే! నెమ్మదిగా నడుపుకుంటూ కాస్త ఆలస్యంగా చేరుకుంటే కొంపలు మునిగిపోతాయా!? "

అంటూన్న అతన్ని నోళ్లు తెరుచుకుని చూస్తూ వుండిపోయారంతా.

అంతకు కొన్ని గంటల ముందు ట్రైన్ స్పీడు పెంచలేదని డ్రైవర్నీ, రైల్వేస్‌నీ దుమ్మెత్తి పోసిన అతగాడి వ్యాఖ్యానానికీ, ఇప్పుడు ఆ యాక్సిడెంట్ నేపథ్యంలో ప్లేట్ పిరాయించిన ధోరణికీ పొంతన కుదరక తెల్లబోతూ, 'ఔరా, గడుసరీ!' అనుకుంటూ ముక్కుపైన వేలేసుకున్నారు.

– తిరుమలశ్రీ

---

## ఇక్కడున్నారా బాబూ!

అప్పుడే క్లినిక్‌లోకి ప్రవేశించాను. ఉదయం తొమ్మిది గంటలకే పేషంట్స్ వచ్చేశారు. సీజన్ మార్పు జరుగుతుండడంతో రోగాలు ఎక్కువగా వుంటాయి

నర్స్‌ని పిలిచి ఎంతమంది ఉన్నారని అడిగి, ఒక్కొక్కరినీ పంపమని చెప్పాను.

ఇంతలో

ఒక వ్యక్తి నా గదిలోకి తోసుకుని వచ్చాడు

ఆయన వయసు ఆరవైపైనే ఉండవచ్చు తెల్లని బట్టలు. మేకప్ చేసుకున్నాడు. కళ్ల జోడు వుంది. కొంచెం బట్టతల. చాలా స్టైల్‌గా ఉన్నాడు. ఆయన వెనకాల నర్స్ ప్రవేశించింది. హడావిడిగా

"సర్ లైనులో ఉండమంటే వినకుండా వచ్చేశారండీ ఈయన సారీ-"అంది

"పోనీలే పెద్దాయన. చూసి పంపేస్తానులే -" అని నర్స్‌ని పంపించేశాను.

'అయ్యా మీపేరు- వయస్సు-'

"నా పేరు చిదంబరం. మాది విశాఖపట్నమేనండి. వయసు ఎనభైలో పడ్డాను."

ఓహ్ ఈయనకు ఎనభై సంవత్సరాలా? చూడగానే అరవైకి మించి వయస్సు వుండని శరీరం సౌష్టవం బాగా ఆరోగ్యంగా ఉన్నాడు.

"ఈ వయసులో కూడా ఇంత చలాకీగా, ఆరోగ్యంగా ఉన్నారు. మీ ఆరోగ్య రహస్యం ఏమిటి? "

"ఏముందీ వెరీ సింపుల్. నేను రోజూ సూర్యోదయానికి ముందే లేస్తాను. కాలకృత్యాలు ముగించుకుని అడవిలోకి వేటకు వెళ్తాను. కొండలు గుట్టలు దిగి వెళ్తాను, మళ్లీ ఎక్కుతాను. అదీ సంగతి!"

"బావుంది. మీరు వేట ద్వారా చేసే వ్యాయామం ఆరోగ్యానికి ఎంతో మేలు చేస్తుంది. అయితే మీరు వారసత్వంగా

వస్తున్న మీ పెద్దవారి ఆరోగ్య కారణాలు కూడా మీకు తోడ్పడి ఉంటాయి. మీ నాన్న గారు చనిపోయే సమయానికి ఆయన వయసు ఎంత? ".

ఆయన సీరియస్ అయిపోయి "ఎవర న్నారు ఆయన చనిపోయారని" అన్నాడు, అందుకు నేను ఆశ్చర్యంతో-

"అదేమిటి మీకు ఎనభై సంవత్సరాలు కదా. మీ తండ్రిగారు బ్రతికి ఉండడం ఏమిటి? " అన్నాను.

"మా నాన్నగారి వయస్సు నూరు సంవత్స రాలు. ఆయన రోజూ అడవికి వేటకి నాతో వస్తారు తెలుసా మీకు? " అన్నాడాయన

అయినా నాకు తృప్తి కలగలేదు

" మీ నాన్నగారి నాన్నగారు చనిపోయే



నాటికి ఆయన వయస్సు ఎంతండీ"

"ఎవరన్నారు మాతాతగారు చనిపోయా రని? "

ఓహ్! నాకు ఆశ్చర్యమేసింది. ఉదయాన్నే భలే చరిత్ర ఉన్న మనిషి వచ్చాడనుకుని

"అదేమిటండీ బాబూ, మీరు ఎనభై, మీనాన్నగార్కి నూరు సంవత్సరాలు కాదా, మీ తాతగారు బతికున్నారా? ఆయన వయసు ఎంత? " అన్నారు.

"అదేం మాట. మా తాతగారి వయసు నూట పద్దెనిమిది సంవత్సరాలు. ఈ మధ్యనే ఆయన మాతో వేటకు రావడం మానేశారు"

"ఎందుకు?

"ఏం లేదులెండి. పోయిన సంవత్సరం మా మామ్మ చనిపోతే మళ్లీ పెళ్లి చేసుకు న్నారు లెండి. కొత్త పెళ్లాం కదా" అన్నాడు నవ్వుతూ

"భలే ఆశ్చర్యంగా వుందే" అనుకుంటూ, హ్యూమన్ జెనిటిక్స్ మీద మంచి పేపర్ సమర్పించాలి ఈ కుటుంబం గురించి అను కుంటున్నాను.

ఈలోగా నలుగురు వ్యక్తులు పరుగులతో నారూములోకి వచ్చి ఆందోళనగా, నా ఎదు రుగా కుర్చీలో తాపీగా కూర్చున్న వ్యక్తిని చూసి,

"మహానుభావా మీరు ఇక్కడున్నారా? ఛస్తున్నాం వెతకలేక" అంటూ లాక్కుపోతు న్నారాయన్ని.

నేను వాళ్లని ఉద్దేశించి "ఆగండి. అతను నాపేషెంట్" అని నేను అంటూ వుంటే-

"చాల్లెండి సర్, ఇతను పిచ్చాసుపత్రి నుండి పారిపోయి వచ్చాడు" అంటూ వాళ్లు అతన్ని తీసుకువెళ్ళిపోయారు.

చిత్రం! డాక్టరునైన నాకే అనుమానం రానంత చక్కగా వున్నారాయన. అతను పిచ్చివాడంటే నమ్మలేకపోయాను.

— కె.బి. కృష్ణ

# పాలకులను వణికించిన 'మరీచిక'

**కథ వెనుక కథ**

**సాహిత్యాన్ని ఆస్వాదించే మనం ఎన్నో కథలు చదువుతాం. కొన్ని చదవగానే మర్చిపోతాం. కొన్ని కొంతకాలం గుర్తుంటాయి. కొన్ని మాత్రం ఎప్పటికీ మర్చిపోలేం. వాటి తాలూకు పాత్రలు, సంఘటనలు మనకు తరచూ గుర్తొస్తూనే ఉంటాయి. కేవలం చదివితేనే మనకంతలా గుర్తుండిపోయిన కథను... కథగానో, నవలగానో మలచాలన్న ఆలోచన రచయితకు ఎందుకు వచ్చిందో... అలా మలచడానికి పడ్డ తపనేమిటో.. ఆ ప్రయత్నంలో పడ్డ పాట్లేమిటో.... తెలుసుకోవడం ఎవరికైనా ఆసక్తికరం. దీన్ని దృష్టిలో పెట్టుకునే 'చతుర' ఈ 'కథ వెనక కథ' శీర్షిక ప్రవేశపెడుతోంది.**




సమాజపు కట్టుబాట్లు వీధిబడితోనే ఆమె విద్యాభ్యాసం ముగిసేలా చేశాయి. కానీ ఆమె విజ్ఞానతృష్ణను, అన్వేషణను మాత్రం ఏమీ చేయలేకపోయాయి. ప్రైవేటుగా ఉన్నతచదువులు చదివిన ఆమె సమాజం స్త్రీ పట్ల చూపుతున్న వివక్ష గురించి పదోఏట నుంచే ప్రశ్నించడం ఆరంభించారు. వివక్షకు మూలాలెక్కడున్నాయో తెలియకపోయినా ఆ పసిమనసు తిరగబడుతూనే ఉండేది. వయసుతో పాటు ఆమెలో పెరుగుతూ వచ్చిన ప్రశ్నలూ... ఆలోచనలూ ఆంధ్రులకు ఒక



పెరల్ బక్‌ని ప్రసాదించాయి. వాస్తవికవాదిగా వేనోళ్ల ప్రశంసలందుకున్న వాసిరెడ్డి సీతాదేవి పేరు చెప్పగానే మనకు గుర్తొచ్చేది ఆమె రాసిన మరీచిక నవల. ఎనభయ్యో దశకంలో ఈ నవల సృష్టించిన



సంచలనం ఇంతాఅంతా కాదు. అందుకే చతుర ప్రవేశపెడుతున్న ఈ కొత్త శీర్షిక కథ వెనక కథ ఆమెతోనే, ఆమె రాసిన మరీచిక విశేషాలతోనే ప్రారంభిస్తున్నాం.

పాతికేళ్ల క్రితం రాసిన నవల ఇది. జీవన విధానాలుగా రెండు వైవిధ్యమైన మార్గాలెంచుకున్న ఇద్దరు యువతుల చుట్టూ కథ నడుస్తుంది. ఒక యువతి హిప్పీ సంస్కృతివైపు, మరో యువతి నక్సలైటు ఉద్యమం వైపు ఆకర్షితులై వాటిల్లో చేరతారు. ఒకరిది పలాయనవాదం. మరొకరిది రాజకీయ చైతన్యం. ఈ నవల తొలుత సీరియల్‌గానూ ఆనక నవలగానూ ప్రచురితమైంది. 1979లో మొదటి ముద్రణ అయిన నవలను 1982లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వం నిషేధించింది. ప్రజలనుంచి, మేధావివర్గాలనుంచి తీవ్ర నిరసన వ్యక్తం కావడం, కోర్టుకూడా నిషేధించడానికి సరైన కారణం లేదనడంతో ప్రభుత్వానికి నిషేధాన్ని ఎత్తివేయక తప్ప లేదు. రాష్ట్రంలోనే కాక దేశంలోని సాహిత్యాభిమానులందరినీ కదిలించిన ఈ సంఘటన గురించి, 'మరీచిక' ముందు వెనక సంభవించిన కొన్ని సంఘటనల గురించి రచయిత్రి వాసిరెడ్డి సీతాదేవిగారు ఇలా చెప్పారు.



ఇదినాకలవాటే

రాజకీయనేపథ్యంతో రచనలు చేయడం నాకు అలవాటే. నేను యువజన సర్వీసుల విభాగంలో పనిచేస్తున్నపుడే ఇటు నక్సలైటు ఉద్యమం ఊపందుకుంది. రాజకీయ అవగాహన ఉన్న ఏ రచయితయినా పరిస్థితి గురించి ఆలోచిస్తారు కదా. నా మనసులోనూ అలాంటి ఆలోచనలు సాగుతున్నాయి. అదే సమయంలో మరో పక్క హిప్పీ సంస్కృతి సాంఘికంగా, నైతికంగా యువతరాన్ని కుంగదీస్తోంది. రెండూ విభిన్న ధోరణులు. కొందరు మేధావులనే వారు... యువత థ్రిల్ కోసం నక్సలిజం ఉద్యమం వైపు వెళ్తున్నారని. నాకది బాధనిపించేది. ఎందుకంటే ఉద్యమానికి ఒక లక్ష్యమంటూ ఉంది... కానీ హిప్పీ సంస్కృతికి అదేం లేదు. అప్పుడే ఆంధ్రభూమి వీక్లీ ప్రారంభిస్తూ నా సీరియల్ కావాలని అడిగారు. ఈ విషయం మీదే రాద్దామని మొదలెట్టాను. అస్తవ్యస్తంగా ఉన్న వ్యవస్థనుంచి ఈ రెండు ఉద్యమాలు ఊపిరిపోసుకున్నాయి. రెండిటి వెనక ఉన్న పరిస్థితుల గురించి ఆలోచింపజేయడమే నా ధ్యేయం.

అంతా ముక్కలు ముక్కలుగా రాశాను. తర్వాతే పుస్తకంగా వేశాను.

కొందరడిగారు... అతివాద భావాలను, నక్సలైటు సిద్ధాంతాలను ప్రచారం చేయడానికి రాశావా అని? అందుకు అనేక మార్గాలున్నాయి. ఏ రచయితా సాహితీప్రక్రియ ద్వారా సిద్ధాంతాలను ప్రచారం చేయడం, ఉద్యమాన్ని నిర్మించడం జరిగిందని నేననుకోను. ఇక ఉద్యమం గురించి అయినా, హిప్పీల జీవితవిధానం గురించి అయినా పత్రికలు చదివి తెలుసుకున్నదే. కథానాయిక తండ్రికి రాసిన ఉత్తరం మాత్రం నిజంగా ఒక యువతి రాసిన ఉత్తరమే. ఎలాగో నా దగ్గరకు వచ్చింది. ఆ అమ్మాయిని తర్వాత సంగారెడ్డి అడవుల్లో కాల్చిచంపారు. ఇక ఈ నవల నిషేధం జరిగాక సిఐడిలు మా ఇంటిచుట్టూ తిరిగేవారు. నేను లేనప్పుడు పనివాళ్లను బెదిరించేవారు.

నవలను ప్రచురించిన నాలుగేళ్ల తర్వాత ఎందుకు నిషేధించారన్నది మాత్రం ఎవరికీ అర్థంకాని విషయం. ఉగ్రవాదుల సాయుధ పోరాటాల పట్ల సుముఖత్వం కలిగించి, వర్గకలహాలను రేకెత్తించి యువజనులను మభ్యపెట్టి ప్రమాదకరమైన విప్లవ సిద్ధాంతాల దిశగా మళ్లిస్తుందని సాకులు చూపిస్తూ నిషేధించారు. విచిత్రమేమంటే... నవలను నిషేధించి, నిషేధించిన భాగాలను గెజెట్‌లో ప్రచురించారు. అదెవరైనా కొనుక్కుని చదువుకోవచ్చు.

అసలు నవలలో నేను చివరకు ఇచ్చిన సందేశం పోలీసులకు అర్థం కాలేదు. వ్యక్తుల్ని చంపినంత మాత్రాన ఉద్యమం విజయం సాధించదని మనుషులమధ్యకు వెళ్లమని, మార్క్సిజం, లెనినిజం ప్రజలకు బోధించమని కథానాయికకు చెప్పడంతో నవల ముగుస్తుంది. ఆ ముగింపును అందరూ సమర్థించారు. కొందరు మాత్రం అది సరికాదన్నారు. కానీ ప్రస్తుతం జరుగుతున్నదేమిటి? కొందరు రచయితలు దీనివల్ల నాకు పేరు వచ్చేస్తుందని, మంచి పదవిలో ఉన్న నేను కావాలనే చేయించుకున్నానని అన్నారు. కానీ ఉద్యోగంలో నాకు రివర్షన్ ఇచ్చాక వాళ్ల నాలుక కరుచుకున్నారు. ఆంధ్రప్రదేశ్ డెమొక్రటిక్ లాయర్స్ అసోసియేషన్ నిషేధానికి వ్యతిరేకంగా పోరాడింది. ప్రజాస్వామ్యవాదులు, సాహితీప్రియులు, శాసనసభ్యులు, పాత్రికేయులు ప్రభుత్వ చర్యను తీవ్రంగా ఖండించారు. ముగ్గురు జడ్జిలతో కూడిన హైకోర్టు ఫుల్‌బెంచి ప్రభుత్వ నిషేధం చెల్లదని కొట్టివేసింది. నా తరఫున ప్రముఖ న్యాయవాది కన్నబిరాన్ వాదించారు.

ఈ గొడవంతా పక్కన బెడితే నవల



చదివి మారినవారెందరో నాకు తెలుసు. ఒక ఎస్పీ పోలీసు ఉద్యోగం మానేసి వేరే పని చూసుకున్నాడు. చాలామంది డ్రగ్స్ అలవాటు మానుకున్నారు. వారంతా స్వయంగా నా దగ్గరకు వచ్చి చెప్పారు. ఏ రచయిత్రికైనా తన రచన పాఠకులను సరైన దిశలో ప్రభావితం చేసిందంటే అంతకు మించిన ఆనందం ఏముంటుంది?

- సేకరణ: పద్మశ్రీ యలమంచిలి

# నవలా పరిచయం

"ప్రతి సమస్యకూ ఓ పరిష్కారం ఉంటుంది. కంగారుపడకండి. మంచి ఉపాయం చెబుతాను" అంటూ తనదైన రీతిలో పరిష్కరిస్తుంటాడతడు. మెడ మీద వేలాడుతున్న కత్తుల్లాంటి కష్టాల్ని సైతం అలవోకగా తరిమికొట్టే చాతుర్యం అతని స్వంతం. తనకు విద్యాబుద్ధులు నేర్పిన గురువుగారి కన్నీళ్లు తుడిచే ప్రయత్నంలో చేతిలో చిల్లిగవ్వ కూడా లేకుండా

## 'పైసా లేని ప్రయాణం'

ప్రారంభించిన అతడు విజయసోపానాలను అధిరోహించి, వేలాది మందికి సహాయపడి అభిమాన, ఆదర్శమూర్తిగా ఎలా ఎదగగలిగాడో తెలిపే ఆరవల్లి నరసింహారావు నవల 'పైసా లేని ప్రయాణం' ఈ నెల 'చతుర' సమర్పణ.



రాఘవరావు తన అనుచరులతో కలిసి ఊరిలోకి బయల్దేరాడు. ఇంటింటికి తిరిగి అందరికీ చేతులు జోడించి నమస్కరించి తనకు ఓటు వేయమని అడుగుతున్నాడు.

అలా వస్తుండగా ఆయనకు దూరంగా నడిచి వస్తున్న రాజు కన్పించాడు. అతని దగ్గరకి పరుగులాంటి నడకతో వెళ్ళాడు రాఘవరావు.

"నీ ఓటు నాకు వేయడమే కాదు. యూత్‌లో నీకు ఎంత ఫాలోయింగ్ వుందో నాకు బాగా తెల్సు. అంచేత వాళ్ళందరి ఓట్లు నాకే వేయించాలి" అని రాజు చేతులు పట్టుకుని అర్థించాడు.

"తప్పకుండా" అన్నాడు రాజు మాటిస్తూ. ఆయన ముఖం వికసించింది. "నువ్వు మాటిచ్చావంటే ఇక నా గెలుపుని ఎవ్వరూ ఆపలేరు" అన్నాడు ఉత్సాహంగా. రాజు ఆయన వైపు జాలిగా చూశాడు. "అక్కడే మీరు పొరపాటుపడుతున్నారు. మిమ్మల్ని ఎలాగైనా ఓడించాలని మీ మీద పోటీచేస్తున్న ఆ బాపినీడు ఓటుకి వెయ్యి రూపాయిలు, ఒక జత బట్టలు ఇవ్వాలనుకుంటున్నాడట. అలా జరిగితే మీరు ఓడిపోవడం ఖాయం" నిర్మొహమాటంగా చెప్పాడు రాజు.

ఆయన అదిరిపడి "ఇప్పుడెలా? " అన్నాడు దిగులుగా.

"కంగారుపడకండి. ప్రతి సమస్యకూ ఒక పరిష్కారం ఉంటుంది. అలాగే ఈ సమస్యకు కూడా ఒక మంచి ఉపాయం ఉంది" అన్నాడు రాజు అనునయంగా.

"ఏమిటది? " ఆత్రంగా అడిగాడు రాఘవరావు. "ఏముందీ ఓటుకి బాపినీడు వెయ్యి రూపాయిలు, ఒక జత బట్టలు ఇస్తున్నాడు కాబట్టి మీరు ఆయన కంటే రెట్టింపు అంటే ఓటుకి రెండు వేల రూపాయిలు, రెండు జతల బట్టలు ఇవ్వండి. అప్పుడు ఆ బాపినీడు మీద కంటే మీ మీదే జనానికి విపరీతమైన అభిమానం ఏర్పడి అంతా మీకే ఓట్లు వేస్తారు. దాంతో గెలుపు మీదే అవుతుంది" అని రాజు సలహా ఇచ్చాడు.

ఆయనకు ప్రాణం లేచొచ్చినట్టయింది. "థాంక్యూ రాజూ..... థ్యాంక్యూ" అన్నాడాయన కృతజ్ఞతగా.

రాజు అట్నుంచి అటే బాపినీడు ఇంటికి వెళ్ళాడు. రాజుని చూడగానే బాపినీడు ఎదురు వచ్చి సాదరంగా ఆహ్వానించాడు. పచ్చటి లాన్‌లో ఉన్న తూగుటూయల్లో రాజుని కూర్చోబెట్టాడు.

"ఏం. తీసుకుంటావు? " అని ఆప్యాయంగా రాజుని అడిగాడాయన.

"అబ్బే ఏం వద్దు. మీతో ఒక ముఖ్యమైన విషయం చెప్పిపోదామని వచ్చాను" అన్నాడు రాజు.

"ఏమిటది? " ఆసక్తిగా అడిగాడాయన.

" ఆ రాఘవరావు ఓటుకి వెయ్యి రూపాయలు, ఒక జత బట్టలు ఇవ్వాలనుకుంటున్నాడట. అదే గనుక జరిగితే మీరు ఈ ఎలక్షన్లో గెలవడం అసాధ్యమవుతుంది" అన్నాడు రాజు.

బాపినీడు మొహం పాలిపోయింది.

"ఆ రాఘవరావు ఇంత దారుణానికి పాల్పడుతున్నాడా? ఇప్పుడేమిటి చేయడం? " కలవరపడుతూ అన్నాడు బాపినీడు.

"బాధపడకండి. ఈ విపత్కర పరిస్థితి నుండి మీరు బయటపడే మార్గం నేను చెప్తాను" అన్నాడు రాజు ఊరడింపుగా.

"చెప్పండి" అన్నాడాయన ఆరాటంగా.

"ఆ రాఘవరావు ఇచ్చేదానికన్నా మీరు రెట్టింపు డబ్బు, బట్టలు ఇవ్వండి. దాంతో జనం ఈ ఎలక్షన్లో మిమ్మల్నే గెలిపించి మీకే పట్టంగడతారు" అన్నాడు రాజు.

ఆయన ముఖం వెలిగిపోయింది. అమాంతం రాజుని కౌగిలించుకుని "సమయానికి వచ్చి ప్రమాద పరిస్థితిని వివరించి దాన్నుండి బయటపడే మార్గం చెప్పి నన్ను గెలిపించడానికి ప్రయత్నిస్తున్న నీ మేలు ఎప్పటికీ మర్చిపోలేను" అన్నాడాయన మనస్ఫూర్తిగా.

బదులుగా రాజు సన్నగా నవ్వాడు.

రాజు చెప్పిన ప్రకారం ఆ రాజకీయనాయకులిద్దరూ ఇంటింటికీ తిరిగి ఓటుకి రెండు వేల రూపాయిలు, రెండు జతల బట్టలు ఇచ్చారు. ఇద్దరూ ఏ మాత్రం తేడా లేకుండా బట్టలు డబ్బు ఇవ్వడంతో జనం కూడా ఆ ఇద్దరి పట్ల ఎలాంటి వ్యత్యాసం చూపించకుండా బ్యాలెట్ పేపరులో ఉన్న ఆ ఇద్దరికి సంబంధించిన గుర్తుల మీద తమ ఓటు ముద్రని వేశారు. దాంతో ఆ ఇద్దరికీ పడిన ఓట్లన్నీ మురిగిపోయాయి. ఇద్దరికీ డిపాజిట్లు గల్లంతయ్యాయి.

రాజు కావాలని మోసం చేసి తమ చేత భారీ యెత్తున డబ్బు ఖర్చు చేయించి తమని దారుణంగా ఓడించాడని గ్రహించిన రాఘవరావు, బాపినీడు ఆగ్రహావేశాలతో రగిలిపోయారు.

ఎలాగయినా ఈ విషయంలో రాజుకి తగిన శిక్షపడాలని భావించిన ఆ రాజకీయ నాయకులిద్దరూ ఆ ఊరికి పెద్దమనిషి, భూస్వామి, న్యాయనిర్ణేత అయిన శివప్రసాదు గారి దగ్గరకు బయల్దేరారు.

ఆ పెద్దమనిషి ఎవరో కాదు రాజుకి స్వయానా కన్నతండ్రి. అయితే న్యాయం విషయంలో ఆయన రక్తసంబంధాలకు ఎలాంటి ప్రాధాన్యత ఇవ్వని నిఖార్సయిన మనిషి.

బయట కోలాహలం వినిపించి రాజు కిటికీలోనుంచి బయటకు చూశాడు. చందా వసూళ్ళ కోసం కొంత మంది వ్యక్తులు గేటు తీసుకుని లోపలికి వచ్చారు.

రాజు పళ్ళెంలో కర్పూరం వెలిగించి, కొన్ని పూలు కుంకుమ పెట్టుకుని బయటకు వచ్చి హడావిడిగా "అంతా హారతి కళ్లకు అద్దుకోండి" అన్నాడు.

వాళ్ళంతా హారతి కళ్ళకద్దుకున్నారు. "ఈ పూలు చెవుల్లో పెట్టుకుని కుంకుమ నుదుట ధరించండి" అని చెప్పాడు.

అంతా అతను చెప్పినట్టుగానే చేశారు.

అతడు అక్కడ నుంచి వెళ్ళబోతూ ఆగి "హారతి పళ్ళాన్ని ఖాళీగా లోపలికి తీసుకువెళ్ళకూడదు. అలా చేస్తే రాముల వారి పాదాల చెంత ఉన్న ఆంజనేయస్వామికి ఆగ్రహం వస్తుంది. ఆ తర్వాత ఎన్నయినా అనర్థాలు జరగవచ్చు మీకు తోచిన దక్షిణ వేసుకుని మీ జన్మ చరితార్థం చేసుకోండి" అని సలహా ఇచ్చాడు.

అంతా ఇరకాటంలో పడ్డారు. ఇక తప్పదన్నట్లుగా తలో రూపాయి తీసి ఆ పళ్ళెంలో వేశారు. పళ్ళెం మొత్తం రూపాయి నాణాలతో నిండిపోయింది. రాజు "గోవిందార్పణం" అంటూ ఆ పళ్ళెంతో లోపలికి నడిచాడు.

కాసేపటికి తిరిగి వచ్చిన రాజు అందరి వంకా చిర్నవ్వుతో చూశాడు.

"చెప్పండి.... మీరంతా ఏం పనిమీద వచ్చారు?" అని ఆదరంగా అడిగాడు. వాళ్ళందరికీ నాయకత్వం వహిస్తున్న వ్యక్తి ముందుకొచ్చాడు.

"మన ఊరి సెంటరులో చనిపోయిన మన మాజీ ఎమ్మెల్యే గారి విగ్రహం ప్రతిష్ఠించాలనుకుంటున్నాం. ఆ విషయమై చందాలు వసూలు చేస్తూ మీ ఇంటికి వచ్చాం. మీ వంతు చందా ఇస్తే తీసుకుని వెళ్తాం" అన్నాడు చందా కోసం చేయిసాచి.

ఆ చేతిలోకి యథాలాపంగా చూసిన రాజు ఉలిక్కిపడ్డాడు. అతని కళ్ళు దిగ్భ్రాంతితో పెద్దవయ్యాయి. చటుక్కున ఆ చేతిని పట్టుకుని ఆ అరచేతిలోకి మరింత పరిశీలనగా చూశాడు. "అమోఘం.... అద్భుతం" అన్నాడు బిగ్గరగా. ఆ నాయకుడు నివ్వెరపోతూ "ఏమిటి మీరనేది?" అని అడిగాడు.

"మీ అరచేతిలోని ఈ అదృష్టరేఖను చూశారా! బోంబే హైవే రోడ్డులా ఉంది. ఈ పక్కన చూడండి. సూర్యస్థానంలో పక్షి రెక్కల ఆకారంలో కొన్ని రేఖలున్నాయి. అంటే మీరు త్వరలోనే స్వంతంగా విమానాలు కొనబోతున్నారు. ఇక ఈ గురుస్థానంలో చూడండి. పొగగొట్టాల ఆకారంలో

చాలా రేఖలున్నాయి. అంటే మీరు అతి కొద్ది కాలంలోనే చాలా ఫ్యాక్టరీలు నిర్మించ బోతున్నారు. ఈ శుక్రస్థానంలో చూడండి. లెక్కకు మించిన నక్షత్రాల గుర్తులున్నాయి. అంటే దేశవిదేశాల్లో మీరు ఎన్నో ఫైవ్ స్టార్ హోటళ్ళు నెలకొల్పబోతున్నారన్నమాట. ఇలాంటి మహత్తరమైన జాతకం నేను ఇంత వరకు చూడలేదు. టోటల్‌గా చెప్పాలంటే ప్రపంచంలో కెల్లా అతి గొప్ప ధనవంతులైన అయిదుగురిలో మీరొకరు కాబోతున్నారు" అన్నాడు రాజు ఎంతో ఉద్వేగంతో.

అతను ఆశ్చర్యంతో,- ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయ్యాడు.

అంతలోనే తెప్పరిల్లి " ఎలా.... ఎలా నేను ధనవంతుణ్ణి అవుతాను" అని అడిగాడు ఉత్సుకతగా. అతని మిత్రబృందం కూడా ఎంతో ఆసక్తిగా చూస్తున్నారు.

"ఎయిడ్స్ వచ్చి" అన్నాడు రాజు తాపీగా. అతను షాక్ తిన్నాడు. అతని స్నేహితులు నిర్ఘాంతపోయారు.

అతను కళ తప్పిన మొహంతో "ఎయిడ్స్ వస్తే ఎవరైనా పైకి పోతారుగాని పైకి ఎలా వస్తారు? " అని ప్రశ్నించాడు.

రాజు నవ్వి ధైర్యం చెప్తున్నట్టుగా అతని భుజం తట్టాడు. మరో సారి అతని అరచేతిలోకి చూసి "నీకు ఎయిడ్స్ వస్తుంది. నువ్వు అతి కొద్ది కాలంలోనే చనిపోతావని డాక్టర్లు నిర్ధారిస్తారు. దాంతో విరక్తితో నువ్వు చివరి ప్రయత్నంగా భద్రాచలం అడవుల్లోకి ప్రవేశించి కన్పించిన చెట్టు ఆకునల్లా తింటూ ముందుకు సాగిపోతావు. ఒక పది రోజుల పాటు ఆ కార్యక్రమాన్ని కొనసాగించిన పిమ్మట ఒక రోజు ఒక చెట్టు ఆకుని తిన్న నీలో అనూహ్యమైన మార్పు వస్తుంది. నూతనోత్తేజం, ఉత్సాహం, శక్తి, మొహంలో సరికొత్త తేజస్సు వచ్చిన నువ్వు మళ్ళీ హాస్పటల్‌కి వచ్చి టెస్టులు చేయిస్తావు. వచ్చిన రిపోర్టులు చూసిన డాక్టర్లు దిగ్భ్రాంతులవుతారు. అనుమానంతో ఒకటికి రెండుసార్లు టెస్టులు చేయిస్తారు. అయినా రిజల్ట్ అదే వస్తుంది. ప్రపంచ వైద్య విజ్ఞాన చరిత్రలోనే నువ్వు కొత్త అధ్యాయానికి శ్రీకారం చుడతావు. నీ పేరు దేశ విదేశాల్లో మార్మోగిపోతుంది. ఈ ప్రపంచంలో ఎయిడ్స్ వ్యాధికి మందు కనిపెట్టిన మొట్టమొదటి వ్యక్తివి నీవే అవుతావు. దాంతో ప్రపంచదేశాల ఎయిడ్స్ పేషెంట్సంతా నీ యింటి ముందు క్యూలు కడతారు. ఒక్కో ఆకుని వేల డాలర్లకి అమ్ముతూ అతి కొద్ది కాలంలోనే నువ్వు గొప్ప ధనవంతుడివి అయిపోతావు" అన్నాడు.

మరుక్షణం ఆ నాయకుడు దబ్‌మని శబ్దం చెస్తూ నెల మీద పడ్డాడు. అతనికి స్పృహ తప్పింది. రాజు అతని మొహం మీద నీళ్ళు చిలకరించి లేపాడు.

"నేను.... నిజంగానే అంత ధనవంతుడిని అవుతానంటావా? " ఎంతో ఉద్విగ్నతతో అడిగాడు ఆ నాయకుడు.

"తప్పకుండా అవుతావు. ఈ రాజు జాతకం చెప్పాడంటే బ్రహ్మసైతం తను రాసిన నుదుటి రాతల్లోని తప్పుల్ని సవరించుకోవలసిందే" అన్నాడు నమ్మకంగా రాజు.

అతని మొహం వెలిగిపోయింది.

"మీరు చెప్పినట్టుగా జరిగితే అప్పుడు మిమ్మల్ని నోట్ల కట్టలతో ముంచెత్తుతాను" అన్నాడు ఆ నాయకుడు ఉత్సాహంగా.

"అప్పటి సంగతి ఇప్పుడు అనవసరం. ముందు జాతకం చెప్పినందుకు వందకి తక్కువ కాకుండా పారితోషకం ఇచ్చుకో. లేకపోతే జాతకం చెప్పించుకున్నవాడి జాతకం తలక్రిందులవుతుంది. ఇది నేను చెప్పేది కాదు. వరాహమిహిరుడు రాసిన నవగ్రహాలు అన్న పుస్తకంలోనిది" అన్నాడు రాజు హెచ్చరిస్తూ.

అతను మారు మాట్లాడకుండా జేబులో నుంచి వంద నోటు తీసి రాజుకి అందించాడు.

రాజు చెప్పిన జాతకంతో మిగిలిన వాళ్ళు కూడా మాకు జాతకం చెప్పమంటే మాకు చెప్పమని ఎగబడ్డారు.

రాజు అందర్నీ క్యూలో నిల్చోమని చెప్పాడు. అంతా అతని ఆదేశాన్ని పాటించారు. వరుసలో ముందు నిల్చున్న వ్యక్తి అరచేతిని అందుకుని దాన్ని పరిశీలనగా చూసిన రాజు చెప్పాడు.

"మీరు కూడా చాలా అదృష్టవంతులు. మీ చేతిలోని రేఖల ప్రకారం మీరు మట్టి ముట్టుకున్నా బంగారం అవుతుంది".

అతను మెరుస్తున్న కళ్ళతో " నేను ధనవంతుడిని ఎలా అవుతాను? " అని అడిగాడు కుతూహలంగా.

"గజ్జివచ్చి" అతని చేతిలోకి మరోసారి పరిశీలనగా చూసిన రాజు చెప్పాడు.

అతని మొహం పాలిపోయింది. మిగిలిన వాళ్ళంతా అతని వంక ఛీత్కారంగా చూస్తూ అతనికి దూరంగా జరిగారు.

"అదేమిటి? గజ్జి వస్తే ధనవంతుడిని ఎలా అవుతాను? " అడిగాడు నిరుత్సాహంగా.

"నీ జాతకరీత్యా నీకు గజ్జి ఎంత బాగా వస్తే అంతగా నువ్వు డబ్బు సంపాదిస్తావు. అందులో ఎలాంటి సందేహం లేదు" అన్నాడు రాజు నమ్మకంగా.

అతను ఇబ్బందిగా చూస్తూ "గజ్జి వస్తే ఒకటే దురద కదా! ఎలా భరించడం? " అన్నాడు.

రాజు చిద్విలాసంగా నవ్వాడు.

"ఇలారా" అని దగ్గరకు పిలిచి "ఇప్పుడు నీ వంటి మీద ఎక్కడయినా దురదగా ఉందా? " అని అడిగాడు.

"ఇక్కడ" అంటూ అతని వీపు చూపించాడు. అక్కడ నిల్చున్న వాళ్ళల్లోంచి ఒకతన్ని పిలిచి "ఇతని వీపు మీద గోకు" అన్నాడు రాజు. అతను గోకాడు. అతను గోకుతూ ఉంటే జాతకం చెప్పించుకుంటున్న వ్యక్తి కళ్ళు అపారమైన కమ్మదనాన్ని అనుభవిస్తున్నట్లుగా అర్ధనిమీలితాలయ్యాయి.

"ఎలా ఉంది? " రాజు అడిగాడు.

"ప్రాణం తేలిపోతున్నంత హాయిగా ఉంది" అన్నాడతను తన్మయంగా.

"దీన్ని బట్టి నీకేం అర్థమవుతోంది? గజ్జి లేని వాడికన్నా ఉన్నవాడికే గోక్కుంటూ ఉండడం మూలంగా హాయిగా కమ్మగా వుంటుందని. గజ్జి దేవుడిచ్చిన ఓ అపూర్వమైన వరం అనుకో" అన్నాడు రాజు గీతోపదేశం చేసే కృష్ణుడిలా. అతను అర్జునుడిలా బుద్ధిగా తలూపాడు.

"మరి వంద కొట్టుకో" అన్నాడు రాజు.

అతను ఉత్సాహంగా వంద నోటు తీసి రాజుకి ఇచ్చాడు. అలా అందరికీ జాతకాలు చెప్పి వచ్చిన వాళ్ళల్లో ఏ ఒక్కరినీ వదలకుండా అందరి దగ్గర తలో వంద రూపాయలు వసూలు చేశాడు రాజు.

అసలు తాము అక్కడికి వచ్చింది చందాల కోసమన్న సంగతి గుర్తుకొచ్చిన నాయకుడు మళ్ళీ రాజు దగ్గరకు వచ్చాడు.

"మీరు చందా ఇస్తే ఇక మేం వెళతాం" అన్నాడు.

"ఇస్తాను తప్పక ఇస్తాను. అయితే నాకో విషయం చెప్పండి. విగ్రహాన్ని ఈ ఊరిలో ఎక్కడ ప్రతిష్ఠించాలనుకుంటున్నారు? " అడిగాడు రాజు.

"మన ఊరి సెంటర్లో"

రాజు శూన్యంలోకి చూస్తూ ఏవో లెక్కలు వేశాడు. తర్వాత ఆందోళనగా మొహంపెట్టి " మన ఊరి వాస్తుప్రకారం ఊరి సెంటర్లో విగ్రహాన్ని ప్రతిష్ఠిస్తే విగ్రహం ఎటువైపు చూస్తూ ఉంటుందో ఆ దిక్కున నివసిస్తున్న జనానికి అరిష్టాలు దాపురిస్తాయి. మలేరియా, కలరా లాంటి ప్రాణాంతక వ్యాధులతో జనం కుప్పలు తెప్పలుగా ఛస్తారు. అగ్నిప్రమాదాలు సంభవించి ఆ ఏరియా అంతా కాలి బూడిదవుతుంది. అలా కొంత కాలం గడిచాక ఆ



మతాలు పెరుగుతున్నకొద్దీ, దేవుడు వాటి మరుగున పడిపోతాడు. - లిజెట్టీ

ఏరియా మొత్తం శ్మశానంగా మారుతుంది" అని హెచ్చరించాడు రాజు.

అంతే! అక్కడ ఉన్న జనంలో తూర్పుది క్కువైపు నివసిస్తున్న వాళ్ళు ఒక్కసారిగా అదిరిపడ్డారు. ఎందుకంటే విగ్రహాన్ని ప్రతి ష్ఠించే విధానం ప్రకారం విగ్రహం తూర్పుది క్కుని చూస్తూ ఉంటుంది. "విగ్రహం మా వైపు చూడటానికి వీల్లేదు. దాన్ని మరో వైపు చూసేలా ప్రతిష్ఠిద్దాం" అన్నారు తూర్పు దిక్కున నివసిస్తున్న వాళ్ళు.

"మా వైపు చూసేలా పెడితే మేం ఊరుకోం. అప్పుడు మా తడాఖా ఏమిటో చూపించాల్సి వుంటుంది" పడమర దిక్కు వైపు వాళ్ళు గర్జిస్తూ అన్నారు.

"ఒకసారి మా వైపు పెట్టి చూడండి. అప్పుడు ఎన్ని శవాలు లేస్తాయో అర్థమవు తుంది" దక్షిణం దిక్కు వైపు వాళ్ళు క్రూరంగా అన్నారు.

"మా వైపు చూసేలా విగ్రహం పెట్టిన మరుక్షణం బాంబులు బద్దలవుతాయి. రక్తం ఏరులై ప్రవహిస్తుంది" ఉత్తరం వైపు వాళ్ళు ఉగ్రంగా చెప్పారు.

అక్కడ వాతావరణం బాగా వేడెక్కింది. చూస్తుండగానే నాలుగు దిక్కుల వైపు నివ సిస్తున్న వాళ్ళ మధ్య గొడవ పెరిగి పెద్దదై చివరికి అది కలబడే స్థాయికి చేరుకుంది.

రాజు మాత్రం నిమిత్తమాత్రుడిలా చూస్తున్నాడు.

అక్కడ ఓ చిన్నపాటి కురుక్షేత్ర యుద్ధమే జరిగింది. ఎవరు ఎవరిని కొడుతున్నారో ఎవరికీ అర్థం కావడం లేదు. తలలు పగులు తున్నాయి. కాళ్ళూ చేతులు విరుగుతు న్నాయి. ఒక అరగంట గడిచేసరికి అంతా నేల మీద ఒరిగిపోయి బాధగా మూలగసా గారు. జుట్టురేగి, బట్టలు చిరిగి పీలికలై పిచ్చి కుక్కల మధ్య చిక్కుకున్న అభాగ్యుడిలా పడి ఉన్న నాయకుడి దగ్గరకు రాజు వెళ్ళాడు.

"చందా కావాలా?" అడిగాడు రాజు.

## ఇంటర్వ్యూ



భల్లాసింగ్ భటిండావాలా ఓ కంపె నీకి ఇంటర్వ్యూకు వెళ్లాడు. యజ మాని అన్ని పరీక్షలు చేశాడు.. ఇక ఇంగ్లిష్ ఒకటే మిగిలింది. దాన్ని ప్రారంభించబోతూ యజమాని 'నేన డిగే ఇంగ్లిష్ మాటలకు వ్యతిరేక పదాలు చెప్పు' అన్నాడు. ఓకే అన్నాడు భల్లాసింగ్. పరీక్ష మొదలైంది.

'డే' అన్నాడు బాస్. వెంటనే భల్లా తడుముకోకుండా 'నైట్' అని చెప్పాడు. వెనువెంటనే బాస్ 'అగ్లీ' అన్నాడు. భల్లా ప్రెటీ అని చెప్పకుండా 'పిట్టీ' అని చెప్పాడు.

ఇకనేం? బాస్‌కు కోపం వచ్చింది 'రాంగ్' అని అరిచాడు.

వెంటనే 'రైట్' అంటూ అరిచాడు భల్లా.

తిక్కరేగిన బాస్ 'షటప్' అన్నాడు.

ఆయన ఫీలింగ్సేమీ పట్టించుకోని భల్లా 'స్పీక్' అన్నాడు ఉత్సాహంగా.

బాస్‌కు మండింది. 'గెట్ అవుట్' అన్నాడు. వెంటనే భల్లా 'కమిన్' అన్నాడు మర్యాదగా.

'యు ఆర్ రిజెక్టెడ్'

'ఐ యామ్ సెలక్టెడ్'

ఇలా భల్లా ఎక్కడా ఆగకపోవ డంతో చేసేదిలేక బాస్ అతన్ని సెలక్ట్ చేసుకున్నాడు.

ఇతరులని తప్పుబట్టడం పూర్తి అయిపోయాక కొందరు తమనితాము నిందించుకుంటారు. - పాటర్

"విపరీతంగా దాహంగా ఉంది. కాసిని మంచినీళ్ళు తెచ్చి నా గొంతులో పొయ్యి" నిస్త్రాణగా అన్నాడతను.

రాజు గుంభనంగా నవ్వుకుంటూ అక్కడ నుండి కదిలాడు.

ఆ తర్వాత హాస్పటల్ పాలైన ఆ చందా రాయుళ్ళు ఇదంతా కావాలని రాజు ఆడిన నాటకమనీ, జాతకాల పేరుతో తామందరి దగ్గర డబ్బులు గుంజడమే కాకుండా వాస్తు పేరుతో తమ మధ్య గొడవలు సృష్టించి తమకు తామే కొట్టుకునేలా చేసి అతను తాపీగా వినోదం చూశాడనీ గ్రహించారు. ఎలాగైనా రాజు చేసిన నిర్వాకానికి వాడు తగిన శిక్ష అనుభవించాలనే ఉద్దేశ్యంతో వాళ్ళంతా రాజు తండ్రి శివప్రసాదు గారి వద్దకు బయల్దేరి వెళ్ళారు.

రాఘవరావు, బాపినీడు, చందారాయుళ్ళు ఒకరి తర్వాత ఒకరిగా చెప్పినదంతా శివ ప్రసాదుగారు చాలా శ్రద్ధగా విన్నారు. ఆయన మొహంలో ఆశ్చర్యం, నివ్వెరపాటు కన్పించాయి. తన కొడుకు ఇలాంటి ఆకృత్యా లకు పాల్పడ్డాడు అంటే ఆయనకి చాలా బాధగా అవమానంగా అనిపించింది. అయితే న్యాయానికి ఎంతో విలువ ఇచ్చే ఆయన తన గుండెను రాయి చేసుకున్నాడు.

గుమ్మం దగ్గర నిలబడి అప్పటివరకు వాళ్ళు చెప్తున్నదంతా వింటున్న రాజు కన్న తల్లి సుభద్రమ్మ, వదినలు అరుణ, కళ్యాణిల మొహాలు పాలిపోయాయి. ఇలా రాజు మీద ఫిర్యాదులు రావడం వారు ఊహించని విషయం. అయితే ఈ విషయమై తన భర్త రాజుకి ఏం శిక్ష విధిస్తాడోనని ఆ కన్నతల్లి హృదయం తల్లడిల్లిపోసాగింది. రాజు వది నల పరిస్థితి కూడా అలాగే ఉంది.

దూరంగా ట్రాక్టరు దగ్గర ఏదో మెకాని కల్ పని చేసుకుంటున్న రాజు అన్నలు నరేష్, వాసు మాత్రం ఆ ఫిర్యాదుల్ని అసలు పట్టించుకోలేదు.

అదే సమయంలో దూరంగా పెద్దగా కల కలం విన్పించింది. అంతా తలలు తిప్పి అటుగా చూశారు. ఊరు ఊరంతా అక్కడికి కదిలి రావడం కన్పించింది. ఒక మహాప్ర వాహంలా వస్తున్న జనాన్ని చూసి అంతా ఆశ్చర్యపోయారు. కాని ఏం జరగబోతుందో ముందుగా ఊహించిన నరేష్, వాసులు తమలో తాము నవ్వుకున్నారు.

శివప్రసాద్‌గారు కుర్చీలోంచి లేచి తన ఇంటి ముందుకొచ్చి నిల్చున్న ఆ జనం వద్దకు వెళ్లారు. చేతులు జోడించి అందరికీ నమస్కరించి "మీరంతా ఒకేసారి వచ్చా రంటే ఏదో ముఖ్యమైన విషయమే అయి వుంటుంది. మీరు కూడా మా చిన్నబ్బాయి రాజు మీద ఫిర్యాదు చేయడానికే వచ్చారా? " అని అనుమానంగా అడిగాడు.

ఆ మాటలు విని వాళ్లంతా ఒకర్నొకరు చూసుకున్నారు. వాళ్లలో గుసగుసలు బయ ల్దేరాయి. ఒక పెద్దాయన ముందుకొచ్చి "మేం వచ్చింది రాజు మీద ఫిర్యాదు చెయ్యా డానికి కాదు. రాజు మాకు చేసిన సహాయా నికి కృతజ్ఞతలు చెప్పి పోదామని" అన్నాడు.

ఆ మాటలు విన్న శివప్రసాదుగారు దిగ్భ్రాంతులయ్యారు. గుమ్మం దగ్గర ఎంతో ఆందోళనగా నిలబడి వున్న సుభద్రమ్మ, అరుణ, కళ్యాణి ఓ ఆనంద కెరటం అమాంతం వచ్చి తమని ముంచెత్తి వుక్కిరి బిక్కిరి చేస్తున్నట్లుగా ఫీలయ్యారు.

"ఏమిటి మీరనేది? " విస్మయంగా అడి గారు శివప్రసాదు గారు.

"అవును అయిదేళ్ళకోసారి ఎలక్షన్లు వచ్చి నప్పుడల్లా అదుగో ఆ రాఘవరావు, ఆ బాపి నీడులు మాత్రమే ఎవరూ లేనట్టుగా పోటీ చేస్తూ ఒకరి తర్వాత ఒకరుగా గెలుస్తూ ప్రజలసొమ్ముని చాలాయేళ్ళుగా దారుణంగా దోచుకుంటున్నారు. ఇంతవరకు ఈ ఇద్దరూ ఈ ఊరికి చేసిందేమీ లేదు. ఇలానే ఈ ఇద్దరూ మరి కొన్నేళ్ళు గెలుస్తూ పోతే ఈ ఊరు ఏ మాత్రం అభివృద్ధి చెందకపోగా ప్రజలంతా కడుపు చేత పట్టుకుని ఊరు

విడిచి వలసపోవాల్సిన దుస్థితి పడుతుంది. తమ స్వార్థమే తప్ప ప్రజల క్షేమం ఏ మాత్రం పట్టని ఇలాంటి దౌర్భాగ్య నాయకులకి తగిన విధంగా బుద్ధి చెప్పమని మేమంతా రాజును కోరాం. ఆ ఇద్దరి పీడ ఈ ఊరికి లేకుండా చేస్తానని హామీ ఇచ్చిన రాజు ఆ ఇద్దర్నీ వాళ్ళ వేళ్ళతోనే వాళ్ళ కళ్లు పొడుచుకునేలా చేసి చివరికి ఆ ఇద్దరికి ఎలక్షన్లో డిపాజిట్లు దక్కకుండా చేశాడు.

అలాగే అదుగో ఆ చందారాయుళ్ళని చూడండి. వాళ్ళకు చెమటోడ్చి నాలుగు రాళ్ళు సంపాదించడం అసలు ఇష్టం వుండదు. అయాచితంగా వచ్చే సొమ్మంటే వాళ్ళకు బాగా ఇష్టం. తమకున్న వ్యసనాలు తీర్చుకోవడం కోసం ఏదో ఒక సాకుతో ఊరి మీద పడి చందాలు వసూలు చేయడం, ఎవరయినా ఇదేం అన్యాయం అని నిలదీస్తే వాళ్ళని మూకుమ్మడిగా చితకబాదడం చేస్తూ వస్తున్నారు. వీళ్ళతో ఊరు ఊరంతా విసిగిపోయింది. అందుకే మేమంతా రాజుని కలిసి వాళ్ళ విషయంలో కూడా ఊరిని కాపాడమని కోరాం. వాళ్ళ సంగతి తాను చూసుకుంటానని హామీ ఇచ్చిన రాజు వాళ్లల్లో వాళ్ళు కొట్టుకునేలా చేసి చివరికి హాస్పటల్ బెడ్స్ ఎక్కించి వాళ్ళకు తగినవిధంగా బుద్ధి చెప్పాడు.

సంవత్సరాల తరబడి మేము అనుభవిస్తున్న ఈ రెండు సమస్యల్నుండి రాజు మమ్మల్ని విముక్తుల్ని చేశాడు. అందుకే మేమంతా హృదయపూర్వకంగా అతనికి కృతజ్ఞతలు చెప్పుకుందామని వచ్చాం" అన్నాడు ఆ పెద్దాయన. అంతా విన్న శివప్రసాదుగారు నిర్ఘాంతపోయారు. రాజకీయ నాయకులిద్దరి మొహాలు నెత్తురు చుక్క లేనట్టుగా పాలిపోయాయి. చందారాయుళ్ళ తలలు సిగ్గుతో వాలిపోయాయి.

సుభద్రమ్మ ఆనందంతో చెమ్మగిల్లిన కళ్ళను పమిటచెంగుతో ఒత్తుకుంది. సంభ్రమాశ్చర్యాలతో అరుణ, కళ్యాణి అత్తగారి వైపు చూశారు. అప్పటివరకు వాళ్ళ గుండెల్లో పేరుకున్న ఆందోళన తొలగిపోయింది.

శివప్రసాదుగారు తేరుకుని రాజకీయ నాయకులవైపు, చందారాయుళ్ళ వైపు నిప్పులు చెరిగేలా చూశారు. మరుక్షణం వాళ్ళంతా చలిజ్వరం వచ్చిన వాళ్ళలా వణుకుతూ వచ్చి ఆయన పాదాల మీద పడిపోయారు.

"ఇంతకాలం బుద్ధి తక్కువై దుర్మార్గంగా ప్రవర్తించాం. ఇంకెప్పుడూ ప్రజలకి అన్యాయం చేయ్యం. అంతేకాదు మా యావద్దాస్తిని ఈరోజే ప్రజలకు రాసేస్తాం. దయచేసి పెద్దమనసుతో మమ్మల్ని మన్నించండి" అని ప్రాధేయపడ్డారు.

అంతగా పశ్చాత్తాపపడుతున్న వాళ్ళ వైపు చూస్తూ "ఇదే మీకు చివరి అవకాశం. ఈసారికి క్షమించి వదిలేస్తున్నాను. మరోసారి ప్రజల్నుండి మీ మీద ఒక్క ఫిర్యాదు అందినా మిమ్మల్ని కాపాడటం ఎవరి వల్లా కాదు" ఉగ్రమూర్తిలా హెచ్చరించారు శివప్రసాదుగారు.

బ్రతుకుజీవుడా అనుకుంటూ వాళ్ళు బుద్ధిగా తలలూపారు.

రాజుని ఒక్కసారి పిలవండి. కృతజ్ఞత చెప్పుకుని వెళ్ళిపోతాం అన్నారు జనం ముక్తకంఠంతో. రాజు ఇంట్లో లేడన్న సంగతి తెల్సి వాళ్ళంతా నిరాశా నిస్పృహలకి గురయ్యారు.

సరిగ్గా అప్పుడే ఎవరో అరిచి చెప్పారు.

"అదుగో రాజు వస్తున్నాడు"

అంతా తలలు తిప్పి చూశారు. దూరం నుండి రాజు వస్తూ కన్పించాడు. అతన్ని చూడగానే జనం పక్కకు తప్పుకుని దారిచ్చారు.

అక్కడికి వచ్చిన రాజును అపురూపంగా చూశారు శివప్రసాదు.

"ఎక్కడికి వెళ్ళావు రాజూ?" ఆప్యాయంగా అడిగారాయన.

"శ్మశానానికి"

అక్కడున్న ప్రతి ఒక్కరూ అతను చెప్పిన సమాధానానికి ఉలిక్కిపడ్డారు.

"ఎందుకు?" శివప్రసాదుగారు గాభరాపడుతూ అడిగారు.

"ఈ ప్రపంచంలో అతి గొప్ప పాఠశాల శ్మశానం నాన్న గారూ! అక్కడ కాలుతున్న చితిమంటలు, బూడిద కుప్పలు, పుర్రెలు, సమాధులు నాకు మనిషి చావు పుటుకల సారాంశాన్ని విశదీకరించడమే కాకుండా పైసా లేకుండా పుట్టి, పైసా కూడా మన వెంట పట్టుకుపోయే అవకాశం వుండని ఈ పైసా లేని ప్రయాణంలో పైసల మీద నాకు ఎలాంటి మమకారం కలగకుండా, నాలో ఏ మాత్రం స్వార్థం తలెత్తకుండా అవన్నీ నాలో జ్ఞానదీపాల్ని వెలిగించి నా ఆత్మను కాంతివంతం చేస్తాయి. నాలోని మానవత్వాన్ని మేల్కొలిపి సన్మార్గం వైపు నన్ను నడిపిస్తాయి. అందుకే నెలకోసారి నేను శ్మశానానికి వెళ్ళి కొన్ని గంటలు అక్కడ గడిపి వస్తాను" అన్నాడు రాజు.

పనుల్లోనే కాక తనని తాను సంస్కరించుకోవడంలో కూడా ఎంతో పరిపక్వత చెందిన అందరికీ ఆదర్శంగా నిలుస్తున్న కొడుకు వైపు చెమ్మగిల్లిన కళ్ళతో చూశారు శివప్రసాదు గారు.

"రాజూ! నీకోసం ఊరంతా తరలివచ్చింది. నువ్వు వారికి చేసిన సాయానికి మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు చెప్పుకోవాలనుకుంటున్నారు" అన్నారు శివప్రసాద్‌గారు.

రాజు ప్రజలవైపు తిరిగి చేతులు జోడించి అందరికీ నమస్కారం చేశాడు.

"రాజా బాబూ! మా అందరి సమస్యల్ని పరిష్కరించావు. సంవత్సరాల తరబడి మేము అనుభవిస్తున్న కష్టాల్ని తొలగించావు. దుర్మార్గులకి తగిన విధంగా బుద్ధి చెప్పి ఇంకోసారి వాళ్ళు ప్రజల జోలికి రాకుండా చేశావు. నువ్వు మా అందరికి అండగా వుండటం మా అదృష్టం. నువ్వు నూరేళ్ళపాటు మా అందరి ఆయుష్షని పోసుకుని చల్లగా వుండాలి" అన్నారు జనమంతా.

రాజు మృదువుగా నవ్వాడు. వాళ్లంతా రాజు, శివప్రసాదుగారి వద్ద నుండి సెలవు తీసుకుని వెళ్ళిపోయారు.

అంతా వెళ్లిపోయినా అక్కడ ఒకే ఒక వ్యక్తి నిలబడి వున్నాడు. ఆయన విశ్వనాధం మాస్టారు. రాజుని చిన్నతనంలో చేరదీసి చదువు విలువని వివరించి చదువుపట్ల అమితాసక్తిని కలిగించి విద్యాబుద్ధులు నేర్పిన గురువాయన. రాజు డిగ్రీ చదివే రోజుల్లో ఆయన స్కూల్నుండి రిటైర్ అయి హైద్రాబాద్‌లో ఇన్‌స్పెక్టర్‌గా చేస్తున్న కొడుకు దగ్గరికి వెళ్ళిపోయాడు. అప్పట్నుంచీ ఆయన ఇంతవరకు ఈ ఊరు రాలేదు. తప్పని పరిస్థితుల్లో ఆయన ఇప్పుడు ఈ ఊరిలో ఉన్న తన పొలాల తాలూకు కౌళ్ళు వసూళ్లు చేసుకోవడం కోసం వచ్చాడు.

ఆయన్ని చూడగానే ఆ ఇంటిల్లిపాది సంభ్రమాశ్చర్యాలకు గురయ్యారు. రాజు పరుగున ఆయన దగ్గరకు వెళ్ళి ఆయన పాదాలకు నమస్కరించాడు. మాస్టారు అతన్ని పైకి లేపి ఆలింగనం చేసుకున్నాడు.

"ఎంతసేపైంది మాస్టారూ! మీరు వచ్చి?" భక్తిపూర్వకంగా చూస్తూ అడిగాడు రాజు.

"ఊరంతా నీ గొప్పతనాన్ని వేనోళ్ళ పొగుడుతున్నప్పుడు వచ్చాను. ఎంతో ఎత్తుకి ఎదిగిపోయిన నిన్ను చూసి చాలా గర్వపడ్డాను" అన్నాడాయన ఆప్యాయంగా.

రాజు సిగ్గుపడుతూ నవ్వి "రండి మాస్టారూ" అన్నాడు సాదరంగా ఆహ్వానిస్తూ.

"అంతా కులాసాయేనా మాస్టారూ" సుభద్రమ్మ, శివప్రసాదు పలకరింపుగా అడిగారు.

ఆయన అస్పష్టంగా తలూపాడు తప్ప సమాధానం చెప్పలేదు. ఆ భార్యాభర్తలిద్దరూ అయోమయంగా ఒకర్నొకరు చూసుకున్నారు.

ఆ రాత్రి భోజనాలు అయ్యాక ఆ ఇంటి ఆవరణలో వరుసగా అందరికీ మంచాలు ఏర్పాటు చేశారు. నీలాకాశంలో చంద్రుడు

నిండుగా నవ్వుతున్నాడు. మల్లెపందిరి, సన్నజాజి తీగమీదినుంచి వీస్తున్న గాలి మత్తయిన పరిమళాల్ని మోసుకొస్తోంది.

విశ్వనాథం మాస్టారు, శివప్రసాదుగారు వచ్చి పక్కపక్కనే వున్న మంచాల మీద కూర్చున్నారు.

"మాస్టారూ! మిమ్మల్నో మాట అడగాలనుకుంటున్నాను" అన్నారు శివప్రసాదు.

"ఏమిటది? " చిర్నవ్వుతో అడిగారు మాస్టారు.

"ఇంతక్రితం అంతా కులాసాయేనా మాస్టారూ అని నేను అడిగితే అస్పష్టంగా తలూపారు తప్ప సరిగ్గా సమాధానం చెప్పలేదు. ఎందుకని? " అడిగారు శివప్రసాదు అనుమానంగా.

మాస్టారు వెంటనే సమాధానం చెప్పలేదు. ఆత్రంగా చూస్తూ శివప్రసాదుకి సన్నగా వెక్కిళ్లు విన్పించాయి. ఆయన ఉలిక్కిపడ్డారు.

మాస్టారు వుత్తరీయాన్ని నోటికి అడ్డం పెట్టుకుని రోదిస్తున్నాడు.

"మాస్టారూ! ఏమైంది? " కంగారుగా ఆయన దగ్గరకి వెళ్లి భుజం మీద చేయి వేస్తూ అడిగారు శివప్రసాదు.

అంతలో మిగిలిన వాళ్ళు కూడా ఆదుర్దా పడుతూ అక్కడికి వచ్చారు. మాస్టార్ని అలా చూస్తుంటే అందరి హృదయాలూ తరుక్కుపోయాయి.

దుఃఖంతో ఆయనకు మాటలు రావడం లేదు. రాజు ఆయన కన్నీరు తుడుస్తూ "మాస్టారూ! మీ శిష్యుడు రాజు ఇంకా బతికే వున్నాడు. మీరు ఇలా ఏడుస్తుంటే నేను తట్టుకోలేను. దయచేసి అసలేం జరిగిందో చెప్పండి" అన్నాడు.

ఆ మాటలకి ఆయన కొంత ఊరట చెందాడు.

"చెప్తాను. అంతా చెప్తాను. మీకు కాకపోతే నా కడుపులోని బాధ ఇంకెవరికి చెప్తాను" అన్నాడు బరువుగా నిట్టూరుస్తూ. ఆయన చెప్పడం మొదలు పెట్టాడు.

"మా అబ్బాయి మధు ముషీరాబాద్ పోలీస్ స్టేషన్లో సర్కిల్ ఇన్స్పెక్టరుగా పనిచేసేవాడు. ఒకరోజు ఎవరో ఒక అనామకుడు ఫోన్ చేసి నేషనల్ కాలేజీలో మినిస్టరు ఓంప్రకాష్ తమ్ముడు పాండు గంజాయి, హెరాయిన్ లాంటి మాదక ద్రవ్యాల్ని స్టూడెంట్సుకి యథేచ్ఛగా అమ్ముతున్నాడనీ, వెంటనే వెళితే అతన్ని రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుకోవచ్చనీ చెప్పాడు. మధు వెంటనే కానిస్టేబుల్స్‌ని వెంటబెట్టుకుని వెళ్లి మాదక ద్రవ్యాలు అమ్ముతున్న పాండుని అతని స్నేహితుల్ని అరెస్టు చేశాడు. ఆ విషయం తెలిసిన మినిష్టరు ఓం ప్రకాష్ మందీ మార్బలంతో స్టేషన్‌కి వచ్చి తన తమ్ముడిని ఆయన వదిలిపెట్టమని ఆదేశించాడు. అయితే మధు ఆయన ఆదేశాల్ని ఏ మాత్రం ఖాతరు చేయలేదు. దాంతో అహం దెబ్బతిన్న ఓంప్రకాష్ ఆగ్రహంతో వూగపోతూ మధు అంతు చూస్తానని బెదిరించి వెళ్ళాడు.

ఆ తర్వాత నేషనల్ కాలేజి ప్రిన్సిపాల్‌ని, లెక్చరర్స్‌ని కరెన్సీ కట్టలతో తనకు అనుకూలంగా మార్చుకున్న ఓంప్రకాష్ వాళ్ళ చేత కోర్టులో పాండు చాలా బుద్ధిమంతుడనీ, చదువు తప్ప అతనికి మరో ధ్యాస వుండదనీ, అలాంటి ఉత్తమ స్టూడెంటు తమ కాలేజీలో చదవడం తమకు గర్వకారణం అనీ సాక్ష్యం చెప్పించాడు. దాంతో కోర్టు ఆ కేసుని కొట్టి పారేసింది.

ఆ కక్షతో ఒక రోజు క్రాస్ రోడ్స్‌లో రెండు వర్గాల మధ్య ఘర్షణ జరుగుతుందని వెంటనే రాకపోతే అక్కడ చాలామంది అమాయకుల ప్రాణాలు పోయే పరిస్థితి వుందని ఒక వ్యక్తి చేత మధుకి ఫోన్ చేయించాడు పాండు. స్టేషన్లో ఇద్దరు కానిస్టేబుల్స్‌ని మాత్రం వుంచి మధు మిగిలిన కానిస్టేబుల్స్‌తో క్రాస్ రోడ్స్‌కి బయల్దేరి వెళ్ళాడు. అదే సమయంలో పాండు తన స్నేహితులతో కల్సి స్టేషన్‌కి వచ్చి కానిస్టే

బుల్స్ సాయంతో సెల్‌లో వున్న ఒక గుండాని అతిదారుణంగా చంపి ఆ కేసు మధుమీద పడేలా చేశాడు. ఎస్.పి. ముందు కానిస్టేబుల్స్ అంతా ఇంటరాగేషన్ పేరుతో మధు కావాలని ఆ గుండాను చంపాడని లేని పోనివి కల్పించి చెప్పారు. వాళ్ళందరికీ అంతకు ముందురోజే ఓంప్రకాష్ నుండి భారీ యెత్తున ముడుపులు అందాయి. మధుని గుడ్డిగా అనుమానించి అరెస్టు చేయించాడు ఎస్.పి.

కోర్టులో ఆ హత్య చేసింది మధు అని కానిస్టేబుల్స్ సాక్ష్యం చెప్పారు. దాంతో మధుకి యావజ్జీవ కారాగార శిక్ష విధించింది కోర్టు.

అదే సమయంలో మధు భార్య తులసికి హార్ట్ ఎటాక్ వచ్చింది. ఆమెను వెంటనే హాస్పిటల్లో చేర్పించాను నేను. అప్పటికప్పుడు ఆమెకు ఆపరేషను చెయ్యకపోతే ప్రాణానికి ప్రమాదమని డాక్టర్లు చెప్పడంతో ఆపరేషన్‌కి అంగీకరించాను నేను. తులసికి ఆపరేషన్ జరిగింది. డాక్టరు నన్ను పిలిచి ఆమె మనసుకి బాధ కల్గించే ఏ విషయం కూడా ఆమెకు చెప్పవద్దని అలా చెప్తే ఆమె ప్రాణానికి ప్రమాదమని హెచ్చరించాడు. నేను మధు జీవితఖైదు పడిన సంగతి నాగుండెల్లోనే దాచుకుని ఆమెకు మాత్రం మధుని ప్రభుత్వం ప్రత్యేకమైన ట్రయినింగు కోసం అలహాబాదుకు పంపించిందని ఆరు నెలల తర్వాత తిరిగి వస్తాడని అబద్ధం చెప్పాను.

కనీసం ఫోనులోనైనా మధుతో మాట్లాడతానని ఆమె అన్నప్పుడు నా మనసు ఎంతగా విలవిలలాడిపోయిందో నాకు మాత్రమే తెల్సు

ఆ ట్రయినింగు చాలా రహస్యంగా జరుగుతుందనీ, ఆరునెలల వరకు మధుకి బయట ప్రపంచంతో సంబంధాలు ఉండవనీ అప్పటివరకు మనం వెయిట్ చెయ్యక తప్పదని గుండె రాయిచేసుకుని మరో అబద్ధం చెప్పాను. అప్పట్నుంచీ ఆరునెలలు ఎప్పుడు గడుస్తాయా ఎప్పుడు తన భర్తను చూస్తానా అని ఆ పిచ్చితల్లి ఒక్కో రోజుని ఒక్కో యుగంలా గడుపుతూ ఎంతో ఆరాటంగా ఎదురుచూస్తోంది. ఇప్పటికి అయిదు నెలలు గడిచిపోయాయి. ఇంకో నెల మాత్రమే వ్యవధి ఉంది. ఈలోగా మధు జైల్నుండి తిరిగి రాకపోతే తులసి నన్ను తప్పక మధు విషయమై నిలదీస్తుంది. అప్పుడు నేను నిజం చెప్పకతప్పదు. ఆ మరుక్షణం బలహీనంగా ఉండే ఆమె గుండె ఆగిపోకమానదు. లోకం తెలియని ఇద్దరు పసివాళ్లు అనాథలవుతారు. ఈ వయసులో ఎవరికీ రాకూడని విషమపరిస్థితి నాకు వచ్చింది. నా కుటుంబాన్ని ఈ సమస్యల వలయం నుండి ఎలా బయటపడవేయాలో తెలియక తల్లడిల్లిపోతున్నాను" అంటూ బావురుమన్నాడాయన.

ఆయన దీనగాథ ప్రతి హృదయాన్నీ కలచివేసింది. "మాస్టారూ! మీకు మేమున్నాం" అనునయంగా అన్నారు శివప్రసాదుగారు.

మాస్టారు తలెత్తి శివప్రసాదుగారి చేతులు పట్టుకున్నాడు.

"మీరు... మీరు నాకో సహాయం చేయాలి" అన్నాడు వేడికోలుగా.

"మీరు అడగడం కాదు మాస్టారూ! ఆదేశించండి. ఆ అధికారం మీకుంది" అన్నారు శివప్రసాదుగారు.

మాస్టారు తటపటాయిస్తూ, "త్రేతాయుగంలో విశ్వామిత్రుడు దశరథమహారాజు దగ్గరికి వచ్చి యాగ సంరక్షణార్థం రాముడిని తనవెంట పంపించమని అడిగినప్పుడు తన పంచప్రాణాల్నే ఆ మహర్షి అడిగినట్లుగా దశరథ మహారాజు విలవిలలాడిపోయాడు. ఇప్పుడు నా కొడుకుని రక్షించుకోవడం కోసం రాజుని నావెంట హైద్రాబాదుకి పంపించమని మిమ్మల్ని కోరితే ఆ దశరథ మహారాజులా మీరెంత కలవరపడ



ముఖంలో కనిపించే సౌజన్యం, ఆత్మలోని సామరస్యానికి ప్రతీక. - హాబ్లిట్

తారోనని అడగడానికి సందేహిస్తున్నాను." అన్నాడు.

ఆ మాటలు విని శివప్రసాదుగారు తేలికగా నవ్వేశారు.

"భలేవారే మాస్టారూ! రాజు మీ శిష్యుడు. అతన్ని మీవెంట తీసుకువెళ్లే హక్కు మీకుంది. ముఖ్యంగా రాజు మూలంగా సంక్షోభంలో ఉన్న మీ కుటుంబం ఒడ్డున పడుతుందంటే మాకన్నా ఎక్కువ సంతోషించేవాళ్లు ఇంకెవ్వరూ ఉండరేమో. మీరు ఇంకేం ఆలోచించకుండా రాజుని మీవెంట తీసుకువెళ్లండి" అన్నారాయన హామీ ఇస్తూ.

మాస్టారు మొహం వికసించింది.

"ఈ ఊరికి వచ్చిన రెండు సమస్యల్ని అతిసునాయాసంగా పరిష్కరించి ప్రజల అభినందనల్ని పొందిన రాజు ఒక్కడే నా కుటుంబాన్ని రక్షించగలడన్న నమ్మకం నాకు ధృఢంగా కలిగింది" అని రాజువైపు చూసిన మాస్టారు "ఏం రాజూ! ఉదయం నాతోపాటు హైద్రాబాద్ వస్తావా?" అని అడిగారు.

"నేను హైద్రాబాదు తప్పక వస్తాను మాస్టారూ! కాని మీతోపాటు రాను. నేను ఒంటరిగా బయల్దేరి రేపు రాత్రికి వస్తాను" రాజు సాలోచనగా అన్నాడు.

"ఎందుకని?" మాస్టారు అర్థంకానట్టుగా అడిగాడు.

"మీరు మరోలా భావించొద్దు మాస్టారూ! నేను ఎవరినో ఎవరికీ తెలియకుండా ఒక అజ్ఞాతవ్యక్తిలా హైద్రాబాద్‌లో ఉంటూ ఆ మినిష్టరు ఓంప్రకాష్‌ని, అతని తమ్ముడు పాండుని ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్లు తాగించి మీ అబ్బాయిని జైల్నుండి నిర్దోషిగా బయటకు తీసుకువస్తాను" అన్నాడు రాజు స్థిరంగా.

రాజు పథకం ఏమిటో అర్థమైన మాస్టారి మొహం వెలిగిపోయింది. ఆయన షర్టు జేబులోంచి ఒక ఫొటో తీసి రాజుకి అందించాడు. ఆ ఫొటోలో మెరుపుతీగలాంటి అమ్మాయి పోలీసు యూనిఫాంలో ఉంది. ఖాకీబట్టల్లో ఉన్న ఆ అజంతా శిల్పం ఎవరో రాజుకి అర్థంకాలేదు.

"ఎవరు మాస్టారూ ఈ అమ్మాయి?" రాజు ఆసక్తిగా అడిగాడు.

"ఆమె నా కోడలు తులసికి చెల్లెలు. పేరు నవీన. ప్రస్తుతం ఆమె రాణిగంజ్ పోలీసు స్టేషన్లో సర్కిల్ ఇన్‌స్పెక్టరుగా చేస్తోంది. నీకు హైద్రాబాద్‌లో ఏదైనా అవసరం కలిగితే ఆమెను కలవవచ్చు" అన్నాడు మాస్టారు.

రాజు ఆ ఫొటోని తిరిగి ఆయనకి ఇచ్చేస్తూ "మాస్టారూ! అన్ని పనులు చక్కబడేవరకు నా ఉనికిని మీరు మీ బంధువులకిగాని ఆత్మీయులకిగాని ఎట్టి పరిస్థితుల్లో కూడా చెప్పవద్దు. అలాగే ఈ ఇన్‌స్పెక్టరుతో చెప్పవద్దు" అన్నాడు.

అలాగేనన్నట్లుగా తలూపాడు ఆయన.

"మీరిక నిశ్చింతగా ఉండండి మాస్టారూ! మీ అబ్బాయి మధుని రక్షించే బాధ్యత నాది" అన్నాడు రాజు భరోసాగా.

ఆయన బ్యాగులోంచి కొంత డబ్బు తీసి రాజుకి అందించాడు.

"హైద్రాబాద్ అంటే ఎంతో ఖర్చుతో కూడిన వ్యవహారం. ఖర్చుల నిమిత్తం ఈ డబ్బు ఉంచు" అన్నాడు మాస్టారు.

రాజు దెబ్బతిన్నట్టుగా చూశాడు.

"మాస్టారూ! ఈ డబ్బు నేను మీదగ్గర తీసుకుంటే అది కిరాయి అవుతుంది. అంతేగాని గురుదక్షిణ అన్పించుకోదు. నా తెలివితేటలు, ధైర్యమూ, సమయస్ఫూర్తి చూసి మీరు నాకు ఈ బాధ్యతను అప్పగించారు. నేను మీ నమ్మకాన్ని నిలబెడుతూ హైద్రాబాద్‌కి కట్టుబట్టలతో చేతిలో పైసా లేకుండా వస్తాను. పైసాలేని ఈ ప్రయాణంలో పైసల కోసం ఎన్ని అక్రమాలకైనా సిద్ధపడే

బురద చల్లకండి. మీరు ఉద్దేశించిన వారిపై అది పడకపోవచ్చు కానీ, మీ చేతులు మాత్రం బురద అవుతాయి. - పార్కర్

దుర్మార్గుల అంతు చూస్తాను. అమాయకుడైన మీ అబ్బాయిని రక్షిస్తాను" అన్నాడు రాజు నమ్మకంగా.

మాస్టారు సంతృప్తిగా చూశాడు.

★ ★ ★

రాజు ఫ్లాట్‌ఫారం మీదికి వచ్చాడు. అప్పుడే కదిలి వేగం పుంజుకుంటున్న ట్రయిన్‌తోపాటు పరుగుతీస్తూ అతను కన్పించిన కంపార్టుమెంటు డోరు దగ్గర ఉన్న రాడ్డు పట్టుకుని అమాంతం ట్రయిను ఎక్కేశాడు. గుమ్మం వరకు ఎక్కగలిగాడుగాని అక్కడనుండి ముందుకు కదలడానికి వీల్లేకుండా ఆ కంపార్టుమెంట్ మొత్తం ప్రయాణీకులతో కిక్కిరిసి ఉంది. అప్పుడుగాని అది జనరల్ కంపార్టుమెంటు అని రాజు గమనించలేదు.



ఎదురుగా బాత్ రూము పక్కన ఒక సన్యాసి నిలబడి ఉన్నాడు. కాషాయ వస్త్రాలు, కమండలం, దండం, జింకచర్మం, జడలు కట్టిన జుట్టు, రుద్రాక్షలు, విబూది రేఖలతో ఉన్నాడతను.

అతను అప్పుడప్పుడూ శూన్యంలోకి చూస్తూ "నువ్వు వట్టిది. నేను వట్టిది. అంతా వట్టిది వట్టిది. చివరికి అంతా మట్టి ఇది, మట్టి ఇది" అంటున్నాడు నిర్వికారంగా.

ఆ సన్యాసి పక్కన పొట్టిగా లావుగా ఉన్న ఒకతను నిలబడి ఉన్నాడు. అతని పేరు పట్టాభి. తనతో పెట్టుకుంటే ఎవరికైనా పుట్టగతులుండవన్నది అతని నమ్మకం. అతని చేతిలో సర్టిఫికెట్స్ ఉన్న ఒక ఫైలు ఉంది. హైద్రాబాదులోని ఒక కంపెనీకి ఉద్యోగ నిమిత్తం ఇంటర్వ్యూకి వెళ్తున్నాడతను.

అది అతనికి వందవ ఇంటర్వ్యూ. ఆ ఉద్యోగమైనా వస్తుందన్న నమ్మకం లేదు.

సన్యాసి శరీరం నుండి భరించలేనంత దుర్గంధం వెలువడుతోంది. ఆ విషయాన్ని గమనించిన పట్టాభి అతనివైపు ఛీత్కారంగా చూశాడు.

"ఏమయ్యా! స్నానం చేసి ఎన్ని రోజులయింది? వంద ఎలుకలు ఒకే చోట ఆత్మహత్య చేసుకున్నట్లు, మూసీనది పొంగిపొరలి అందరీన ముంచెత్తినట్లు ఒకటే వాసన. ముక్కుపుటాలు అదరిపోతున్నాయనుకో!" అన్నాడు పట్టాభి ఏవగంపుగా.

ఆ సన్యాసి పట్టాభిని కోపంగా చూశాడు. "నన్నే అవమానిస్తావురా అక్కుపక్షీ! మాకు దేహం మీద ఎలాంటి మమకారం ఉండదురా! నీలాంటి వాళ్ళకే అలాంటి భావనలుంటాయి. ఆ స్వార్థం వల్లనే వచ్చే జన్మలో నువ్వు మందు లేని ఓ మహమ్మారి రోగంతో చాలా కాలం తీసుకుంటావు" అన్నాడు తీవ్రంగా.

పట్టాభి గతుక్కుమన్నాడు.

"స్వామీ! తెలియక ఏదో వాగాను. ఈ అల్పుడిని మన్నించండి. వచ్చే జన్మలో నాకు అలాంటి దుస్థితి పట్టకుండా ఉండే మార్గం ఏదీ లేదా? " అని అడిగాడు పట్టాభి దీనంగా.

సన్యాసి అతని మీద జాలిపడినట్లుగా తల పంకించి కొద్ది క్షణాలు కళ్ళుమూసుకుని ధ్యాన ముద్రలో వున్నాడు. తర్వాత కళ్ళు తెరిచి "నా దగ్గర వున్న విభూది వలన నీకు పాప విమోచనం లభిస్తుంది" అన్నాడు గంభీరంగా.

పట్టాభి మొహం వికసించింది.

"అయితే ప్రసాదించండి" అన్నాడు పట్టాభి భక్తిగా. ఆ సన్యాసి జోలెలోనుంచి

చిటికెడు విభూది దీసి పట్టాభికి ఇచ్చాడు. పట్టాభి దాన్ని భక్తిగా కళ్ళకద్దుకున్నాడు.

"దీన్నేం చేయాలి? " అడిగాడు పట్టాభి ఒద్దికగా. "విస్కీలో కలుపుకుని తాగాలి. అప్పుడు సర్వపాప హరణం జరుగుతుంది."

"విస్కీలోనా? "

"అవున్రా భడవా!"

"చిత్తం స్వామీ!"

"ఒక యాభై కొట్టరా!" అన్నాడు సన్యాసి

పట్టాభి ఇబ్బందిగా చూస్తూ "మిమ్మల్ని కొట్టడమా! అది నావల్ల కాదు స్వామీ!" అన్నాడు.

సన్యాసి చిరాకు పడ్డాడు.

"కొట్టడం అంటే నన్ను కొట్టడం కాదురా వృష్ఠపక్షీ! యాభై రూపాయలు కొట్టమంటున్నాను".

"ఏమిటీ చిటికెడు బూడిద యాభై రూపాయలా? " అన్నాడు పట్టాభి కళ్ళు పెద్దవిచేసి చూస్తూ.

నిప్పులు చెరిగేలా చూశాడు సన్యాసి.

"అది మామూలు విభూది అనుకుంటున్నావా? నేను స్వయంగా కైలాసం వెళ్ళి అక్కడనుండి తెచ్చిన విభూది అది. అమెరికా వెళ్ళాలంటే లక్షల రూపాయలు కావాలి. అదే కైలాసం వెళ్ళి రావాలంటే ఎన్ని వేల కోట్లరూపాయలు ఖర్చు చేసినా ఈ లోకంలో ఎవరికి సాధ్యంకాదు. అలాంటిది అంత విలువైన విభూదిని యాభై రూపాయలకు ఇస్తుంటే సంబరపడాల్సింది పోయి నోరెళ్ళ బెడతావా!" అంటూ సన్యాసి మండిపడ్డాడు.

వెంటనే పట్టాభి చెంపలు వాయించుకున్నాడు.

"తప్పయిపోయింది స్వామీ!" అని యాభై నోటు తీసి ఆ సన్యాసికి అందించాడు పట్టాభి.

ఇదంతా గమనిస్తున్న రాజుకి వళ్ళు మండింది. అమాయకులైన జనాన్ని మోసం చేసి ఆ సన్యాసి అలా యాభైలకుయాభైలు గుంజడం రాజుకి చాలా బాధన్పించింది. ఎలాగయినా అతని ఆట కట్టించాలనుకున్నాడు.

అతను హఠాత్తుగా శూన్యంలోకి చూశాడు. "హాయ్ రంభా! హాయ్ ఊర్వశీ! హాయ్ మేనకా!" అంటూ విష్ చేశాడు.

అక్కడున్న ప్రయాణీకులంతా దిగ్భ్రాంతులయ్యారు.- "ఏమిటీ అంతా కట్టకట్టుకుని ఎక్కడికి బయల్దేరారు? " అని కొద్దిక్షణాలు ఆగిన రాజు" ఆహాఁ... అలాగా!" అన్నాడు.

ప్రయాణీకులంతా బిత్తరపోయారు. రెప్ప వేయకుండా రాజునే ఆసక్తిగా చూడసాగారు. సన్యాసికి మాత్రం వళ్ళు మండిపోతోంది. ఇదంతా రాజు కావాలని ఆడుతున్న నాటకమనీ, నిజంగా అతనికి అప్సరసలెవరూ కన్పించడం లేదనీ, ఇలా చేయడం వలన తన మీద కంటే ఈ రాజుమీదనే జనానికి భక్తి విశ్వాసాలు బాగా పెరిగిపోతాయనీ, అప్పుడు తన నోట్లో మట్టేనని భావించిన ఆ సన్యాసి కలవరపడ్డాడు.

రాజు శూన్యంలోకి మందలింపుగా చూస్తూ "ఏమిటా బట్టలు. పళ్ళ కొట్టుమీద పాలిథిన్ పేపరు కప్పినట్టు. మీ స్వర్గంలో ఇంతకన్నా మందపాటి దుస్తులు దొరకవా? " అన్నాడు.

వెంటనే ఒక ప్రయాణీకుడు చొంగ కార్చుకుంటూ రాజు దగ్గరికి వచ్చాడు.

"ప్లీజ్! ఒక్కసారంటే ఒక్కసారి వాళ్ళను నాకు కన్పించమని చెప్పండి" అన్నాడు అర్థింపుగా.

రాజు శూన్యంలోకి చూసి అతని కోరికని తెలియజేశాడు. తర్వాత "అలాగా" అంటూ తలపంకించి ఆ ప్రయాణీకుని వైపు తిరిగాడు.

"చూడండి! వాళ్ళను చూడటం మీకు సాధ్యం కాదట. కాకపోతే ఒక మార్గం వుందని చెప్పారు" అన్నాడు రాజు.

"ఏమిటది? " ఎంతో ఆత్రంగా అడిగాడు

ఆ ప్రయాణికుడు.

"మీరిప్పుడు నడుస్తున్న ఈ ట్రైయిను లోంచి దూకి ఆత్మహత్య చేసుకుంటే నేరుగా స్వర్గానికే పోతారట అప్పుడు అప్సరసల్ని రోజూ తనివితీరా చూసుకోవచ్చునట. మీరింకేం ఆలోచించకుండా ఈ ట్రైయిను లోంచి దూకేయండి" అన్నాడురాజు.

అదిరి పడిన ఆ ప్రయాణికుడు అక్కడ నుండి జారుకున్నాడు.

అంతలో రాజు ఎవరో ముందుకు గుంజి నట్లుగా ముందుకు తూలాడు. ఆ తర్వాత పెనగులాడసాగాడు. కాసేపటికి ఆయసప డుతూ పెదవులు తుడుచుకున్నాడు.

"మీతో ఇదే ఇబ్బంది. కన్పించినప్పుడల్లా ఇలా మీరంతా ముద్దులతో ముంచెత్తడం ఏం బావోలేదు" అన్నాడు రాజు మురి పెంగా విసుక్కుంటూ.

"ఏమిటి ముద్దులు కూడా పెట్టేశారా? " ఓ ప్రయాణికుడు ఈర్ష్యగా చూస్తూ అడిగాడు.

"ఇంకా నయం ఈసారికి ఇంతటితో వది లేశారు" అన్నాడు రాజు నిట్టూరుస్తూ

అంతే! ఆ ప్రయాణీకుడు దభీమంటూ నేలమీద పడిపోయాడు.

రాజు ఆ అప్సరసలకి వీడ్కోలు చెప్తూ చేతిని గాల్లో ఊపాడు.

"ఈసారి వచ్చేటప్పుడు నాకోసం ఇంద్రు డికి తెలియకుండా అమృతం తెస్తారా! అది తాగి నేను మీతోపాటు చిరంజీవిలా స్వర్గా నికి రావాలా? చూద్దాంలే!" అన్నాడు రాజు.

ప్రయాణీకులంతా దిమ్మెరపోయారు.

సన్యాసి ఇక సహించలేకపోయాడు. ఒక్క సారిగా భగ్గుమన్నాడు.

"వట్టిది. అంతా వట్టిది. ఇతనికి రంభా, ఊర్వశి, మేనకలు కన్పించడం వట్టిది" అంటూ ఆ సన్యాసి బిగ్గరగా అరిచాడు.

రాజు సన్నగా నవ్వి "నాకు కన్పించక పోతే నీకు కన్పిస్తారా ఆ అప్సరసలు" అన్నాడు వ్యంగ్యంగా.

"మేము వేల సంవత్సరాలు హిమాల యాల్లో తపస్సు చేసినవాళ్ళం. బొందితో కైలాసం వెళ్ళి ఆ నీలకంఠుడిని దర్శించుకొని వచ్చినవాళ్ళం. అలాంటి శక్తిసంపన్నులైన మాకు కన్పించకుండా వాళ్లు నీకెలా కన్పి స్తారు? " అంటూ నిలదీశాడు సన్యాసి.

"ఒక్కసారి నీ అవతారం చూసుకో! యుగాల నాటి కాషాయ వస్త్రాలు, తైల సంస్కారం లేని జుట్టు, తుప్పుపట్టిన కమం డలం, పుచ్చుపట్టిన దండం, బూజుపట్టిన జింకచర్మంతో వున్న నీ పక్కన నిలబడా లంటే మగాళ్ళం మాకే చెప్పలేనంత రోతగా ఉంది. అలాంటిది, అపురూప సౌందర్యంతో అలరారే ఆ సుందరీమణులు నీ చెంతకొచ్చి ఎలా నిలబడతారనుకున్నావ్? ఎలా మాట్లా డతారనుకున్నావ్? గొంగళి పురుగు కూడా నీ వంటిమీద పాకడానికి అసహ్యించుకుం టూంది" అన్నాడు రాజు పరిహాసంగా.

అంతా పకపకా నవ్వారు.

సన్యాసి మొహం జేవురించింది.

కమండలాన్ని పైకెత్తి దానిలోని ఉదకాన్ని చేతిలోకి వంపుకుంటూ "ఇప్పుడే నిన్ను శపి స్తాను" అన్నాడు కర్కశంగా.

రాజు ఏమాత్రం తొణక్కుండా "ఏడ్చావ్! ఇలా చూడు!" అంటూ జేబులోంచి ఒక దువ్వెన తీసి చూపించాడు.

"ఏమిటిది? " అడిగాడు రాజు.

"దువ్వెన" నిర్లక్ష్యంగా అన్నాడు సన్యాసి.

"అక్కడే పొరపాటు పడుతున్నావు. ఇది దువ్వెన కాదు"

"మరి"

"ఆ మధ్య ఒకసారి నేను ముంబాయి లోని ఎయిర్‌పోర్ట్‌కి వెళ్ళాను. అప్పుడు మిస్ వరల్డ్‌గా ఎంపికయిన సుస్మితాసేన్ నా ముందు నుండి వెళుతోంది. అప్పుడే ఎవరో కాలు జారి నా వెనగ్గా వున్న వ్యక్తుల మీద పడ్డారు. వాళ్లు వచ్చి నా మీద పడ్డారు. నేను వెళ్ళి ప్రపంచ సుందరి సుస్మితాసేన్ మీద పడ్డాను. ఆమె కోపం పట్టలేక ఆవే శంగా వూగిపోతూ నన్ను కాల్చడానికి రివా

ల్వారు తీసింది. చేయని నేరానికి ఆమె అలా మండిపడటం నాకు నచ్చలేదు. అందుకే ఇదిగో ఈ దువ్వెనగా ఆమెను మార్చి పాకెట్లో దాచేశాను.

ఆమెను బుక్ చేసుకున్న హిందీ, తెలుగు సినీ నిర్మాతలంతా ఆమె కన్పించక తల్లడిల్లిపోతున్నారు. ఆమె కోసం వెదికి వెదికి వాళ్లందరికీ పిచ్చెక్కిపోతుంది. కాని ఆమెను దువ్వెనగా మార్చి నేను జేబులో దాచుకుని తల దువ్వుకుంటున్నానన్న సంగతి పాపం ఆ పిచ్చి నిర్మాతలకు తెలీదు. నా దగ్గర శపిస్తాను, చేతబడి చేస్తాను లాంటి కాష్మోరా మాటలు మాట్లాడకు. నేను తల్చుకుంటే నిన్ను ఇప్పటికిప్పుడే యాష్ట్రేగా మార్చి వీళ్లందరి సిగరెట్ల బూడిదతో నింపేస్తాను. జాగ్రత్త" అని రాజు హెచ్చరించాడు.

ఆ మాటలతో జనమంతా రాజు వంక భక్తి విశ్వాసాలతో చూశారు. సన్యాసి మొహం మాత్రం నల్లగా మాడిపోయింది.

అదే సమయంలో అక్కడ నేల మీద శుష్కించి ఎముకల గూడులా నేలమీద మునగదీసుకుని కూర్చున్న ఒక వృద్ధురాలు అందరికీ చేతులు జోడించింది.

'అయ్యా! నేను అన్నం తిని అయిదు రోజులయింది. ఆకలితో చచ్చిపోయేలా వున్నాను. ఒకటే నీరసం. ధర్మ ప్రభువులు! మీరంతా నా మీద జాలి చూపి తలో రూపాయి ధర్మం చేస్తే వచ్చే స్టేషన్లో నాలుగు మెతుకులు తింటాను" అని దీనంగా అర్థించింది.

అంతా ఆమె వంక చిరాగ్గా చూశారు తప్ప పావలా కూడా ధర్మం చెయ్యలేదు. ఈ జనం కూడా దొంగ బాబాలకి, కాషాయం కట్టిన దొంగసన్యాసులకి ఎంతైనా సమర్పించుకుంటారు గాని ఇలా ఆకలితో అలమటించే అభాగ్యులకి ఒక్క రూపాయి అయినా ఇవ్వడానికి ముందుకు రారు. పైగా అసహ్యించుకుంటారు కూడా.

ఆమె కాళ్ళా వేళ్ళా పడుతున్నా ఎవరూ కనికరించడంలేదు.

అంతలో ఒక ప్రయాణికుడు రాజు దగ్గ

## ఫిర్యాదు



ఓ రెస్టారెంట్‌కు వెళ్లిన పెద్దమనిషి భోజనం చేశాక వాష్ బేసిన్ వద్దకు వెళ్లి చేతులు కడుక్కొని తుడుచుకోవడానికి హ్యాంగర్‌మీద ఉన్న టవల్ తీసుకోబోయాడు. అయితే అది చాలా మురికిగా ఛండాలంగా ఉంది. వెంటనే ఆయన చరచర మేనేజర్ దగ్గరకు వెళ్లి ఆ విషయం ఫిర్యాదు చేశాడు.

మేనేజర్ చాలా కూల్‌గా 'సర్.. మీ ఫిర్యాదు మరీ విడ్డూరం.. ఉదయం నుంచీ ఆ టవల్ అక్కడే ఉంది.. హోటల్‌కు వచ్చిన ప్రతివాళ్లూ దానికి తమచేతులు తుడుచుకున్నారు.. ముఖాలు తుడుచుకున్నారు. కానీ ఎవ్వరూ మీలా కంప్లెయింట్ చేయలేదు. మీరొక్కరు చేసినంత మాత్రాన అది మురికిగా ఉందని మేమెలా నమ్ముతాం సార్' అన్నాడు.

ఫిర్యాదు చేసిన పెద్దమనిషి నిలువుగుడ్లేసుకుని నిలబడిపోయాడు.

రకి వచ్చి "సార్! ఆ దువ్వెన ఒక్కసారి ఇవ్వండి. ఆ ప్రపంచ సుందరిని ఒక్క తడవ తనివితీరా ముట్టుకుని ఇచ్చేస్తాను" అన్నాడు ఆశగా.

రాజు అతన్ని ఎగాదిగా చూసి "మీరేం చేస్తూంటారు? " అని అడిగాడు.

"కంట్రాక్టర్ని" నల్ల కళ్లద్దాలు సవరించు కుంటూ అన్నాడతను.

"మరి ఈ జనరల్ కంపార్టుమెంటులో ఎందుకు ప్రయాణం చేస్తున్నారు? "

"రిజర్వేషన్ దొరకలేదు"

"ఈ మిస్ వరల్డ్‌ని ముట్టుకోవాలంటే అయిదు వందలు అవుతుంది" రాజు దువ్వెనని చూపిస్తూ అన్నాడు.

"అంతేగా! తీసుకోండి" అంటూ అతను అయిదు వంద నోట్లు తీసి ఉత్సాహంగా రాజుకి అందించాడు.

రాజు అతనికి దువ్వెన ఇచ్చాడు.

"రెండు నిమిషాల అనంతరం తిరిగి ఆ దువ్వెన నాకు ఇచ్చేయాలి" చెప్పాడు రాజు షరతు విధిస్తూ.

"అలాగే" అన్నాడు ఆ కంట్రాక్టరు.

రాజు ఆ అయిదు వంద నోట్లని ఆకలితో అలమటిస్తూ మినుకు మినుకు మంటూన్న దీపంలా వున్న ఆ అభాగ్యురాలి చేతుల్లో వుంచాడు.

'అమ్మా!" ఈ డబ్బు నీ దగ్గర వుంచుకో. నీకు ఏది ఇష్టమయితే అది కొనుక్కుని తిను" అన్నాడు ఆత్మీయంగా.

ఆమె కదిలిపోయింది. చేతిలోని నోట్ల వంక రాజు వంక మార్చి మార్చి చూసింది. అది కలో, నిజమో ఆమెకు అంతబట్టలేదు.

"డబ్బులు జాగ్రత్తమ్మా!" అన్నాడు రాజు.

లోతుకు పోయి, జీవకళ హరించుకుపోయిన ఆ కళ్ళలో తడి మెరిసింది. ఆమె పెదవులు కంపిస్తున్నాయి. ఆమె ఏదో అనాలనుకుంటోంది కాని దుఃఖంతో గొంతు పెగలడంలేదు. ఆమె చూపులు మాత్రం అతన్ని మౌనంగా ఆశీర్వదిస్తున్నాయి.

అప్పటివరకు తనలో తను రగిలిపోతున్న సన్యాసి ఒక్కసారిగా భగ్గుమన్నాడు.

"ఇదన్యాయం. అక్రమం, దుర్మార్గం. అంతా మోసం. ఆ దువ్వెన ప్రపంచ సుందరి కాదు. నేను ఇప్పుడే దివ్యదృష్టితో చూశాను" అన్నాడు బిగ్గరగా అరుస్తూ.

"నీ మొహం. నేను కూడా ఇప్పుడే మనోనేత్రంతో చూశాను. నువ్విచ్చే బూడిద కైలాసం నుంచి తెచ్చింది కాదు. రాజమండ్రి శ్మశాన వాటిక నుండి ఎత్తుకొచ్చి జనం దగ్గర వెధవ బిల్డప్‌లిచ్చి ఆ బూడిదని తెలివిగా సొమ్ము చేసుకుంటున్నావు" అన్నాడు రాజు హేళనగా.

ఆ సన్యాసి ఆవేశంగా ఏదో అనబోతూంటే ఒక ప్రయాణికుడు కలగజేసుకుని "అంతా బాగానే ఉంది. కాని అంత మహత్తరమయిన శక్తే మీ ఇద్దరికీ నిజంగా ఉంటే ఇలా ట్రయినులో అదీ జనరల్ కంపార్టుమెంటులో నిలబడి ప్రయాణం చేయాల్సిన అగత్యం ఏమిటి? ఎంచక్కా గాల్లో ఎగురుకుంటూ మనోవేగంతో వెళ్ళవచ్చు కదా? " అంటూ భయంకరమైన సందేహాన్ని వెలిబుచ్చాడు.

సన్యాసి గతుక్కుమన్నాడు.

రాజు మాత్రం ఎలాంటి తొణుకు, బెణుకు లేకుండా చిద్విలాసంగా చూస్తున్నాడు.

"ఆయన అడిగిన దానికి సమాధానం చెప్పరేం? " మరో ప్రయాణికుడు గద్దించాడు.

సన్యాసికి ముళ్ళమీద నిలబడినట్లుగా ఉంది. ఇప్పుడు అతను అడిగిన ప్రశ్నకు సరియైన సమాధానం చెప్పకపోతే తమ గుట్టురట్టయి దేహశుద్ధి తప్పదు. అందుకే ఏం చెప్పాలో తోచక సన్యాసి వెర్రి మొహం వేశాడు.

రాజు ఆ సన్యాసి చెవిలో గుసగుసగా "చూడూ! ఈ క్లిష్ట పరిస్థితి నుండి మనిద్దర్నీ నేను రక్షిస్తాను. అయితే అందరి ముందు నేను నీకంటే గొప్ప శక్తిమంతుడినని నువ్వు ఒప్పుకోవాలి" అని షరతు విధించాడు.



అంతరంగంలో ప్రేమ లేనప్పుడు వాగాడంబరం దండగ. - మురళి

బతుకు జీవుడా అనుకుంటూ ఆ సన్యాసి సంతోషంగా రాజు షరతుకి ఒప్పుకున్నాడు.

"మాట్లాడరేం? " ఆ ప్రయాణికుడు రెట్టించాడు.

సన్యాసి కొద్ది క్షణాలు కళ్ళు మూసుకుని ఆ తర్వాత తెరిచి "ఇప్పుడే నేను దివ్యదృష్టితో చూశాను. ఈ యువకుడు సామాన్యుడు కాదు. ప్రతి రోజూ ఉదయం వైకుంఠం వెళ్ళి అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడైన శ్రీ మహావిష్ణువుని, చల్లని తల్లి లక్ష్మీదేవిని దర్శించుకుని వచ్చేటప్పుడు పాల సముద్రంలోంచి ఒక లీటరు పాలు తెచ్చుకుని అగ్నిదేవుడిని పిలిచి వాటిని వెచ్చచేయమని చెప్పి, వాయుదేవుడిని పిలిచి చల్లార్చమని ఆదేశించి, మన్మథుడి చెరుకు విల్లుని విరిచి ఆ చెరుకులో ఉన్న రసాన్ని ఆ పాలల్లో కలిపి మబ్బుల తేరు మీద విహరిస్తూ ఆ పాలను తాగుతూ సూర్యుడితో కబుర్లు చెప్తుంటాడు. అంతటి గొప్ప శక్తిమంతుడితో నేను అనవసరంగా తలపడ్డాను. నేను నిజంగా చాలా పొరపాటు చేశాను. అంతే కాదు ఇప్పుడు మీరు అడిగిన ప్రశ్నకు కూడా ఈ మహానుభావుడే సమాధానం చెప్తాడు. ఎందుకంటే ఆయన ఉండగా నేను సమాధానం చెప్తే నా కళ్లు పోతాయి" అన్నాడు వినమ్రంగా.



అంతా రాజువైపు చూశారు.

రాజు సందేహం వ్యక్తం చేసిన ప్రయాణికుడి వైపు చిర్నవ్వుతో చూశాడు.

"చూడు నాయనా! శివుడు సర్వశక్తిమంతుడు. శివుడాజ్ఞ లేనిదే చీమయినా కుట్టదంటారు. అలాంటి ఆ పరమాత్ముడు, లయకారకుడు ఎక్కడ నివసిస్తూంటాడో తమరు చెప్పగలరా? " అడిగాడు రాజు మృదువుగా.

ఆ ప్రయాణికుడు 'శ్మశానంలో' అని సమాధానం చెప్పాడు.

"అవును కదా! మరి అంత గొప్ప ఆదిదేవుడు, సర్వాంతర్యామి బంగారంతో నిర్మించి వజ్రాలు పొదిగిన అపురూపమయిన ఆకాశ హర్మ్యాల్లో ఉండకుండా బూడిద కుప్పలు, పుర్రెలు, చితిమంటల మధ్య ఎందుకు ఉంటున్నాడో ముందు తెల్సుకో. అప్పుడు మేము ఈ జనరల్ కంపార్టుమెంటులో నిలబడి ఎందుకు ప్రయాణం చేస్తున్నామో మీకు అర్థమవుతుంది" అన్నాడు రాజు.

ఆ వ్యక్తి తెల్లమొహం వేశాడు.

"ఏం చెప్పావు గురూ! అదరగొట్టేశావు" పట్టాభి రాజుకి షేక్ హేండిస్తూ మెచ్చుకోలుగా అన్నాడు.

సన్యాసి కూడా రాజు వైపు అభినందనగా చూశాడు.

★ ★ ★

సికింద్రాబాద్ స్టేషన్ వరకు అలా నిలబడి ప్రయాణం చేయడం కన్నా లోపలికి వెళితే ఎక్కడో చోట కూర్చోవడానికి కాస్తంత చోటు దొరుకుతుందని భావించిన రాజు ముందుకు కదలబోయాడు.

"గురూ! ఎక్కడికి? లోపలికా? " అని పట్టాభి ఆత్రంగా అడిగాడు.

"అవును" అన్నాడు రాజు.

"నేను కూడా నీ వెంట వస్తాను".

"ఒ. కే." అన్నాడు రాజు లోపలికి కదుల్తూ. పట్టాభి అతన్ని అనుసరించాడు. ఇద్దరూ ప్రయాణికుల మధ్య దారి చేసుకుంటూ ముందుకు కదిలారు. ఒకచోట

బయటి వారందరినీ తప్పుపట్టడం అయిపోయాక, తమను తాము నిందించుకుంటారు బలహీన మనస్కులు. - వోల్టేర్

నలుగురు కూర్చునే బెర్తు మీద ముగ్గురు మాత్రమే కూర్చుని ఉండటం గమనించిన పట్టాభి ఉత్సాహంగా వెళ్లి ఖాళీగా ఉన్న సీటు మీద కూర్చున్నాడు. మరుక్షణమే గోడకు కొట్టిన బంతిలా విసురుగా వెనక్కి వచ్చి రాజు మీద పడబోయాడు. రాజు అతన్ని మధ్యలోనే పడిపోకుండా ఒడిసి పట్టుకున్నాడు.

పట్టాభి విసురుగా వెనక్కి తిరిగి "ఎవరు? ఎవరు? ఈ పట్టాభిని తోసిందెవరు? " అంటూ హూంకరించాడు.

"నేనే" పట్టాభి వెళ్లి కూర్చున్న సీటు పక్కనే కూర్చుని ఉన్న గడ్డం అతను తాపీగా అన్నాడు.

అతనివైపు ఉరిమి చూశాడు పట్టాభి.

"ఈ పట్టాభితో పెట్టుకుంటే ఏం జరుగుతుందో తెలుసా? హెడ్డుకి బాడీకి మధ్య లింకు తెగిపోతుంది" హెచ్చరించాడు పట్టాభి.

ఆ గడ్డం అతను పట్టాభివైపు అదోలా చూసి తన నెత్తి మీద ఉన్న జుట్టులోంచి ఒక వెంట్రుకని పీకి గాల్లోకి ఊదాడు.

పట్టాభి ఆవేశంతో రగిలిపోయాడు.

"ఏమిట్రా నీ ఉద్దేశం? నేను, నా మాటలు నీకు నీ నెత్తి మీది వెంట్రుకతో సమానమనా? తయిపోయావు రా! నువ్వయిపోయావు. కాలనాగు దగ్గరికి వెళ్ళి దాని పడగను తట్టి "హలో" అని పలకరించడం ఎంత ప్రమాదమో ఈ పట్టాభితో గొడవ పెట్టుకోవడం కూడా అంతే ప్రమాదం. ఆ సంగతి తెల్సుకో" అని గర్జించాడు పట్టాభి.

ఆ గడ్డం అతను మాత్రం ఏం మాట్లాడకుండా ఒక న్యూస్ పేపరు అందుకుని దాన్ని మధ్యకు పర్రుమని చించాడు.

పట్టాభి మొహం జేవురించింది.

"అంటే నన్ను కూడా అలానే చించుతానా నీ వుద్దేశం. ఇక లాభం లేదు నీ అంతు చూడాల్సిందే. నేను ఫుట్ బాల్ ఆడతాను. కాని బాల్ తో కాదు. నీలాంటి వాళ్ళ హెడ్డులతో. హోలీ కూడా ఆడతాను కాని రంగులతో కాదు. నీలాంటి వాళ్ళ బ్లడ్డుతో" అన్నాడు పట్టాభి ఉగ్రంగా.

గడ్డం అతను నిర్వికారంగా చూస్తూ బ్యాగులోనుంచి ఒక చెరుకు ముక్కను, ఒక గాజు గ్లాసుని బయటకు తీశాడు. క్రషరులో వుంచితే గాని రసం తీయడం సాధ్యం కాని ఆ చెరుకు ముక్కని తడిగుడ్డను పిండినట్టుగా అవలీలగా పిండి ఆ గ్లాసుని చెరుకు రసంతో నింపాడు. అంతే కాదు పట్టాభివైపు అదోలా చూస్తూ ఆ రసం తాగాడు తాపీగా.

పట్టాభికి గుండాగినంత పనయింది. గొంతు పెగల్లేదు. స్థాణువులా అయిపోయాడు.

వెంటనే అక్కడ నిలబడి ఉన్న స్టూడెంట్సు కలగజేసుకుని "మేము దరిదాపు ఇరవై మంది స్టూడెంట్సు ఉన్నాం ఇక్కడ. మేమంతా కూడా ఆ ఖాళీ సీట్లో కూర్చోవడానికి ప్రయత్నించి వాడి ధాటికి తట్టుకోలేక ఇదుగో ఇలా ట్యాంక్ బండ్ మీద శిలావిగ్రహాల్లా నిలబడిపోయాం. అనవసరంగా ఆవేశానికి పోయి వాడితో గొడవ పెట్టుకోకు. ఆ చెరుకు ముక్కను పిండినట్లుగా నిన్ను కూడా పిండి నీ బ్లడ్డుతో ఆ గ్లాసు నింపి విస్కీని సిప్ చేసినట్టుగా సిప్ చేస్తాడు. లేనిపోని బిల్డప్‌లు ఇవ్వకుండా రాముడు మంచి బాలుడు టైప్‌లో వుండు" అంటూ లెక్చరిచ్చారు.

దాంతో పట్టాభి ఇక కిక్కురుమనలేదు.

ఇదంతా గమనిస్తున్న రాజు ఆ స్టూడెంట్సుని అడిగాడు. "ఇంతకీ ఆ గడ్డం అతను అక్కడ ఎవర్నీ ఎందుకు కూర్చోనివ్వడం లేదు? "

"అలా చూడండి" అంటూ బెర్తుకి ఈ చివర కూర్చునివున్న యువతిని చూపించాడు ఒక స్టూడెంటు.

రాజు ఆమెవైపు చూశాడు. అప్పుడే ఆమె తను చదువుతున్న నవలలోంచి తలెత్తి మొహంమీదికి పడుతూన్న గండుతుమ్మెద

రెక్కల్లాంటి ముంగురుల్ని సవరించుకుంటోంది.

రాజు ఉలిక్కిపడ్డాడు.

ఆమె ఎవరోకాదు విశ్వనాథ్ మాస్టారి కోడలికి స్వయానా చెల్లెలు అయిన నవీన. ఈరోజు ఉదయమే మాస్టారు ఆమె ఫొటో చూపించి ఆమె రాణిగంజ్ పోలీసుస్టేషన్లో ఇన్స్పెక్టరుగా చేస్తోందనీ, అవసరమైతే ఆమె సహాయం తీసుకోమనీ చెప్పాడు. ఫొటోలో చూసినప్పుడు ఆమె యూనిఫాంలో ఉంది. ఇప్పుడు చీరలో పొందికగా ఒద్దికగా ఉంది. ఆమెను అలా చూస్తుంటే అరవిచ్చిన గులాబి రాత్రంతా మంచుకి తడిసి రేకుల్నిండా మంచుముత్యాల్ని అద్దుకుని తొలి లేతకిరణాల స్పర్శకు అందాల్ని ఆరబెట్టుకుంటున్నట్టుగా ఉంది.

"ఆమె ప్రక్కన ఉన్న ఖాళీ సీట్లో ఆ గడ్డం అతను ఎవర్నీ కూర్చోనివ్వడంలేదు. అలా అని ఆమెకు, అతనికి ఎలాంటి చుట్టరికం లేదు. కేవలం వాడు గడ్డివాము దగ్గర కుక్క. తను కూర్చోడు. వేరొకర్ని కూర్చోనివ్వడు-" అన్నాడు ఆ స్టూడెంటు ఉక్రోషంగా.

రాజుకి పరిస్థితి అర్థమయింది.

"నేను అక్కడ కూర్చుంటాను" అన్నాడు.

స్టూడెంట్సు ఫక్కుమని నవ్వారు.

రాజు వాళ్ల నవ్వుల్ని పట్టించుకోలేదు.

"ఏం నేను అక్కడ కూర్చోలేనని మీరు అనుకుంటున్నారా? " అడిగాడు మామూలుగా.

"కాదు నువ్వు వాడి చేతిలో కాళ్లూ చేతులూ విరగ్గొట్టుకుని హాస్పిటల్ బెడ్మీద మూల్గుతూ మూలుగుతూ పడుకుని ఉన్న దృశ్యమే మా మనోనేత్రం ముందు కదలాడి మాకు నవ్వు తెప్పించింది" అన్నాడు ఒక స్టూడెంటు వ్యంగ్యంగా.

"అయితే పందెం కాస్కోండి. నేను అక్కడ కూర్చుంటాను" అన్నాడు స్థిరంగా.

వాళ్లందరి మొహాల్లో నవ్వులు మాయమై ఆ స్థానంలో రోషం చోటుచేసుకుంది.

"పందెం ఎంతో చెప్పు" అన్నారు స్టూడెంట్సు కటువుగా.

"వెయ్యి రూపాయలు"

స్టూడెంట్సు ఒకర్నొకరు చూసుకున్నారు.

"మాకు ఓ.కే." అన్నారు ముక్తకంఠంతో.

పట్టాభి కల్పించుకుని "గురూ! అనవసరంగా తొందరపడుతున్నావ్. చెరకుముక్కని చూశావుగా ఎలా రసం తీశాడో. వాడి చేతికి చిక్కితే నీ పని అంతే! నీ నిర్ణయం మార్చుకో" అని హెచ్చరించాడు.

రాజు అతనిని అభిమానంగా చూసి, భుజం తట్టాడు చిన్నగా.

"నా గురించి దిగులుపడకు. వాడిగురించి విచారించు. వంద గొడ్లను తిన్న రాబందు ఒక్క గాలివాన దెబ్బకు కుప్పకూలుతుందట. వీడూ అంతే!" అన్నాడు భరోసాగా.

పట్టాభికి ఇంకా నమ్మకం ఏర్పడక "ఏమో గురూ! నిన్ను ఆ పరమాత్ముడే రక్షించాలి" అన్నాడు జాలిగా.

"ఇంకా చూస్తావేం... అక్కడ కూర్చో" అన్నారు స్టూడెంట్సు.

రాజు కదిలి నవల చదువుతున్న నవీన పక్కకు వెళ్లి నిల్చున్నాడు. స్టూడెంట్సు, పట్టాభి రాజువైపు ఆసక్తిగా చూడసాగారు.

రాజు హఠాత్తుగా తన శరీరం మొత్తం కట్టెలా బిగించి అమాంతం ఆమె ఒడిలోకి జారిపోయాడు. మరుక్షణం కాళ్లూ చేతులూ గిలగిలా తన్నుకోసాగాడు.

అది గమనించిన ఎదుటి బెర్తుమీది వృద్ధురాలు "పాపం ఫిట్సునుకుంటా!" అంది ఆదుర్దాగా.

అంతా రాజువైపు సానుభూతిగా చూశారు.

"ఇంకా అలా చూస్తారేమయ్యా... కాస్త అతన్ని పట్టుకోండి" అని చుట్టూ ఉన్నవారిని అదిలించింది. దాంతో నలుగురయిదుగురు ప్రయాణీకులు కదిలి అతన్ని గట్టిగా పట్టుకున్నారు. ఒకతను తన దగ్గరవున్న తాళాల గుత్తిని రాజు అరచేతిలో ఉంచి గుప్పిట మూశాడు. క్రమంగా రాజులో కద

లిక ఆగింది.

వృద్ధురాలు నవీనతో అంది "పాపం బిడ్డ ఫిట్స్ మూలంగా ఒడ్డున పడ్డ చేపలా గిల గిలా తన్నుకున్నాడు. నీదగ్గర నీళ్లున్నాయి కదమ్మా! కాసిని అతనికి పట్టించమ్మా! నీకు రాజకుమారుడిలాంటి మొగుడొస్తాడు"

నవీన చెంపలు ఎర్రబడ్డాయి. సిగ్గుపడు తూనే తనదగ్గర ఉన్న వాటరు బ్యాగులోని మంచినీళ్లను గ్లాసులోకి వంపి అతని నోటికి అందించింది. ఆ దృశ్యం చూసిన స్టూడెంట్సు అందరి కళ్లు విభ్రాంతితో పెద్ద వయ్యాయి.

"ఇతనెవరోగాని ఘటికుడిలా ఉన్నాడు. ఆమె పక్కన కూర్చోవయ్యా అని పందెం వేస్తే నేరుగా ఆమె ఒడిలో పడుకుని ఆమె చేతనే మంచినీళ్లు తాగించుకుంటున్నాడు. కొంపదీసి ఆ ఖాళీసీటులో సెటిలయిపోడు కదా!" ఒక స్టూడెంటు సందేహం వ్యక్తం చేశాడు.

"చూద్దాం" అన్నారు మిగిలిన స్టూడెంట్సు. రాజు నెమ్మదిగా కళ్లు తెరిచి అప్పుడే ఆమెను చూసినట్టుగా చూసి చటుక్కున లేచి ఆమె పక్కన కూర్చుని ఆమె ఒడిలో అంతసేపు పడుకున్నందుకు తెగ బాధపడి పోతున్నట్లుగా మొహంపెట్టాడు.

"సారీ మేడమ్! నాకు తెలీకుండానే మీ ఒడిలో పడుకున్నాను. నన్ను మన్నించండి" అన్నాడు నొచ్చుకుంటూ.

ఆమె దయగా చూస్తూ "ఫర్వాలేదు. మీరు ఫిట్సు మూలంగా పడిపోయారుకాని కావాలని కాదుగా! ఇంతకీ ఇప్పుడెలా ఉంది? " అని పరామర్శించింది.

"కాస్తంత నీర్సంగా ఉంది. అంతే!" అన్నాడు. ఆమె పక్కన కూర్చున్న రాజువైపు ఉరిమిచూశాడు గడ్డం అతను.

"మిస్టర్. ఇది నీ సీటు కాదు. లే" అన్నాడు గదమాయిస్తూ.

రాజు లేవలేదు. ఎదురుగా ఉన్న ప్రయాణికులవైపు దీనంగా చూశాడు. ఈ ప్రపంచంలో అన్నింటికన్నా బలమైన ఆయుధం సానుభూతి. అది ఉంటే ఏదైనా సాధించ వచ్చు. ఇప్పుడు ఆ ఆయుధాన్నే ఆ గడ్డం అతనిమీదకు ప్రయోగించాడు రాజు.

వృద్ధురాలి కడుపు తరుక్కుపోయింది. అంతే! ఆమె ఒక్కసారిగా ఆ గడ్డం అతని మీద గయ్యిమంది.

"నీకసలు బుద్ధుందా? నువ్వసలు మనిషి వేనా. నీ కళ్లముందే కదా అతను ఎలా గిలాగిలా తన్నుకున్నాడో! అలాటి జబ్బుమనిషి మీద జాలి చూపించకపోతే నువ్వు మందులేని ఏ మాయరోగమో వచ్చి తీసుకుని తీసుకుని మరీపోతావ్"

ఆ గడ్డం అతని మొహం గండు పిల్లిమొహంలా మారింది. అతను తోకతొక్కిన తాచులా కస్సుమంటూ ఏదో అనబోయాడు. అప్పుడే ఒక నడివయస్కుడు కలగజేసుకున్నాడు.

"ఏంటయ్యా ఇంకా మాట్లాడుతున్నావ్. అడిగేవారెవరూ లేరు కదాని తెగ రెచ్చిపోతున్నావ్. . ఇప్పటివరకు ఆ సీట్లో నువ్వు ఎవర్నీ కూర్చోనివ్వకపోయినా అందరిమీద దౌర్జన్యం చేసినా ఎందుకులే అని పట్టించుకోలేదు మేము. కాని ఈ జబ్బుమనిషిని మాత్రం లేవమంటే సహించం. అందరం కల్సి బొమ్మను లేపినట్టు నిన్ను లేపి అదుగో ఆ డోరులోంచి బయటకు విసిరేస్తాం" అని హెచ్చరించాడు. అలా అంతా తలోమాట అనేసరికి గడ్డం అతని మొహం పాలిపోయింది. ఏమాత్రం నోరెత్తినా ప్రయాణికులందరి ఆగ్రహానికి గురికావాల్సి ఉంటుందని గ్రహించిన అతను ఇక కిక్కురుమనలేదు. తలవంచుకుని కూర్చున్నాడు.

స్టూడెంట్సుందరి మొహాలు వెలిగిపోయాయి. ఆ ఖాళీ సీట్లో తమని కూర్చోనివ్వకుండా అడ్డుకుని దౌర్జన్యం జరిపిన ఆ గడ్డం అతనికి తగిన విధంగా బుద్ధిచెప్పి తలవంచుకునేలా చేసిన రాజు పట్ల అందరికీ అభిమానం ఆరాధన కలిగాయి. రాజు వైపు

అభినందనగా చూశారు. తాము పందెంలో వెయ్యిరూపాయలు పోగొట్టుకున్నందుకు కించిత్తు కూడా బాధపడలేదు.

పట్టాభి కూడా ఆ గడ్డం అతని మీద కసి తీరినందుకు సంబరపడ్డాడు.

ఇప్పుడు ఆ స్టూడెంట్స్ దగ్గర్నుండి పందెం తాలూకా వెయ్యిరూపాయలు రాబట్టుకోవాలనుకున్నాడు రాజు. వాళ్లని నేరుగా అడిగితే తమ పందెం బయటపడిపోతుందని భావించిన రాజు మరో నాటకం మొదలుపెట్టాడు.

తన జేబులన్నీ కంగారు, కంగారుగా వెదుక్కుని ఆ తర్వాత నేల మీద, చుట్టుప్రక్కల వెదకసాగాడు. అతని పరిస్థితిని గమనించిన వృద్ధురాలు అడిగింది ఆదుర్దాగా

"ఏం బాబూ! ఏమైనా పోగొట్టుకున్నావా? "

"అవును బామ్మగారూ! నా జేబులో వుండాల్సిన వెయ్యిరూపాయలు కన్పించడంలేదు" అన్నాడు దిగులుగా

తనని బామ్మగారు సంబోధించినందుకు ఆవిడ మురిసిపోయింది.

ఆమె మరోసారి చుట్టూ వున్న ప్రయాణికుల్ని అదిలించింది.

"అతనివి వెయ్యి రూపాయలు పడిపోయాయట. కాస్త వెదికి పెట్టండయ్యా" అంది.

దాంతో కొందరు కదిలి అంతా వెదికారు. కాని వాళ్ళకు ఆ వెయ్యి రూపాయలు దొరకలేదు.

రాజు కావాలని తమ దగ్గర్నుండి వెయ్యి రూపాయలు వసూలు చెయ్యడానికి ఈ డ్రామాఆడుతున్నాడని గ్రహించిన స్టూడెంట్స్ వెయ్యిరూపాయలు పోగుచేసి పట్టాభికి ఇచ్చారు.

"ఈ డబ్బులు అతనికివ్వు" అన్నారు.

పట్టాభి ఉత్సాహంగా రాజు దగ్గరికి వచ్చాడు.

"ఇవేనా నీ డబ్బులు? " పది వందనోట్లని పేకముక్కల్లా పేర్చి పట్టుకుని అడిగాడు విలాసంగా.

రాజు కళ్లు మెరిశాయి.

"అవును... అవే" అన్నాడు.

పట్టాభి ఆపది వందనోట్లని రాజుకి అందించాడు.

అప్పుడు అడిగింది వృద్ధురాలు పట్టాభి వంక తీవ్రంగా చూస్తూ "ఆ డబ్బులు నీకు ఎక్కడ దొరికాయి? "

"రాజు ఫిట్సు వచ్చిపడిపోయినప్పుడు అతని జేబులోంచి జారిపడ్డాయి" అన్నాడు పట్టాభి. "మరి ఆ డబ్బుల్ని అతను అడిగే వరకు ఎందుకు ఇవ్వలేదు? " అడిగింది కటువుగా.

పట్టాభి గతుక్కుమన్నాడు.

"అది.... అది" అని గొణిగాడు.

ఆమె ఉగ్రంగా చూస్తూ "అతను అడగపోతే నీ దగ్గరే ఉంచేసుకుందామని కదూ నీ వెధవాలోచన" అంది.

పట్టాభి చేదుతిన్నట్టుగా మొహంపెట్టాడు.

"అబ్బే...అదేంలేదు" అన్నాడు కంగారుగా.

"శవాల మీద పైసలు ఏరుకునే వాళ్లంటే ఎలా వుంటారో అనుకునేదాన్ని. కాని ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తున్నాను. సూర్యాపేట నుండి హైదరాబాద్ వెళ్లే హైవే రోడ్డు మీద కాపువేసి ఏదైనా యాక్సిడెంట్ జరిగితే బావుండు అని గుంటకాడనక్కలా ఎదురు చూస్తూ యాక్సిడెంట్ అవ్వగానే సగం వూపిరితో ఉన్న ప్రయాణీకుల వంటి మీద నుండి నగలు, డబ్బు నిర్దాక్షిణ్యంగా దోచుకుపోయే డెకాడియాగాడివి నువ్వు. నీలాంటివాళ్లని ఆర్.టి.సి బస్టాండు బాత్‌రూములో కట్టేసి ఆరునెలలు వుంచాలి. అప్పుడుగాని తిక్కకుదరదు" అంది వృద్ధురాలు ఈసడింపుగా

అంతే! పట్టాభి ఆమె పాదాలమీద పడిపో



మనం సంస్కరించుకోలేని తప్పిదాలల్లో సుగుణాలు వెతుకుతాం. - రోషె

యాడు.

"బుద్ధి తక్కువై అతని జేబులోంచి జారిన డబ్బుల్ని తీశాను. ఇంకెప్పుడూ ఇలాంటి పాడుపనిచెయ్యను. నన్ను మన్నించు" అని వేడుకున్నాడు దీనంగా. అప్పుడుగాని ఆమె శాంతించలేదు.

"వెళ్లు...వెళ్లి బుద్ధిగా బతుకు" హెచ్చరించింది.

బతుకుజీవుడా అనుకుంటూ పట్టాభి అక్కడ్నుంచి కదిలాడు.

★ ★ ★

రాత్రి పన్నెండు గంటలు. ట్రైయిన్ ఏదో స్టేషన్లో ఆగింది. ఆ కంపార్టుమెంట్‌లోంచి ఒకరిద్దరు ప్రయాణికులు తమ బ్యాగులు తీసుకుని కిందికి దిగారు. ఫ్లాట్‌ఫాం మీద ఆ కంపార్టుమెంట్ కోసమే ఎదురు చూస్తూన్న కొందరు ప్రయాణికులు దానిలోకి గబగబా ఎక్కారు.

అయిదు నిమిషాల తర్వాత ట్రైన్ కదిలింది. అది మరో స్టేషన్ చేరుకోవడానికి ఎంతలేదన్నా రెండు గంటలు సమయం పడుతుంది. ప్రయాణీకులంగా కునికిపాట్లు పడుతున్నారు. రాజు కూడా వెనక్కి చేరగిలబడి కళ్లు మూసుకున్నాడు.

ట్రయిన్ వేగం పుంజుకుంది. కంపార్టుమెంటు మొత్తం నిశ్శబ్దంగా ఉంది.

అప్పుడు ఎవరో బిగ్గరగా అరిచి చెప్పారు.

"దొంగలు...దొంగలు ట్రైనెక్కారు. అందర్నీదోచుకుంటున్నారు."

అంతే! పక్కన బాంబుపడ్డట్టుగా అంతా అదిరి పడ్డారు. అందరి మొహాల్లో భయం.

అంతలో పెద్దగా అరుపులు, కేకలు విన్పించాయి. ఎవరో ఆడవాళ్ల ఏడుస్తున్నారు. ఒక్కసారిగా ఆ కంపార్టుమెంట్‌లో భయానక వాతావరణం అలుముకుంది. అంతా చలిజ్వరం వచ్చినట్టుగా వణికిపోతున్నారు.

ఆ దొంగలు నిర్దాక్షిణ్యంగా ఆడవాళ్ల మెడల్లోని మంగళసూత్రాల్ని కూడా గుంజుకుంటున్నారు.

ఆడవాళ్లు కన్నీళ్లతో కాళ్లావేళ్లా పడుతున్నా వాళ్లు ఏ మాత్రం జాలిపడటంలేదు. వాళ్లందరి చేతుల్లో కొబ్బరి బొండాలు కొట్టే పదునైన కత్తులున్నాయి. అంతా ఇరవై ముప్పైయేళ్ల మధ్యలోని వారే. అంతా టక్ చేసుకుని హుందాగా ఉన్నారు. వాళ్లందరికీ ఒకతను నాయకత్వం వహిస్తున్నాడు. దాంతో ఆ దొంగల్లో ఆసక్తి పెరిగింది.

"ఏరా... నీకు ప్రత్యేకించి బొట్టుపెట్టి చెప్పాలా? డబ్బులు తియ్" అంటూ రాజుని కసిరాడు నాయకుడు. రాజు ఏమాత్రం ఆలస్యం చేయకుండా ఆ నాయకుడి జేబులో చెయ్యిపెట్టి నోట్లకట్టను బయటకు తీశాడు.

దొంగలంతా తెల్లబోయారు. నాయకుడి మొహం జేవురించింది. రాజువైపు తీవ్రంగా చూస్తూ "ఎంత ధైర్యంరా నీకు! నా జేబులో చెయ్యిపెట్టి డబ్బులు తియ్యడానికి" అని మండిపడ్డాడు.

"మీరే కదా చెప్పారు డబ్బులు తియ్యమని" రాజు అమాయకంగా మొహం పెట్టి అన్నాడు.

"నేను చెప్పింది నా జేబులో డబ్బులు తియ్యమని కాదు. నీ జేబులో ఉన్న డబ్బులు మొత్తం తీసి నాకు ఇవ్వమని" అన్నాడు చిరాగ్గా.

రాజు కొద్దిగా స్వరం తగ్గించి "నేను మీకో నిజం చెప్పాలి" అన్నాడు.

"ఏమిటది?" అసహనంగా అన్నాడు నాయకుడు.

"నేను కూడా మీకు లాగానే గజదొంగని. అసలు నేను ఈ కంపార్టుమెంటు ఎక్కింది కూడా అందర్నీ దోచుకుందామనే ఉద్దేశంతోనే. ఇంతలో నా నోట్లో మట్టి కొడుతూ మీరు రంగంలోకి దిగి అందర్నీ దోచుకు

న్నారు. ఎంతయినా నేను మీ జాతివాణ్ణి. అంచేత నా పట్ల అభిమానం చూపిస్తూ మీరు దోచుకున్నదాంట్లో ఒక పావలా వంతు నా మొహాన కొట్టండి. ఏదో సర్దుకుంటాను" అన్నాడు రాజు దీర్ఘంగా నిట్టూరుస్తూ.

ఆ మాటలన్నీ నవీన చెవిన పడ్డాయి. ఆమె మొహం కఠినంగా మారింది. రాజు వైపు నిప్పులు చెరిగేలా చూసింది. ఇంతవరకు తన పక్కన బుద్ధిమంతుడిలా కూర్చున్న ఇతను మామూలు ప్రయాణీకుడు కాదన్నమాట. పెద్ద గజదొంగ. ఎంత మోసం. ఎంత నయవంచన. అంటే ఇతని ఫిట్సు కూడా నాటకమేనన్నమాట. అలా అనుకున్న ఆమె రక్తం మరిగిపోయింది. అంతలోనే ఆమెకు అతను తన ఒడిలో పడుకుని తన చేతనే మంచినీళ్ళు తాగించుకున్న వైనం గుర్తుకొచ్చి ఆగ్రహంతో రగిలిపోయింది. ఇలాంటి మేకవన్నె పులుల్ని క్షమించకూడదు. నిర్దాక్షిణ్యంగా షూట్ చేసి పారేయాలి అనుకుంది కసిగా.

ఆ దొంగల నాయకుడికి చిర్రెత్తుకొచ్చింది.

"ఏరా... హరికథలు చెప్తున్నావా? " అని తన అనుచరుల వంక చూసి చెప్పాడు నాయకుడు.

"వీడిని పట్టుకోండిరా"

రాజుని కదలకుండా గట్టిగా పట్టుకున్నారు దొంగలు.

"స్వజాతీయుణ్ణి అవమానిస్తున్నారు. ఈ పాపం వూరికే పోదు" అన్నాడు రాజు శపిస్తూ.

అతని మాటల్ని ఖాతరు చెయ్యకుండా "జేబులు వెదకండి" ఆదేశించాడు నాయకుడు.

రాజు జేబులో చెయ్యి పెట్టిన ఒక దొంగ మడత పెట్టి వున్న ఒక కాగితాన్ని బయటకు తీశాడు. దానివంక కొద్ది క్షణాలు సాలోచనగా చూసిన నాయకుడు "దాంట్లో ఏముందో చూడు" అన్నాడు.

ఆ దొంగ దాని మడతలు విప్పాడు. దాని మీద ఒకే ఒక వాక్యం రాసి ఉంది. అది చదివిన ఆ దొంగ మొహం కళతప్పింది. తలెత్తి నాయకుడి వంక భయంగా చూశాడు. అది గమనించిన నాయకుడి కనుబొమలు ముడిపడ్డాయి.

"ఏముంది రా... అందులో? " అడిగాడు సందేహంగా.

"ఒక ... ఒక వాక్యం రాసి వుందన్నా!" అన్నాడు తడబడుతూ.

"ఏమిటది? "

"వద్దన్నా" అతను కంగారుగా అన్నాడు.

"చెప్పరా" కసిరాడు నాయకుడు.

ఇక తప్పదన్నట్లుగా గుండె దిటవు పరచుకొని నోరు విప్పాడు ఆ దొంగ.

"ఇది చదవమని ఆదేశించినవాడి పెళ్ళాం చదివిన వాడితో లేచి పోతుందని రాసి వుందన్నా"

నాయకుడి మొహం ఈడ్చి గుద్దినట్లుగా నల్లగా కమిలిపోయింది. ఆ కాగితాన్ని అందుకుని కసిగా నలిపి దూరంగా పారేశాడు.

పక్కనే ఉన్న పట్టాభి అన్నాడు వ్యంగ్యంగా.

"పాము పుట్టలో వేలు పెట్టకూడదు. పెట్టాక కాటు పడిందని బాధపడకూడదు"

నాయకుడు కోపంగా చూశాడు పట్టాభి వైపు

"ఇది నా మాట కాదు. భర్తృహరి సుభాషితం" అన్నాడు సంజాయిషీగా.

అప్పుడే ఒక దొంగ అతని దగ్గరకు వచ్చి చెవిలో "అందర్నీ దోచుకోవడం పూర్తయింది. కాని అదుగో ఆ అమ్మాయి మాత్రం మిగిలింది. ఆమె దగ్గర్నుండి నగలు, డబ్బు దోచుకోవడం కన్నా... ఆమె అపూర్వమైన అందాల్ని దోచుకోవడం మంచిదని నా ఆలోచన. ఒక్కసారి ఆ మెరుపు తీగని చూడండి వంద విస్కీబాటిల్సు ఖాళీ చేసినా రాని కిక్కు ఆమెని చూడగానే

వస్తుంది. ఇంతవరకు అలాంటి ఫిగర్ని మనం చూడలేదు. మీరు ఊc అంటే మతులు పోగొట్టే ఆ అజంతా శిల్పాన్ని ప్యాక్ చేసేస్తాం" అన్నాడు గుసగుసగా.

నాయకుడు ఆమె వైపు చూశాడు. అతని కళ్ళు తళతళమెరిశాయి.

"ఇంకా చూస్తారేం... దాన్ని లాక్కురండి" అన్నాడు కాంక్షగా చూస్తూ.

దొంగలు రెట్టించిన ఉత్సాహంతో నవీన దగ్గరకు వెళ్లారు.

"ఏయ్ పిల్లా... లే" అన్నారు గదమాయిస్తూ.

ఆమె మొహం జేవురించింది.

"ఏరా... వళ్ళెలా వుంది" అంది విసురుగా. దొంగలు అదిరిపడ్డారు. నాయకుడు నివ్వెరపోయాడు. ఆమె అలా అంటుందని వాళ్ళెవరూ ఊహించలేదు.

నాయకుడు ఆమె దగ్గరికి వచ్చాడు. ఆమె వైపు చూసి వంకరగా నవ్వుతూ "నీలో అందమే కాదు. విస్కీ పక్కన సోడాలా పొగరు కూడా వుంది. నీ లాంటి ఆడవాళ్ళు అరుదుగా వుంటారు. నా మాట విని మాతోరా! లేకపోత బలవంతంగానైనా తీసుకుపోతాం" అన్నాడు.

ఆమె మనసు భగ్గుమంది.

"ఇంకొక్క మాట మాట్లాడావంటే నీ నాలుక తెగ్గోస్తాను" అంది నవీన తీవ్రంగా.

నాయకుడి మొహం క్రూరంగా మారింది.

"దీన్ని జుట్టు పట్టుకుని లాక్కురండి. ఎదురుతిరిగితే కాళ్ళు విరగ్గొట్టి మరీ తీసుకురండి. నేను ఈలోపు గొలుసు లాగుతాను. ట్రయిను ఆగీ ఆగగానే దీంతోపాటు దిగిపోదాం" అన్నాడు నాయకుడు.

దొంగలు ఆమెను చుట్టుముట్టారు. అదే సమయంలో ఆమెను ఎలాగైనా రక్షించాలనుకున్న రాజు ఆ పక్కనే ఒక యువకుడి దగ్గర వున్న ఆక్వేరియంలోని చేపల్ని అతను చూడకుండా బయటకు తీసి టక్ చేసుకుని వున్న ఆ దొంగల షర్టుల్లో వేశాడు. అవి వాళ్ళ షర్టులకి శరీరాలకి మధ్య ఎగిరెగిరి పడేసరికి వాళ్ళంతా కంగారుపడుతూ భయంగా అరుస్తూ చిందులు తొక్కసాగారు. అదే అదనుగా భావించిన నవీన పిడికిలితో ఒక దొంగ మొహం మీద ఈడ్చికొట్టింది. అతను బాధగా అరుస్తూ వెళ్ళి స్టూడెంట్సు మధ్యలోపడ్డాడు. అంతే! స్టూడెంట్సుంతా ఆ దొంగని కమ్మేశారు. అంతలో మరో ఇద్దరు దొంగల్ని సునాయాసంగా పడగొట్టింది నవీన. ఆ ఇద్దర్నీ అక్కడే వున్న ప్రయాణీకులు చుట్టుముట్టారు. ఏం జరుగుతున్నదో గ్రహించేలోగా నాయకుడి షర్టులో కూడా చేపల్ని వదిలాడు రాజు. దాంతో ఆయన కూడా చిందులు తొక్కసాగాడు. నవీన ఆయన మీద కూడా దాడి చేసింది. చితకబాది ఆయన్ని ప్రయాణీకులకి అప్పగించింది. ఆ దొంగల్నందర్నీ కసితీరాకొట్టి ఒక పాతలుంగీని ఎవరి

## తేడా



'సత్యానికి నమ్మకానికి తేడా ఏమిటో చెప్పగలరా?

భర్తను అడిగిందో భార్య.

ఆయన ఒక్కక్షణం ఆలోచించి,

'మన పుత్రరత్నం రాజు నీకొడుకు అన్నది సత్యం. ఇక వాడు నా కొడుకు అన్నది ఓ నమ్మకం.. అర్థమైందా?' అన్నాడు.

దగ్గరో తీసుకుని దాన్ని ముక్కలుగా చించి ఆ ముక్కలతో ఆ దొంగల కాళ్ళూ చేతులు కట్టి పడేశారు.

ఇలా జరుగుతుందని ఆ దొంగలు అసలు ఊహించలేదు. ఆ తర్వాత వాళ్ళు దోచుకున్న సొమ్మంతా ఒక చోట పోసి ప్రయాణీకులు ఒకరి తర్వాత ఒకరుగా వచ్చి తాము పోగొట్టుకున్న నగలు డబ్బు తీసుకోమని చెప్పింది నవీన. అంతా ఆమె చెప్పినట్లుగా చేశారు.

ట్రయిను ఏదో స్టేషన్లో ఆగింది. నవీన కిందకి దిగి వెళ్ళి రైల్వే పోలీసుల్ని వెంటబెట్టుకుని వచ్చింది.

ఆ దొంగల్ని చూసిన ఇన్‌స్పెక్టర్ దిగ్భ్రాంతికి గురయ్యాడు.

"వీళ్ళని పట్టుకోవాలని గత అయిదేళ్ళుగా మేము చేయని ప్రయత్నం లేదు. అయినా ఇంతవరకు వీళ్ళని పట్టుకోలేకపోయాం. నిజంగా మీరు వీళ్ళని ఇంత తేలికగా పట్టుకోవడం ఒక అద్భుతమైన విషయం" అన్నాడాయన ప్రశంసాపూర్వకంగా.

ఆమె కొద్దిగా సిగ్గుపడుతూ "నేరం చేసిన వాళ్ళు ఏదో ఒకరోజు చట్టానికి దొరక్క తప్పదు" అంది.

"అవును. మీరు చెప్పింది అక్షరసత్యం... ఇంతకీ మీరేం చేస్తూంటారు? " అడిగాడాయన

"ఇన్స్‌పెక్టర్ని... రాణిగంజ్ పోలీస్‌స్టేషన్లో సర్కిల్ ఇన్‌స్పెక్టర్ని" అంది హుందాగా.

ఆయనతో సహా అక్కడున్న ప్రయాణీకులందరూ విభ్రాంతిగా కళ్ళు పెద్దవి చేసి ఆమె వంక చూశారు.

"అదీ సంగతి. అలా చెప్పండి. మీరు కూడా మాజాతివాళ్ళే గనుక ఈ దొంగల్ని పట్టుకోగలిగారు. అదే మరొకరికయితే ఎలా సాధ్యమవుతూంది" అన్నాడు అభినందనగా.

ఆమె. సన్నగా నవ్వింది.

"మీ విషయం మా పై అధికారులకి తెలియజేస్తాను. తప్పకుండా వాళ్ళనుండి మీకు గుర్తింపు వుంటుంది" అన్నాడాయన.

"థాంక్యూ" అందామె కృతజ్ఞతగా.

"ఈ దొంగలేకాకుండా వీళ్ళను మించిన ఒక గజదొంగ ఈ కంపార్టుమెంటులో జంటిల్‌మేన్‌గా నాటకమాడుతూ ప్రయాణం చేస్తున్నాడు. అతన్ని ఇక్కడ కాకపోయినా సికింద్రాబాద్ వెళ్ళాకైనా ఏదో ఒక కేసులో పట్టుకుతీరతాను" అంది నవీన రాజు వైపు ఓరగా చూస్తూ.

"ఎవరతను? " ఆ రైల్వే ఇన్‌స్పెక్టరు కఠినంగా అడిగాడు.

ఆమె నవ్వి "మీకెందుకులెండి శ్రమ. అతని సంగతి నేను చూసుకుంటాను. చట్టం అంటే ఏమిటో ఆ వ్యక్తికి తెలియజేస్తాను" అంది స్థిరంగా.

"ఓ.కే మేడమ్... మరి నేను వుంటాను" ఆయన నవీనతో కరచాలనం చేస్తూ అన్నాడు.

ఆమె చిర్నవ్వుతో తలూపింది. ఆయన, మిగిలిన పోలీసులు ఆ దొంగల చేతులకి బేడీలు తగిలించి బయటకు తీసుకువెళ్ళిపోయారు.

ట్రయిను కదిలింది.

అప్పటివరకు ఆమె తమలాంటి సాధారణ స్త్రీగా భావించిన ఆడవాళ్ళంతా నవీన వంక ఆరాధనా భావంతో చూశారు. ఆమెను ఎలాగైనా తాకాలని, ఆమె దృష్టిలో పడాలని, ఆమె పక్కన కూర్చోవాలని శతవిధాలా ప్రయత్నించిన కుర్రకారంతా ఆమె ఇన్‌స్పెక్టర్ అని తెలియగానే అక్కడ్నుంచి మెల్లగా జారుకున్నారు.

పట్టాభికయితే ఆమెను తలెత్తి చూడాలంటేనే భయంగా వుంది. కాని ఆమె పక్కన ఎలాంటి తొణుకుబెణుకు లేకుండా కూర్చుని వున్న రాజుని చూస్తుంటే అతనికి ఆశ్చర్యంగా అన్పిస్తోంది. ఏమైనా రాజు గుండె ధైర్యంగల మనిషి అనుకున్నాడు.



ఒక ఔన్సు కార్యాచరణ, ఒక పౌను ప్రబోధకం కంటే విలువైనది. – హబ్బర్డ్

సరిగ్గా అప్పుడే పట్టాభికో సందేహం వచ్చింది. "గురూ! ఇంతక్రితం నేను నీకు వెయ్యి రూపాయిలు ఇచ్చాను కదా! మరి దొంగలు నీ జేబులు వెదికినప్పుడు అవి నీ దగ్గర ఎందుకు దొరకలేదు" అడిగాడు పట్టాభి

రాజు చిద్విలాసంగా నవ్వాడు.

"వాటిని ఒక అపురూపమైన, అద్భుతమైన లాకరులో దాచాను" అన్నాడు రాజు.

"ఈ కంపార్టుమెంటులో అలాంటి లాకరు సౌకర్యం వుందా? నేనెప్పుడూ చూడలేదు. వినలేదు" అన్నాడు పట్టాభి విస్మయంగా.

"అది అందరికీ కన్పించదు. ఎవరికీ తెలియదు కూడా" అన్నాడు రాజు.

"గురూ! నేను ఇంటర్వ్యూల నిమిత్తం ఎప్పుడూ ఏదో ఒక ట్రైనులో ప్రయాణం చేస్తూనే వుంటాను. అంచేత దొంగలబారి నుండి నా డబ్బుని కాపాడుకోవడానికి ఆ లాకర్ని పయోగించుకుంటాను. దయచేసి అది ఎక్కడ వుందో చెప్పు" వేడికోలుగా అడిగాడు పట్టాభి.

రాజు ఇబ్బందిగా చూశాడు. అంతలో మిగిలిన మిగిలిన ప్రయాణీకుల్లో కూడా ఆ లాకరు గురించి తెల్సుకోవాలనే ఉత్సుకత పెరిగింది. అంతా రాజుని ఆ లాకరు గురించి చెప్పమని ప్రాధేయపడ్డారు.

దాంతో రాజు చెప్పక తప్పలేదు. అతను తల తిప్పి నవీన వైపు చూశాడు.

"మేడమ్" పిలిచాడు జంకుతూ.

"ఏమిటీ" అంది కటువుగా.

అతను దొంగ అని, కావాలని తన పక్కన సీటు కోసం ఫిట్సు ఉన్నట్టుగా నాటకమాడి తన ఒడిలో పడుకున్నాడని గ్రహించిన దగ్గర్నుండి అతనంటే ఆమెకు వళ్ళు మండిపోతోంది. అతని ఉనికి అంటేనే ఆమెకి ఎలర్జీగా వుంది.

"మరి... మరి..." నసిగాడు.

ఆమె అసహనంగా చూసింది.

అతను ధైర్యం కూడగట్టుకుంటూ "మీకు ఒక విషయం చెప్పాలి" అన్నాడు.

"ఏం చెప్పాలి? " చిరాగ్గా అడిగింది.

"అదే... మీ జాకెట్టులో నా దగ్గరున్న వెయ్యి రూపాయలు వేశాను. మీరు ఏమీ అనుకోకుండా ఆ డబ్బుతీసి ఇస్తారా? " అన్నాడు అర్థింపుగా.

పక్కన బాంబు పడినట్టుగా అదిరిపడిందామె. అతని వైపు నిప్పులు చెరిగేలా చూసింది.

"ఏం... తిక్క తిక్కగా వుందా? " గర్జించిందామె.

"కాదు మేడమ్! నేను నిజమే చెప్తున్నాను"

"వెధవ్వేషాలేయకు. మక్కెలిరిగిపోతాయి" అంది మండిపడుతూ.

"అయ్యో... మీకెలా చెప్పాలో అర్థం కావడంలేదు. ఆ దొంగలు వచ్చిన సమయంలో నా దగ్గర వున్న సొమ్ము ఎక్కడ దాచాలో తెలియక మీ జాకెట్లో దాచాను. అంతకు మించి భద్రతగల చోటు నాకు మరొకటి కన్పించలేదు. దయచేసి డబ్బు ఇచ్చేయండి" అన్నాడు అమాయకంగా మొహంపెట్టి.

ఆమెకు వళ్ళు మండిపోయింది. ఆమె ఆవేశంగా ఏదో అనబోతూండగా ఎదురుగా వున్న వృద్ధురాలు కల్పించుకుని "పోనీ లేమ్మా! ఏదో తెలియక చేశాడు. నిజంగా అతని డబ్బులు నీ జాకెట్టులో వుంటే తీసి ఇచ్చేయమ్మా" అంది సర్దిచెప్తూ.

పళ్ళబిగువున కోపాన్ని అణచుకుంటూ పక్కకు తిరిగి ఆమె జాకెట్టుని తడుముకుంది. లోపల వున్న నోట్ల దొంతర చేతికి తగిలింది. ఆమె మ్రాన్పడిపోయింది. తనకు తెలీకుండా ఇతను వెయ్యి రూపాయలు ఎలా తన జాకెట్లో వెయ్యగలిగాడో ఆమెకు అంతుబట్టలేదు.

ఆ డబ్బు జాకెట్లోంచి తీసి అతని మొహం మీదకు విసిరికొట్టింది.

"ఇంకోసారి ఇలాంటి పిచ్చి వేషాలు వేస్తే

అవిశ్వాసానికి ఈ లోకంలో తావులేదు. వేసిన విత్తనం మొక్కగా మొలుస్తుందనే విశ్వాసమే ఈ సృష్టికి మూలాధారం. - లిథిన్

షూట్ చేసిపారేస్తాను" గర్జించిందామె.

అతను అలాగేనన్నట్టుగా తలూపి తన ఒడిలోపడిన ఆ వందనోట్లని అందుకుని పేకముక్కల్లా పేర్చి పట్టుకుని ఆ నోట్లని అందరికీ చూపించాడు.

"ఈ నోట్లు రెండు గంటలపాటు ఎంత అపూర్వమైన, అద్భుతమైన ప్లేస్‌లో వుండి వచ్చాయో మీ అందరికీ తెల్సు. అంచేత వీటి విలువ ఎన్నో రెట్లు పెరిగింది. ఈ మహత్తరమైన నోట్లని ఎవరైనా స్వంతం చేసుకోదల్చుకుంటే నేను ఇప్పుడు పెట్ట బోయే వేలం పాటలో వాటిని నిరభ్యంతరంగా పాడుకోవచ్చు" అన్నాడు రాజు.

కుర్రకారు ఎగబడిపోయారు. వృద్ధులు ఎంతో ఉత్సాహం చూపించారు. అప్పటివరకు బాత్‌రూము దగ్గర కూర్చుని తాపీగా గంజాయి తాగుతూన్న సన్యాసులు సైతం ఈ విషయం తెల్సి అక్కడికి హడావిడిగా వచ్చారు.

ఇదంతా చూస్తున్న నవీన మొహం కంద గడ్డలా మారింది. తోకతొక్కిన తాచులా బుసలు కొట్టింది. ఆమె కోపాగ్నిని అతను అసలు పట్టించుకోలేదు.

వేలం పాట మొదలుపెట్టాడు.

"మన్మథుడి పాట రెండు వేలు" అన్నాడు.

"నా పాట రెండువేల అయిదు వందలు" ఒక వృద్ధుడు హుషారుగా అన్నాడు.

"నా పాట మూడు వేలు" ఒక సన్యాసి ఉద్వేగంతో అన్నాడు.

ఆడవాళ్ళంతా ఈ పరిణామానికి చిత్రంగా బుగ్గలు నొక్కుకుంటున్నారు. వృద్ధులు సైతం ఈ వేలం పాటలో పాల్గొనడం వాళ్ళకి వింతగా, విడ్డూరంగా అన్పించింది.

పాట మంచి ఊపందుకుంది. కుర్రకారుకి, వృద్ధులకి, సన్యాసులకి మధ్య పోటీ హోరా హోరీగా సాగింది. చివరికి ఒక సన్యాసి పదివేలకు ఆ పది వంద నోట్లను విజయవంతంగా పాడుకున్నాడు.

జడలు కట్టి వున్న జుట్టుని అతను ఒక్కసారిగా నెత్తిమీంచి తొలగించాడు. అతనిది నున్నని గుండు. ఆ గుండు మీద వున్నాయి అయిదువందల రూపాయల నోట్ల కట్టలు మూడు. ఒక నోట్ల కట్ట లోంచి కొన్ని నోట్లు లాగి రాజుకి అందించాడు. చుట్టూ వున్న ప్రయాణీకులంతా బిత్తరపోయారు. అతను తిరిగి మళ్ళీ ఆ విగ్గుని తగిలించేసుకుని సన్యాసిలా మారిపోయాడు.

రాజు అతనిచ్చిన నోట్లని లెక్క పెట్టాడు. సరిపోయాయి. రాజు తన దగ్గర వున్న పది వంద నోట్లని అతనికి అందించాడు.

వాటిని ఎంతో అపురూపంగా చూస్తూ ఆ సన్యాసి వాటిని గుండెలకు హత్తుకున్నాడు.

"వీటిని చూసుకుంటూ ఒక జీవితకాలం హాయిగా గడిపేస్తాను" అంటూ ఆ సన్యాసి అక్కడ్నుంచి కదిలాడు.

నవీనకు వంటిమీద జెర్రులు పాకుతున్నట్లుగా అన్పించింది. రాజుని పీక పిసికి చంపేయాలన్నంత ఉక్రోషంగా వుంది.

రాజు పదివేల రూపాయలు జేబులోకి నెడుతూ నవీన వంక చూసి "థాంక్స్ మేడమ్" అన్నాడు. ఆమె కోపంగా చూస్తూ "నిన్నేం చేసినా నా కసి తీరదు" అంది.

"దయచేసి ఈ అభాగ్యుణ్ణి వదిలేయండి" అన్నాడు భయాన్ని నటిస్తూ.

ఆమె నిరసనగా చూసి విసురుగా తల తిప్పేసుకుంది.

మొదట పందెం వేసి వెయ్యి రూపాయల్ని సంపాదించిన రాజు ఇప్పుడు ఆ వెయ్యి రూపాయల్ని పది వేలు చెయ్యడం అక్కడున్న స్టూడెంట్సుకి అద్భుతంగా అన్పించింది.

"భూమిలోకి బాణం వేసి అర్జునుడిలా నీళ్ళు పైకి రప్పించగల సమర్థుడు వీడు" అనుకున్నారు ఆ స్టూడెంట్సు మనస్ఫూర్తిగా.

★ ★ ★

ట్రైన్ సికింద్రాబాద్ స్టేషన్లో ఆగింది. అప్పటికే తమ బ్యాగులు, సూట్‌కేసులు

తీసుకొని డోరు దగ్గరికి చేరుకున్న ప్రయాణీకులు ఒకర్నొకరు తోసుకుంటూ కిందికి దిగారు.

అందరూ దిగాక అప్పుడు రాజు, పట్టాభి ఫ్లాట్‌ఫాం మీదికి వచ్చారు.

"ఏమైనానువ్వు చాలా జాగ్రత్తగా ఉండాలి గురూ! ఆ ఇన్‌స్పెక్టర్ నీమీద బాగా పగబట్టినట్టుంది." అన్నాడు పట్టాభి రాజుని హెచ్చరిస్తూ

రాజు సమాధానంగా చిర్నవ్వు నవ్వాడు తప్ప ఏం మాట్లాడలేదు.

సరిగ్గా అప్పుడే పట్టాభి దృష్టి ఎంట్రన్స్ డోరు దగ్గర టి.సి.కి రాజుని చూపిస్తూ ఏదో చెప్తూన్న నవీన మీద పడింది. అతనికి గుండాగినంతపనయింది.

"గురూ! అటు చూడు. ఆ రాక్షసి నిన్నే చూపిస్తూ ఆ టి.సి.కి ఏదో ఫిర్యాదు చేస్తోంది. కొంపదీసి నువ్వు టిక్కెట్టు తీయలేదన్న సంగతి చెప్తుందేమో? " ఆందోళనగా అన్నాడు పట్టాభి.

"ఏం కాదు. పద" అన్నాడు రాజు.

దగ్గరికి రాగానే టి.సి. రాజుని అడిగాడు.

"టిక్కెట్టు ప్లీజ్"

రాజు ఒక్క క్షణం నవీనవైపు చూశాడు. ఆమె పరిహాసంగా నవ్వుతోంది. రాజు ఆమె ఊహించనివిధంగా జేబులోనుంచి టిక్కెట్టు తీసి టి.సి.కి అందించాడు. ఆ టిక్కెట్టు పరిశీలించిన ఆ టి.సి. సంతృప్తిగా తలపకించి "మీరు వెళ్లవచ్చు" అన్నాడు.

నవీన మొహంలో నెత్తురు చుక్కలేదు. పట్టాభి ఆశ్చర్యానికి అంతులేకుండా పోయింది. రాజు దగ్గరికి ఆ టిక్కెట్టు అంత హఠాత్తుగా ఎలా వచ్చిందో అతనికి అర్థం కాలేదు.

రాజు వెళ్లబోతూ ఆగి "నామీద ఫిర్యాదు చేసిన వాళ్ల టిక్కెట్టు కూడా మీరు అడిగితీసుకుంటే బావుంటుందనుకుంటా" అన్నాడు.

ఆయన పక్కనే ఉన్న నవీన వైపు చూశాడు.

"మేడమ్! మీ టిక్కెట్టు కూడా చూపించండి" అన్నాడు టి.సి.

ఆమె రోషంతో ముక్కుపుటాలు ఆదురుతుండగా బ్యాగులో చెయ్యి పెట్టింది. ఆమె ఉలిక్కిపడేలా చేస్తూ ఆటిక్కెట్టు ఆమె చేతికి తగల్లేదు. ఆమె ఒక్కక్షణం బిత్తరపోయింది. అంతలోనే తేరుకుని గబగబా బ్యాగు మొత్తం వెదికింది. కాని ఆ టిక్కెట్టు దొరకలేదు. ఆమె తలెత్తి అనుమానంగా రాజు వంక చూసింది. అతను చిలిపిగా నవ్వుతున్నాడు. సందేహం లేదు తన టిక్కెట్టుని రాజు కాజేసి వుంటాడు అనుకుంది. ఆమె మనసు భగ్గుమంది. కాని రాజు చేసిన పనిని టి.సి.కి చెప్పినా ఏం ప్రయోజనం ఉండదని ఆమె గ్రహించింది.

అంతలో టి.సి. "ఏం మేడమ్... మీటిక్కెట్టు" అన్నాడు అసహనంగా.

ఆమె ఇబ్బందిగా చూస్తూ "నాటిక్కెట్టు ఎక్కడో జారిపోయింది. మీరు పెనాల్టీ ఎంతో చెప్తే కడతాను" అంది.

ఆయన ఆమె వైపు చిత్రంగా చూసి రశీదు బుక్కులో ఎమౌంట్ వేసి సంతకం చేసి ఒక కాపీ చించి ఆమెకు ఇచ్చాడు. దానిలో వేసిన పెనాల్టీ డబ్బు మొత్తం కట్టిందామె.

"మీలాంటి నిజాయితీ పరులు ఈ రైల్వే శాఖలో పనిచేస్తూన్నందుకు రైల్వే డిపార్టుమెంట్ మొత్తం గర్వపడుతుంది." రాజు టి.సి.ని ప్రశంసించాడు.

నవీన నిప్పులు చెరిగేలా రాజు వైపు చూసింది.

అతను ఆమె చూపుల్ని పట్టించుకోకుండా పట్టాభితో కల్సి బయటకు వచ్చాడు.

"ఆగు" అందామె అతని వెనుకేవచ్చి

అతను ఆగి ఆమె వైపు చూశాడు.

"చూడు! నాటిక్కెట్టు కాజేసి నాచేతనే పెనాల్టీ కట్టించానని విర్రవీగకు. ఏదో ఒక రోజు నిన్ను ఏదో ఒక కేసులో పట్టుకుని నీ అంతు చూడకుండా వదలను" అంది




ఆవేశంగా.

రాజు ఏం మాట్లాడలేదు. పట్టాభి బిత్తరపోయి చూస్తున్నాడు.

అంతలో ఆమె కోసం పోలీస్ జీపు వచ్చింది. దానిలోంచి దిగిన ఒక కానిస్టేబుల్ ఆమె దగ్గరికి వచ్చి ఆటెంషన్లో నిలబడి సెల్యూట్ చేశాడు.

"మేడమ్! జీపురెడీ" అన్నాడు వినమ్రంగా.

ఆమె తలూపి అక్కడ్నుంచి కదలబోతూ రాజు వైపు తీవ్రంగా చూసింది.

"రోజులు లెక్కపెట్టుకో.... ఊచలు లెక్కపెట్టుకోవడానికి. ఈ నవీన ఒకసారి ఒక మాట అన్నది అంటే అది జరిగి తీరుతుంది." అంది స్థిరంగా.

రాజు నోరు మెదపలేదు. ఆమె జీపులో వెళ్లిపోయింది.

"గురూ! ఆమె పగ ఈ సంఘటనతో రెట్టింపు అయింది. నువ్వు మరింత జాగ్రత్తగా ఉండాలి" అన్నాడు పట్టాభి.

నాగురించి నువ్వేం దిగులుపడకు. నాకేం కాదు" అన్నాడు రాజు భరోసాగా.

ఇద్దరూ రోడ్డుమీదకు వచ్చారు.

"గురూ నీ అడ్రస్సివ్వు. ఇంటర్వ్యూ అయ్యాక నిన్ను వచ్చి కలుస్తాను" అన్నాడు పట్టాభి.

ఫ్లాట్ఫాం తప్ప మనకు అడ్రస్సుంటూ ఏదీ లేదు" అన్నాడు రాజు నవ్వుతూ

"మరి నిన్నెలా కలవాలి గురూ!"

"ఒక పనిచెయ్. వారంరోజుల తర్వాత అంటే వచ్చే అదివారం ఉదయం పది గంటలకి ట్యాంకుబండ్ మీద ఉన్న సీతారామరాజు విగ్రహం దగ్గరికి రా! అక్కడ కలుద్దాం" అన్నాడు రాజు.

పట్టాభి కళ్లు మెరిశాయి.

"నువ్వు అదే మాట మీద వుండుగురూ! నేను తప్పకుండా ఆసమయానికి నువ్వు చెప్పిన చోటుకి వస్తాను. నువ్వు రాకపోతే



మాత్రం చాలా బాధపడతాను. ఎందుకో తెలీదుగురూ! నీ పక్కన వుంటే నాకు అభయాంజనేయస్వామి చెంతన ఉన్నంత నిశ్చింతగా వుంటుంది" అన్నాడు మనస్ఫూర్తిగా.

ట్రయిన్‌లో పరిచయమయిన ఈ కొద్ది సమయంలోనే తనపట్ల ఇంత అభిమానం, నమ్మకం ఏర్పరుచుకున్న పట్టాభి మాటలకు రాజు కదలిపోయాడు.

అతని చేతిని అందుకుని చిన్నగా నొక్కి వదిలాడు.

"నువ్వు నాఆత్మీయుడివి. నిన్ను కలవకుండా ఎందుకుంటాను" అన్నాడు.

ఆ మాటలకు పట్టాభి పొంగిపోయాడు.

"ఉంటాను గురూ!" అన్నాడు.

"ఓకే...విష్‌యూ బెస్టాఫ్‌లక్. నువ్వు ఉద్యోగస్థుడిని కావాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను" అన్నాడు రాజు.

"థాంక్యూ గురూ!" అన్నాడు పట్టాభి.

అతను అక్కడ్నుంచి వెళ్లిపోయాడు.

★ ★ ★

రాజు చురుగ్గా ఆలోచిస్తూ ముందుకు నడుస్తున్నాడు. ఇప్పుడు అతని మనసులో ఒకే ఒక ఆలోచన ఉంది. తను ఈ మహానగరంలో ఎక్కడ వుండాలి? ఏదయినా ఫైవ్ స్టార్ హోటల్లో వుండాలంటే రోజుకి పదివేలుకావాలి. తనదగ్గర ఉన్న పదివేలు ఒక్క రోజుకి సరిపోతాయి. మరుసటి రోజు నుండి ఏం చేయాలి?

అలా ఆలోచిస్తూ వస్తున్న అతనికి రోడ్డు పక్కన ఒక కూల్‌డ్రింకు షాపు ముందు నిలబడి డ్రింక్సు తాగుతూ మాట్లాడుకుంటున్న కాలేజి అమ్మాయిలు కన్పించారు. దాదాపు వాళ్లు వందమంది వరకు వున్నారు.

"ఏమే అంకితా! నీ బర్త్‌డే పార్టీని ఈ కూల్‌డ్రింక్సుతో సరిపెడదామనుకుంటు

న్నావా? అదేం కుదరదు" అంది సుప్రియ.
"ఏం కావాలో అడగవచ్చు కదా!" అంది అంకిత.
"అయితే ఈ రోజు మెగాస్టార్ సినిమా రిలీజు అయింది కదా! దానికి మమ్మల్నిం దర్నీ తీసుకువెళ్లాలి".
"అలాగే. హాస్టలుకి వెళ్లగానే అంతా త్వరగా రడీ అవ్వండి. తీసుకువెళతాను" మాటిచ్చింది అంకిత.
"అదేం కుదరదు. ఒకేసారి అంతా వెళితే వార్డెన్‌కి అనుమానం వస్తుంది. అంచేత ఈ రోజు కొందరు, రేపు కొందరు వెళ్లండి" వారిస్తూ అంది మిథిల.
అదీ నిజమేనన్పించింది అందరికీ. మిథిల ఏమాట చెప్పినా ముందుచూపుతో చెప్తుం దని అందరికీ తెలుసు. అందుకే ఆమె మాటలకు ఆ హాస్టలు అమ్మాయిలు ఎంతో విలువ ఇస్తారు. ఎవరికి ఏ సమస్య వచ్చినా ఆమె దగ్గరికి వచ్చి సలహాలు తీసుకుం టారు. అందరికీ తలలో నాలుకలా వుండే మిథిల అంటే అమ్మాయిలందరికీ ఎంతో అభిమానం, గౌరవం. ఆమెకున్న ధైర్యానికి, తెలివితేటలకు అంతా ముగ్ధులవుతుంటారు.
అందుకే ఆమె చెప్పినదానికి అంతా అంగీ కరించారు. అయితే వాళ్ల మాటలు విన్న రాజు తన సమస్య తీరిపోయినట్లుగా తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు.
షాపులో బిల్లు కట్టి అమ్మాయిలంతా రోడ్డు మీదకు వచ్చారు. వాళ్ల దగ్గరికి వెళ్లిన రాజు అడిగాడు అమాయకంగా మొహం పెట్టి.
"చార్మినార్‌కి వెళ్లాలంటే ఏ బస్సెక్కాలి?"
"నైన్" అంది సుస్మిత.
"చార్మినార్ ఎత్తుగా వుంటుందాండీ?"
అమ్మాయిలు అతనివైపు చిరాగ్గా చూశారు.
"ఉంటుంది" అంది సుస్మిత.
"అక్కడ్నుంచి దూకితే చచ్చిపోవచ్చా?"
అమ్మాయిలందరికీ వళ్లు మండింది. అతను కావాలని తమని ఆటపట్టిస్తున్నాడే మోనన్న అనుమానం కలిగింది.
"ఎందుకు? నువ్వు ఛస్తావా?" కసిగా అడిగింది దివ్య.
"అవును"
"చావడానికి చార్మినార్ దాకా ఎందుకు. అదిగో ఆ వస్తున్న సిటీ బస్సుకిందపడు. చచ్చూరుకుంటావ్" కటువుగా అంది అంకిత.
అంతే! వాళ్లెవరూ ఊహించని విధంగా రాజు ఆ సిటీ బస్సుకి ఎదురు వెళ్లాడు. అమ్మాయిలు గతుక్కుమన్నారు. రాజుని గమనించిన ఆ బస్సు డ్రయివర్ సడన్‌బ్రేకు వేశాడు. బస్సు కీచుమని రొద చేస్తూ రాజుకి ఒక గజం దూరంలో ఆగింది. డ్రయివరు విండోలోంచి తల బయటకు పెట్టి రాజువైపు తీవ్రంగా చూశాడు.
"నీకసలు బుద్ధుందా? అంతగా నీకు చావాలని వుంటే ఏ ట్రయినుకిందయినా పడు. ఎవరికీ ఏ ఇబ్బంది వుండదు. మా బస్సుకింద పడితే మా ఉద్యోగాలు పోతాయి" అన్నాడు మండిపడుతూ.
అంతలో అమ్మాయిలు పరుగున వచ్చి రాజుని పక్కకు లాగారు. రాజు వాళ్లందరి వైపు ఉక్రోషంగా చూస్తూ "మీరంతా మంచి వాళ్లు కాదు. మా బామ్మ కలలో సైతం చీమకి కూడా హానిచేయవద్దనేది. ఇప్పుడు మీరు ఇచ్చిన సలహా మూలంగా పాపం ఆ డ్రయివరు ఉద్యోగం అన్యాయంగా పోయేది. ఒకవేళ నేను చనిపోయి వుంటే నా ఆత్మకు శాంతి ఉండేది కాదు. ఇంకెప్పుడూ ఇలా ఒక రికి నష్టం కలిగించే సలహాలు దయచేసి ఎవ్వరికీ ఇవ్వొద్దు" అన్నాడు.
అమ్మాయిలంతా బిత్తరపోయారు.
తన చావులో సైతం ఎదుటి వాళ్లకు ఎలాంటి అన్యాయం జరగకూడదని కోరు కునే అతను వాళ్లందరి కళ్లకు ఎంతో ఉన్న తంగా కన్పించాడు.
"అసలు నువ్వు ఎందుకు చనిపోవాలను



సత్యము, అహింస, ఒకదానితో ఒకటి ముడిపడి వున్నాయి. వాటిని విడదీయటం సాధ్యంకాదు -మహాత్మాగాంధీ

కుంటున్నావ్? " జాలిగా అడిగింది అంకిత.

అతను గాఢంగా నిట్టూర్చాడు. కొద్ది క్షణాలు శూన్యంలోకి చూశాడు. ఆ తర్వాత గొంతు సవరించుకున్నాడు.

"మాది అమలాపురం దగ్గర ఒక పల్లెటూరు. మొన్న వచ్చిన ఉప్పెనకి మా ఊరు మొత్తం కొట్టుకుపోయింది. నన్ను కూడా అలలు సముద్రంలోకి లాక్కుపోయాయి. ఊపిరి అందక ఉక్కిరిబిక్కిరయ్యాను. అంతలో బండి చక్రమంత తాబేలు ఒకటి ఆ నీటిలో కదుల్తూ వస్తూ కన్పించింది. ప్రాణ భయంతో విలవిలలాడుతున్న నేను ఆ తాబేలు నడుముని గట్టిగా పట్టుకున్నాను. చిత్రంగా అది నన్ను ఒడ్డుకి చేర్చింది. ఊరిలోకి అడుగుపెట్టిన నేను కుంగిపోయాను. ఎక్కడ చూసినా శవాల గుట్టలు. నన్ను ప్రాణానికి ప్రాణంగా చూసుకునే మా బామ్మ కూడా చనిపోయింది. ఇక నాకు అక్కడ ఉండబుద్ధిగాక ట్రయిను ఎక్కి ఇదుగో ఈ ఊరు వచ్చాను. కాని ఇక్కడ జనం కుప్పలు తెప్పలుగా ఉన్నా ఆప్యాయంగా, ఆదరంగా పలకరించే వాళ్లు ఒక్కరు కూడా కన్పించ లేదు. మా బామ్మ లేని ఈ లోకం శూన్యంగా అన్పించింది. అందుకే మా బామ్మ దగ్గరికి వెళ్లిపోదామని గట్టిగా నిర్ణయించుకున్నాను. అలా వెళ్లాలంటే చావు ఒక్కటే మార్గం కాబట్టి నేను చావాలనుకున్నాను" అన్నాడు రాజు బరువుగా.

అతని జాలి గాథ అందరి మనసుల్ని కదిలించి వేసింది. కొందరి కళ్లు చెమ్మగిల్లాయి కూడా. అంతలోనే రాజు అడిగాడు "నేను ట్రయిను క్రిందపడి చనిపోతే ఆ ట్రయిను డ్రయివర్ ఉద్యోగం పోదుకదా? "

ఎవరో కరుకయిన ఇనుప పిడికిళ్లతో తమ హృదయాల్ని పట్టుకుని పిండుతున్నట్లుగా అమ్మాయిలు విలవిలలాడిపోయారు. అంతగా విషాదాన్ని రక్తికట్టించాడు రాజు.

"నువ్వు అలాంటి ఆలోచనలు పెట్టుకోకు" వారించింది అంకిత.

"మరి మా బామ్మను చేరుకునేదెలా? " దిగులుగా అడిగాడు రాజు.

అంకిత అమ్మాయిలందరి వైపు చూసి అంది. "ఇతన్ని ఇలాగే వదిలేస్తే నిజంగానే ఏ ట్రయినుకిందో పడి ప్రాణాలు పోగొట్టుకుంటాడు. తెల్సి తెల్సి మనం ఇతన్ని ఆదుకోకపోతే ఆ పాపం మనల్ని చుట్టుకుంటుంది. జీవితాంతం ఏదో తప్పుచేసినట్టుగా మనం ఫీలవ్వవలసి వుంటుంది.

దాంతో అమ్మాయిలంతా ఆలోచనలో పడ్డారు. కాసేపు తమలో తాము తర్జన భర్జనలు పడ్డారు. చివరికి అంతా కూడా రాజుని తమతోపాటు హాస్టలుకి తీసుకువెళ్లడానికి నిర్ణయించారు. అయితే తుది నిర్ణయం మిథిలకి వదిలారు.

ఆమె రాజువైపు చూసి అడిగింది. "నువ్వు మాతోపాటు హాస్టలుకి వస్తావా? " అని.

"ఏం మీ హాస్టలు ఎత్తుగా వుంటుందా? అక్కడ్నుంచి దూకితే పైకిపోవచ్చా? " అడిగాడు రాజు ఆశగా.

ఆమె అసహనంగా తలవిదిలించింది.

"కాదు. మాతోపాటు కొద్ది రోజులు హాస్టల్లో ఉందువుగాని" అంది.

రాజు కొద్ది క్షణాలు ఆలోచిస్తూండిపోయాడు. తర్వాత "మరి మీరంతా మా బామ్మలా చూసుకుంటానని మాటిస్తే అప్పుడు వస్తాను" అన్నాడు.

"అలాగే... చూసుకుంటాం" మాటిచ్చింది అంకిత.

"అలా అని ఒట్టేయండి" చేతిని సాచాడు. ఆ చేతిలో చెయ్యివేసిన అంకిత అంది

"ఒట్టు"

"అయితే నాకు ఇష్టమే" అన్నాడు రాజు అంగీకారంగా.

అంతా ఈ రాజుని వెంట బెట్టుకుని అక్కడ నుండి బయల్దేరారు. అమ్మాయిలు దాదాపుగా వందమంది వరకు ఉన్నారు.

మనుషులు నకిలీ కరెన్సీనోట్లు తయారుచేస్తారు. అలాగే నోట్లు నకిలీ మనుషుల్ని తయారుచేస్తాయి. - సిడ్నీ హారిస్

అంతా రకరకాల అధునాతన దుస్తుల్లో సీతాకోకచిలుకల్లా మెరిసిపోతున్నారు. వాళ్ళందరి మధ్యగా వున్న రాజు గోపికల మధ్య కృష్ణుడిలా వెలిగిపోతున్నాడు.

వాళ్ళు రోడ్డుమీద వెళ్తుండగా రోడ్డుకి ఇరువైపులా నిలబడివున్న యువకులు చాలా మంది రాజువైపు విభ్రాంతిగా చూశారు.

"మనం సంవత్సరాల తరబడి ఎంతోమంది అమ్మాయిలకి లైనువేస్తున్నాం. కాని ఇంతవరకు ఒక్క అమ్మాయి కూడా పడలేదు. అలాంటిది వీడేమిట్రా బాబూ! ఏకంగా వంద మంది అమ్మాయిల్ని లైనులో పెట్టేశాడు" అన్నాడు ఒక యువకుడు ఆశ్చర్యంగా.

"బ్రహ్మ తన కలాన్ని అందమైన అమ్మాయి చిర్నవ్వులో ముంచి వాడి నుదుటి రాతను రాశాడు. అదే మన రాతనైతే మూసీ నది మురికినీళ్ళల్లో ముంచి రాశాడు" అన్నాడు మరో యువకుడు బరువుగా.

చాలామంది యువకులు రాజువైపు ఈర్ష్యగా చూశారు.

హాస్టలు గేటు దగ్గర కాపలాగా వుండే సెక్యూర్టీ గార్డుల కళ్ళుగప్పి అమ్మాయిలు రాజుని హాస్టలు వెనగ్గా వున్న ప్రహరీగోడని దాటించి చాలా జాగ్రత్తగా లోపలికి తీసుకువచ్చారు. వార్డెన్ సూర్యకుమారి పరమస్ట్రిక్టు కావడంచేత రాజు ఉనికి ఆమెకు తెలిస్తే తామందరికీ ఆ హాస్టల్నుండి ఉద్వాసన లభిస్తుందేమోనన్న ఉద్దేశ్యంతో అతన్ని కంటికిరెప్పలా చూసుకుంటూ, అతన్నుండి ఎలాంటి ఆపద వాటిల్లకుండా చూసుకోగల సామర్థ్యం ఒక్క మిథిలకు మాత్రమే ఉందన్న నమ్మకంతో అమ్మాయిలంతా రాజుని మిథిల రూములో ఉంచడానికి నిర్ణయించారు. వాళ్ళ భయం అర్థం చేసుకున్న మిథిల అతన్ని తన రూములో ఉంచుకోవడానికి అంగీకరించింది.

ఒక్కో రూములో ఇరవైమంది వరకు అమ్మాయిలు వుంటారు. ప్రతి రూము ఎ.సి, మెత్తని ఫోమ్‌బెడ్స్, కార్పెట్, డ్రస్సింగ్ టేబుల్స్ రిఫ్రిజిరేటర్సుతో సౌకర్యవంతంగా వుంటుంది. లైబ్రరీ, క్యాంటీను కూడా ఆ హాస్టలు ఆవరణలోనే వున్నాయి. అందుకే ఆ హాస్టలు స్థితిమంతుల కుమార్తెలకు మాత్రమే అందుబాటులో వుంది.

కాలేజి నుండి రాగానే అమ్మాయిలంతా ముందుగా డ్రస్ ఛేంజ్ చేసుకుని స్నానానికి వెళతారు. అయితే తమ ఎదురుగా రాజు వుండటం మూలంగా డ్రస్ మార్చుకోవడానికి వాళ్ళకి ఇబ్బందిగా వుంది.

ఆ విషయాన్ని గమనించిన మిథిల "రాజూ! కాసేపు నువ్వు బాత్‌రూములో ఉండు" అంది.

"నాకు ఒక్కడికే భయం" అన్నాడు కళ్ళు పెద్దవిచేసి చూస్తూ.

ఆమె అసహనంగా చూసింది.

"ఏంకాదు. పద" అంటూ బలవంతంగా అతన్ని తీసుకువెళ్ళి బాత్‌రూములో ఉంచి బయట బోల్టుపెట్టింది.

అమ్మాయిలు గబగబా బట్టలు విప్పుతున్నారు. అదే సమయంలో రాజు బాత్‌రూములోంచి

"అబ్బ నీ తియ్యని దెబ్బ... ఎంత కమ్మగా వుందిరోయబ్బా!" అని బిగ్గరగా పాడసాగాడు. అమ్మాయిలంతా అదిరిపడ్డారు. క్రింద ఆఫీసు రూములో కూర్చుని వున్న వార్డెన్ సూర్యకుమారి చెవిలో పడింది ఆ పాట. ఆమె మొహం కఠినంగా మారింది. గభాల్న బయటకు వచ్చి తలెత్తి చూసింది. ఆ పాట మిథిల వాళ్ళ రూములోంచి వస్తూందని గ్రహించగానే తన భారీ కాయాన్ని కదుపుకుంటూ ఆగ్రహావేశాలతో ఆ రూమువైపు కదిలింది.

ఆమె రాకని గమనించిన అంకిత బిగ్గరగా అరిచి చెప్పింది.

"వార్డెన్... వార్డెన్ వస్తోంది. అతన్ని ఎక్కడైనా దాచేయండి"

మెరుపువేగంతో కదిలిన మిథిల అతన్ని బాత్‌రూములోంచి బయటకు లాగి వరుసగా వేసివున్న బెడ్స్ క్రిందకు నెట్టేసింది.

"మేము చెప్పేంత వరకు నువ్వు బయటకు రాకు. ఒక్క మాట కూడా మాట్లాడకు" హెచ్చరించింది మిథిల.

అతను బుద్ధిగా తలూపాడు.

సరిగ్గా అదే సమయంలో వార్డెన్ తలుపుమీద దబదబ బాదింది. దివ్య వెళ్ళి తలుపుతీసింది. ఆవేశంతో ఊగిపోతూ లోపలికి వచ్చిన వార్డెన్ అన్ని వైపులకి తన దృష్టిని సారించింది.

"ఎక్కడ? వాడెక్కడ? ఇప్పటివరకు పాటలు పాడిన ఆ మగపురుగు ఎక్కడ? " అంటూ హూంకరించింది.

అమ్మాయిలెవరూ నోరువిప్పలేదు.

"మీరు ఎవరి గురించి మాట్లాడుతున్నారు? " అయోమయంగా చూస్తూ అడిగింది మిథిల.

ఆమె వైపు తీవ్రంగా చూసిన వార్డెన్ "నంగనాచిలా మాట్లాడకు... ఇప్పటివరకు మీ రూములో ఉండి పాటలు పాడిన వాడి గురించి నేను అడిగేది" అంది విసురుగా.

## దూరదృష్టి



ఢిల్లీలోని ఓ పెద్దమనిషి అర్జెంటుగా షెహరన్‌పూర్ వెళ్లాల్సి వచ్చింది. రైల్వేస్టేషన్‌కు ఫోన్‌చేసి అక్కడికి వెళ్లే రైళ్లు ఏటైమ్‌లో బయలుదేరతాయో.. ఎన్నిగంటలకు చేరతాయో.. ఛార్జీ ఎంతో వివరాలు అడిగి తెలుసుకున్నాడు. తరువాత బస్‌స్టేషన్‌కు ఫోన్‌చేసి బస్సుల వివరాలు, ఛార్జీలు తెలుసుకున్నాడు. రైల్‌ఛార్జీకంటే బస్ ఛార్జీయే తక్కువని తేలింది. కానీ ఆయన ఆ లెక్కలు ఈ లెక్కలు వేసుకుని చివరికి రైల్‌టిక్కెట్టే బుక్ చేయించుకున్నాడు.

ఇదంతా గమనించిన బంధువు 'అన్నిలెక్కలు వేసుకుని.. చివరకు ఎక్కువ ఛార్జీపెట్టి రైలుకు బయలుదేరుతున్నావేం?' అని అడిగాడు.

'ప్రమాదం జరిగితే రైల్వేవాళ్లిచ్చే ఎక్స్‌గ్రేషియా ఎక్కువ మరి' అన్నాడు ఆయన టక్కున.

"మీరు పొరపాటు పడుతున్నారు. మా రూములో అలాంటి వారెవరూ లేరు" మృదువుగా అంది మిథిల.

అయితే వార్డెన్ ఆమె మాటల్ని నమ్మలేదు. బాత్‌రూముల్లో, బీరువాల వెనుక బాల్కనీలో అంతటా వెదికి వచ్చింది. ఎక్కడా ఆమెకు ఎవరూ కన్పించలేదు. తిరిగి అమ్మాయిల దగ్గరికి వచ్చిన ఆమె సాలోచనగా అమ్మాయిలవైపు చూసింది. ఒకరిద్దరు అమ్మాయిలు భయం భయంగా బెడ్స్‌వంక చూడసాగారు.

వార్డెన్ మొహం వికసించింది.

"అయితే అతన్ని ఈ బెడ్స్ కింద దాచారన్నమాట" అంది ఉత్సాహంగా.

అమ్మాయిలంతా గతుక్కుమన్నారు. ఒకరిద్దరు అమ్మాయిలకి స్పృహ తప్పుతున్నట్టుగా అన్పించింది.

వార్డెన్ తన భారీ కాయాన్ని వంచి ఒకో బెడ్‌క్రింద చూసుకుంటూ వస్తోంది. రాజుని దాచిన బెడ్ దగ్గరికి రాగానే అమ్మాయిలకి పై ప్రాణాలు పైనే పోయాయి.

అయితే చిత్రంగా ఆ బెడ్ కింద ఆమెకు రాజు కన్పించలేదు. మిగిలిన బెడ్స్ కింద కూడా చూసిన ఆమె నిరాశగా పైకి లేచింది.

"నన్ను చూసి అతన్ని ఇక్కడనుంచి పంపించేశారుకదూ" అందామె అనుమానంగా.

"అంత ఖర్మ మాకేం పట్టలేదు. మీ చెవులకే ఏదో అయి ఇక్కడికి వచ్చి రాద్ధాంతం చేస్తున్నారు. ఒకసారి మీ చెవుల్ని మంచి డాక్టరుకి చూపించుకుంటే మంచిది" అంది మిథిల చిరాకుగా.

దాంతో భగ్గుమంది వార్డెన్

"నా చెవులు నన్నెప్పుడూ మోసం చెయ్యవు. అతను కన్పించలేదు కాబట్టి నువ్వు పేట్రేగిపోతున్నావు. ఏదోఒకరోజు అతన్ని మీ రూములో తప్పకుండా పట్టుకుంటాను. అప్పుడు చెప్తాను మీపని" అంది వార్డెన్ రోషంగా.

"పట్టుకున్నప్పుడు మాట్లాడండి. అంతే గాని ఇలా చీటికి మాటికి వచ్చి మమ్మల్ని అవమానిస్తే మాత్రం సహించం. హాస్టలు యాజమాన్యానికి ఫిర్యాదు చేయవలసి వుంటుంది" అని హెచ్చరించింది మిథిల.

దాంతో వార్డెన్ వెనక్కి తగ్గింది.

అంతలో అంకిత కల్పించుకుని "అవునండీ! మీరు మీ అనుమానాలతో మా వ్యక్తిత్వాలనే అవమానిస్తున్నారు. రుజువులు లేకుండా మమ్మల్ని దోషులుగా పరిగణిస్తున్నారు. అది మంచి పద్ధతి కాదు" అంది కటువుగా.

మిగిలిన అమ్మాయిలు కూడా తలోమాట అనేసరికి వార్డెన్ సూర్యకుమారికి ఏం మాట్లాడాలో తోచలేదు. మిథిలవైపు మాత్రం రుసరుసలాడుతూ చూసి అక్కడి నుండి విసురుగా వెళ్లిపోయింది. పెద్ద తుఫాను వచ్చి వెలిసినట్టుగా అంతా తేలికగా ఊపిరి పీల్చుకున్నారు.

అప్పుడు గుర్తుకొచ్చింది అందరికీ రాజుని మిథిల స్వయంగా బెడ్స్ కింద దాచిన సంగతి. మరలాంటప్పుడు వార్డెన్‌కి రాజు బెడ్‌కింద ఎందుకు దొరకలేదు.

అంతా ఆశ్చర్యంగా ఒకర్నొకరు చూసుకున్నారు. అంకిత గబగబ అన్ని బెడ్స్ క్రింద వెదికింది. అతను కన్పించలేదు. అంతా అయోమయ పరిస్థితిలో పడిపోయారు.

"ఏమయ్యాడు రాజు? " అందరిలో అదే ప్రశ్న, తలెత్తింది.

"రాజూ" అంటూ పిలిచింది అంకిత.

అప్పుడే వాళ్లంతా ఒక పక్కగా విడిచి పడేసిన బట్టలగుట్ట కదిలింది. ఆ గుట్ట కింద నుండి "ఇక్కడున్నాను" అన్న స్వరం విన్పించింది. అంతా ఉలికిపాటుగా ఆ గుట్టవంక చూశారు. గుట్ట మధ్యలోంచి రాజు పైకి లేచాడు. అతన్ని అలా చూస్తూంటే సర్కస్‌లో బఫూన్‌లా అన్పించాడు. అతను విప్పారిన మొహంతో "ఇదుగో ఈ గోళీ నా జేబులోంచి జారి ఈ బట్టల్లోకి పోయింది. ఇందాకట్నుంచీ వెదుకుతూ ఉంటే ఇప్పుడు దొరికింది. ఈసారి నా దగ్గర్నుండి ఎలా తప్పించుకుంటుందో చూస్తాను" అన్నాడు.

మిథిల విసురుగా వచ్చి అతని చెవి మెలిపెట్టి "నీకసలు బుద్ధుందా? ఇక్కడ నువ్వు ఉన్నంతకాలం నోరు విప్పకూడదని చిలక్కి చెప్పినట్టు చెబితే ఏకంగా పాటలు పాడి మా కొంపలు ముంచుతావా" అంటూ గయ్యిమంది.

రాజు బిక్కమొహం పెట్టాడు.

దివ్య కలగజేసుకుని "పోనీలేవే... ఏదో తెలియక చేశాడు. ఇంకోసారి చెయ్యడులే. వదిలెయ్" అంది జాలిగా.

"ఆ మాట నువ్వు కాదు. రాజుని చెప్పమను" అంది మిథిల.

"అలాగే... మీరు చెప్పినట్టుగా పాటలు పాడను. ఇకనుండి పద్యాలు పాడతాను" అన్నాడు అమాయకంగా రాజు.

అమ్మాయిలంతా దిమ్మెరపోయారు. మిథిల తలపట్టుకుంది.

★ ★ ★

ఆ రోజు లంచ్‌టైంలో అమ్మాయిలంతా కాలేజి ఆవరణలో ఉన్న చెట్లకింద భోజనాలు చేసి మళ్లీ క్లాసురూమువైపు వస్తూండగా పద్మినికి హఠాత్తుగా తన పర్సుని చెట్ల కింద మర్చిపోయిన సంగతి గుర్తుకువచ్చి

"మీరంతా ఇక్కడే ఉండండి. అక్కడ

నేను పర్సు మర్చిపోయాను. దాన్ని తీసుకు వస్తాను" అంది.

అంతా అక్కడే ఆగారు. పద్మిని పర్సు కోసం వెళ్లింది. అదే సమయంలో గంటస్తంభం దగ్గర నిలబడి ఉన్నారు పాండు అతని స్నేహితులు. ఆ రోజు పాండు పుట్టినరోజు.

"పాండూ! ఈరోజు నీ పుట్టినరోజు కదా! అందుకే ఈ పుట్టినరోజు నీకు జీవితాంతం గుర్తుండిపోయేలా ఒక అద్భుతమైన పనేదైనా చెయ్యి" అన్నాడు పాండు స్నేహితుడు.

"ఏం చెయ్యాలో నువ్వే చెప్పు" అన్నాడు పాండు సిగరెట్ పొగ పీల్చి వదుల్తూ.

"ఏదైనా చేస్తావా? " రెట్టించాడు అతని స్నేహితుడు.

"ఆ.. చేస్తాను" అన్నాడు ధీమాగా పాండు. అప్పుడే పర్సు తీసుకుని వస్తున్న పద్మినిని చూశాడు పాండు స్నేహితుడు. వెంటనే అతనికో తుంటరి ఆలోచన వచ్చింది.

"అదుగో ఆ వస్తున్న పద్మినిని ముద్దు పెట్టుకోవాలి. అప్పుడు ఆ తీపిజ్ఞాపకం నీ జీవితాంతం గుర్తుండిపోతుంది" అన్నాడు.

"అంతేకదా! చూస్తుండు! ఇప్పుడే ముద్దు పెట్టుకుని వస్తాను" అని కదిలాడు పాండు.

అతను పద్మిని దగ్గరకు వచ్చి "ఎక్స్‌క్యూజ్ మీ... మిమ్మల్నోసారి ముద్దు పెట్టుకుంటాను" అన్నాడు అగ్గిపెట్టె అడిగినంత తేలికగా.

ఆమెకు వళ్లుమండింది.

"కాస్త మాటలు సరిగ్గా రానివ్వండి" అంది తీవ్రంగా.

"ఛ... మాకు తెలీదులే" అని గభాల్న ఆమె చేతినిఅందుకుని ఆమెను దగ్గరకు లాక్కుంటూ ముద్దు పెట్టుకోబోయాడు. ఊహించని అతని అఘాయిత్యానికి ఒక్క క్షణం నివ్వెరపోయిన ఆమె వెంటనే తేరుకుని మెరుపువేగంతో కాలిచెప్పుని అందుకుని అతని చెంప పగలగొట్టింది.

అతను నిర్ఘాంతపోయాడు.

అతని ఫ్రెండ్సు పరుగున వచ్చి ఆమెను చుట్టుముట్టారు. పాండు వాళ్లని వారించాడు.

"వద్దు. దీన్నేమీ అనకండి. ఇది కాలేజి కదా! ఇక్కడ ఏంచేసినా బావుండదు" అని ఆగి ఆమెవంక క్రూరంగా చూశాడు పాండు.

"నన్ను చెప్పుతో కొట్టావు కదూ! అందుకు నువ్వు భారీఎత్తునపరిహారం చెల్లించాల్సి ఉంటుంది. ఈరోజు సాయంత్రం నువ్వు ఉంటున్న హాస్టల్లోనే మేమంతా సామూహికంగా నీ జీవితాన్ని నాశనం చేయబోతున్నాం. దమ్ముంటే నిన్ను నువ్వు కాపాడుకో" అన్నాడు.

ఆమె అతని మాటల్ని లెక్కచేయలేదు. "నీలాంటి ఊరకుక్కల్ని చాలామందిని చూశాను. ఏం చేసుకుంటావో చేసుకో" అంది నిర్లక్ష్యంగా.

అతను కర్కశంగా నవ్వాడు.

"ఈ పాండుని తక్కువగా అంచనా వేస్తున్నావు. వీడు ఒక్కమాట అన్నాడంటే తప్పక చేసి తీరతాడు. అంతా అయ్యాక అప్పుడు తెలుస్తుంది ఈ పాండు సవరేమిటో! అప్పుడు ఆకులు పట్టుకున్నా కాలిన నీ బతుకు బాగుపడదు" అన్నాడు పాండు స్థిరంగా.

"ఏడ్చావ్" అని ఆమె అక్కడనుండి కదిలింది.

"పాపం పాపకి నీ గురించి అసలు తెల్సినట్టు లేదు! అందుకే అలా మిడిసిపడుతోంది" అన్నారు పాండు స్నేహితులు నవ్వుతూ.

పాండు అంటున్న మాటలన్నీ అమ్మాయిల చెవుల్లో పడుతూనే ఉన్నాయి. వాళ్లంతా కలవరపడ్డారు. చలిగాలివీచినట్టుగా వాళ్లందరి శరీరాలు జలదరించాయి.

తమ దగ్గరికి వచ్చిన పద్మిని మీద



అంతా మండిపడ్డారు. "అసలు నీకు బద్ధుందా! పోయిపోయి ఆ పాండుతో ఎందుకు గొడవపెట్టుకున్నావ్? " అన్నారు.

"ఏం వాడికేమైనా కొమ్ములున్నాయా? వాడు చేసిన పనికి కొట్టడం కాదు. నరికి పోగులు పెట్టాలి" అంది పద్మిని ఉద్రేకంగా.

ఆమె వంక అసహనంగా చూసిన అంకిత "అతను ఎవరనుకుంటున్నావ్.. మినిష్టరు ఓం ప్రకాష్‌కి తమ్ముడు. అతను ఏం చేసినా ఈ రాష్ట్రంలో అడిగే నాథుడే లేడు. నువ్వెంత! ఇప్పటికి వాడు ఎన్నో నేరాలు ఘోరాలు చేశాడు. అయినా ఇంతవరకు ఏ చట్టం, ఏ న్యాయ స్థానం కూడా అతన్నేమీ చేయలేక పోయాయి. నువ్వు ఈ కాలేజీలో చేరి పదిహేను రోజులు మాత్రమే అయింది. అందుకే అతని గురించి నీకు పూర్తిగా తెలీదు" అంది మందలింపుగా.

ఆ క్షణం వరకు పాండు గురించి తక్కువగా అంచనా వేసిన పద్మిని మొహం ఒక్కసారిగా పాలిపోయింది. మనసంతా అలజడితో నిండిపోయింది.

"ఇప్పుడెలా? " అంది కంగారుగా పద్మిని. అప్పటికే ఆ విషయంగురించి తీవ్రంగా ఆలోచిస్తూన్న మిథిల చెప్పింది "వార్డెన్‌కి చెప్పి హాస్టల్లోకి పాండు వగైరాలను అడుగు పెట్టనివ్వకుండా కట్టుదిట్టమైన ఏర్పాట్లు చెయ్యమనడమే. అంతకు మించి మరో దారి లేదు"

అమ్మాయిలంతా బరువుగా నిట్టూర్చారు. మనసుల్లో మాత్రం "భగవంతుడా! పరమ దుర్మార్గుడైన ఆ పాండు బారి నుండి అమాయకురాలైన పద్మినిని ఎలాగైనా రక్షించు" అని ప్రార్థించారు.

★ ★ ★



హృదయాల సమ్మేళన లేనిదే ఇల్లూ, వాకిలీ లేవు – బైరన్



ఆ సాయంత్రం హాస్టలుకి వెళ్ళగానే అమ్మాయిలంతా వార్డెన్ దగ్గరికి వెళ్లారు. ఆ రోజు కాలేజిలో జరిగిన సంఘటన గురించి వివరంగా చెప్పి

"మీరు ఎలాగైనా పద్మినికి పూర్తి రక్షణ ఇవ్వాలి మేడమ్. ఎందుకంటే ఆ పాండు పరమ నీచుడు. తప్పకుండా ఈ హాస్టలుకి తన స్నేహితులతో కలిసి వస్తాడు." అంది మిథిల వేడుకోలుగా.

అంతా అర్థమైనట్టుగా తల పంకించింది వార్డెన్. వెంటనే ఇంటర్‌కమ్‌లో గేటు దగ్గర ఉన్న గార్డుల్ని హెచ్చరించింది. "చూడండి. మన హాస్టల్లో ఉన్న ఒక అమ్మాయికి కీడు చేయాలనే తలంపుతో కొందరు స్టూడెంట్సు ఈ సాయంత్రం హాస్ట లుకి వచ్చే ప్రయత్నంలో ఉన్నారట. మీరు ఎంతో అలర్ట్‌గా వుంటూ ఎవర్నీ కూడా నా అనుమతి లేనిదే లోపలికి పంపించవద్దు" అంది.

తర్వాత ఫోన్ పెట్టేసి ఆమె అమ్మాయిల వైపు చూసింది.

"ఇక పద్మినికొచ్చే ప్రమాదం ఏమీ లేదు. మీరు నిశ్చింతగా ఉండండి. ఈ వార్డెన్ సూర్యకుమారి నిర్వహణలో ఉన్న హాస్ట ల్లోకి అడుగు పెట్టాలనే ఆలోచన రావడా నికి వాళ్లకి ఎన్ని గుండెలు. ఒకవేళ అడుగు పెట్టినా నిర్దాక్షిణ్యంగా పిచ్చి కుక్కల్ని కాల్చినట్టు కాల్చి పారేయిస్తాను" అంది భరోసా ఇస్తూ.

దాంతో ఆ అమ్మాయిలందరి మనసులు కుదుట పడ్డాయి. వార్డెన్‌కి థాంక్స్ చెప్పి అంతా తమ రూముల వైపు కదిలారు. అయితే మిథిల మనసు మాత్రం ఇంకా ఏదో కీడుని శంకిస్తూనే ఉంది. ఇది అంత

సందేహంగా వుంటే ఆ మనిషిని పనిలోపెట్టుకోవద్దు. పనిలో పెట్టుకున్నాక సందేహించవద్దు. - కన్ఫ్యూసియస్

తేలికగా సమసిపోయే సమస్యలా అన్పించ లేదు.

ఖచ్చితంగా ఆరు గంటలకి మోటారు బైక్‌ల మీద పాండు అతని స్నేహితులు హాస్టలు సమీపానికి వచ్చారు. మొత్తం ఇరవై మంది వరకు ఉన్నారు. ఒక పది మంది అక్కడ ఆగిపోయి మిగిలిన పది మంది మాత్రం హాస్టలు గేటు దగ్గరికి వచ్చారు.

"ఎవరు కావాలి మీకు? " గద్దిస్తూ అడిగాడు గార్డు.

"మా మరదలు ఈ హాస్టల్లో ఉంది. మాట్లాడి, పోదామని వచ్చాం" అన్నాడు పాండు.

ఆ గార్డుల మొహాల్లో అనుమానం తొంగి చూసింది. వీళ్ళు తప్పకుండా హాస్టల్లోని అమ్మాయి గురించి వార్డెన్ హెచ్చరించిన స్టూడెంట్సు అయి ఉంటారు. అందులో ఎలాంటి సందేహం లేదు అనుకున్నారు గార్డులిద్దరూ

"మర్యాదగా ఇక్కడ నుండి వెంటనే వెళ్ళిపోండి. లేకపోతే పిట్టల్ని కాల్చినట్టు కాల్చి పారేస్తాం" గర్జించారు గార్డులు.

అయితే ప్రహరీ గోడ దగ్గర మిగిలిపోయిన పది మంది బైక్‌లు దిగి ప్రహరీ గోడ మీద నుండి లోపలికి ప్రవేశించి అడుగుల శబ్దంగాకుండా గేటు వైపుకి తిరిగి పాండుతో మాట్లాడుతున్న గార్డుల వెనక్కి చేరుకున్నారు. తమని సమీపించిన ప్రమాదాన్ని ఆ గార్డులు గమనించలేదు. ఆ పది మంది పాండు స్నేహితుల చేతుల్లో హాకీ బ్యాట్లున్నాయి. అవి బలంగా ఆ గార్డుల తలల్ని తాకాయి. అంతే! తలలు పట్టుకుని కుప్ప కూలిన ఆ గార్డులిద్దరికీ వెంటనే స్పృహ తప్పింది.

గేట్లు తెరుచుకున్నాయి. మోటారు బైక్‌లు నిరాటంకంగా లోపలికి దూసుకు వచ్చాయి. ఆ బైక్‌ల శబ్దం విని ఆఫీసు రూములో ఉన్న వార్డెన్ సూర్యకుమారి కంగారుగా బయటకు వచ్చింది. పాండుని, అతని స్నేహితుల్ని చూసిన ఆమె కోపంగా గేటు వైపు చూసి నిర్ఘాంతపోయింది.

గేటు దగ్గర నేల మీద స్పృహ లేకుండా పడి ఉన్నారు గార్డులు.

ఆమె పాండును వురిమి చూస్తూ "ఎవర్రా మీరు? ఏమిటీ ఆగడం? " అంది గద్దిస్తూ.

"ఏం లేదు ఆంటీ! ఈ రోజు కాలేజిలో పద్మిని అనే నా మరదలు నామీద ముచ్చట పడి తన కాలి చెప్పుతో నా చెంపని ముద్దు పెట్టింది. మరి నేను కూడా ప్రేమగా ఏదో ఒకటి ఇవ్వకపోతే బావుండదు కదా! అందుకే కాస్త రేప్ చేసుకుని వెళదామని వచ్చాను" అన్నాడు అతి వినయంగా పాండు.

వార్డెన్‌కి వళ్ళు మండిపోయింది.

"ఎంత ధైర్యంరా మీకు? నా హాస్టలుకి వచ్చి నా ముందే నా సంరక్షణలో ఉన్న అమ్మాయిని రేప్ చేస్తామంటారా! ఇప్పుడే పోలీసుల్ని పిలిపించి మీ అంతు చూస్తాను" అంది క్రోధావేశంతో.

వాళ్ళంతా ఫక్కుమని నవ్వారు.

"ఒరేయ్ ఆంటీకి బి.పి. ఎక్కువనుకుంటా. కాస్తంత మర్యాద చేయండి" అన్నాడు పాండు.

ఒక కుర్చీని తెచ్చి ఆ ఆవరణలో వేసి ఆమెను బలవంతంగా అందులో కూర్చోబెట్టి తాళ్ళతో కట్టేశారు.

"ఆంటీ! నీ కళ్ళముందే ఈ పచ్చటి లాన్‌లో ఆ పద్మిని పచ్చటి బతుకుని బుగ్గి పాలు చేయబోతున్నాం. ఆ ప్రత్యక్ష ప్రసారాన్ని కళ్ళారా చూసి తరించు" అన్నాడు పాండు పరిహాసంగా.

ఆమె పెనుగులాడుతూ వాళ్ళనందర్నీ శాపనార్థాలు పెట్టసాగింది. ఆమె తిట్లని ఏమాత్రం ఖాతరు చెయ్యకుండా మెట్లెక్కి పైకి వెళ్లారు. ఒక్కో రూము తలుపు తెరిచి పద్మిని కోసం చూసుకుంటూ ముందుకు సాగారు.

అయిదో నంబరు రూములో అప్పుడే తల స్నానం చేసి వచ్చి అద్దం ముందు నిల బడి దువ్వెనతో తల చిక్కు తీసుకుంటున్న పద్మిని అద్దంలో కన్పించిన పాండు ప్రతి బింబం చూసి ఉలిక్కి పడింది.

పాండు క్రూరంగా నవ్వాడు.

"దాన్ని లాక్కు రండిరా" అన్నాడు. అతని స్నేహితులు ఆమెను చుట్టు ముట్టారు. ఆమె భయంతో కెవ్వున అరిచింది. నిర్దాక్షి ణ్యంగా ఆమె జుట్టు పట్టుకుని బయటకు లాక్కు వచ్చారు.

ఆమె చేతులు జోడించి దీనంగా "నేను మిమ్మల్ని కొట్టి తప్పు చేశాను. దయచేసి నన్ను మన్నించండి. మీ కాళ్ళు పట్టుకో మన్నా పట్టుకుంటాను" అంది.

పాండు పైశాచికంగా నవ్వాడు. ఆమె జుట్టు పట్టుకుని ఆమె తలను వెనక్కి వంచి ఆమె మొహంలోకి కర్కశంగా చూశాడు.

'అది... అది చెప్పుతో కొట్టక ముందుం డాలి. ఇప్పుడు ప్రాధేయపడి ఏంలాభం? ప్రతీకారం తీర్చుకోకపోతే ఈ పాండుకి నిద్ర పట్టదు" అన్నాడు కసిగా.

"వదలండి! వదలండి" అని ఆమె పెను గులాడ సాగింది.

"ఇంకా చూస్తారేం... లాన్‌లోకి లాక్కుప దండి" ఆదేశించాడు పాండు.

ఆమెను అతికిరాతకంగా, అతి హేయంగా లాక్కుపోసాగారు. ఆమె ఆక్రందనలతో ఆ హాస్టలు భవంతి దద్దరిల్లిపోసాగింది.

ఈ దారుణ పరిస్థితిని చూసిన అమ్మా యిలంతా విలవిలలాడిపోయారు. పులి ప్రవేశించిన లేళ్ళ గుంపులా భయాందోళన లతో వణికిపోయారు. ఆ సమయంలో ఏం చేయాలో దిక్కుతోచని పరిస్థితిలో అంతా మిథిల దగ్గరకు పరుగుతీశారు. జరుగు తున్న ఘోరం చూస్తూన్న మిథిల వంట్లోని రక్తం మరిగిపోతున్నా అశక్తురాలిలా నిలబ డిపోయింది.

"మిథిలా! ఎలాగైనా ఆ పద్మినిని రక్షిం చవే! పాపం అదసలే సెన్సిటివ్. తన కేదైనా జరగరానిది జరిగితే అది బతకదు" అంది దివ్య ఏడుస్తూ.

"మన కళ్ళముందే దాని జీవితం నాశనం కాబోతుంటే మనం ఏం చేతకాని వాళ్ళల్లా వుండిపోవాల్సిందేనా? దాన్ని కాపాడుకునే మార్గమే లేదా?" ఆక్రోశించి అంది సుప్రియ.

అందరిలో దుఃఖం పొంగిపొరలుతోంది. అప్పుడే ఒక తూనీగ వెంటబడుతూ రాజు అక్కడికి వచ్చాడు. ఎంత ప్రయత్నించినా రాజుకి ఆ తూనీగ దొరకడంలేదు.

అతను అంకిత దగ్గరకు వచ్చి ఆమెను తట్టాడు. "అంకితా! నాకు ఆ తూనీగను పట్టివ్వవా" అడిగాడు గోముగా.

ఆమెకు చిర్రెత్తుకొచ్చింది.

"ఒకపక్క మేం పెద్ద సమస్యతో బాధప డుతూ వుంటే మధ్యలో నీగోలేమిటి?" అని కసిరింది.

రాజు తలెత్తి అందరివంక చూశాడు.

"ఆ తూనీగను పట్టిస్తే మీ పద్మినిని రక్షిం చుకునే ఉపాయం నేను చెప్తాను" అన్నాడు.

ఆ మాటల్ని ఎవరూ అంతగా పట్టించుకో లేదు. "ఏంచేయాలో మాకే తోచక తలబద్ద లుకొటుకుంటున్నాం. అమాయకుడివి, అర్భ కుడివి నువ్వేం చెప్పగలవు" అంది సుప్రియ వ్యంగ్యంగా "ఏ పుట్టలో ఏ పాముందో అని మా బామ్మ అప్పుడప్పుడూ అంటూండేది. నేను చెప్పే ఈ చిన్న ఉపాయమే మీ పద్మి నిని పెద్దప్రమాదం నుండి రక్షించవచ్చు కదా!" అన్నాడు రాజు నమ్మకంగా.

అప్రయత్నంగా అమ్మాయిలు ఒకర్నొకరు చూసుకున్నారు.

"అయితే చెప్పు" అంది అంకిత నిర్లిప్తంగా

"మరి తూనీగను పట్టిస్తావా?"

"ముందు చెప్పు ఆ తర్వాత తూనీగ గురించి ఆలోచిద్దాం" అంది అంకిత విసుగ్గా.

"కాదు. పట్టిస్తానని మాటిస్తేనే చెప్తాను" అన్నాగు రాజు నిక్కచ్చిగా.

"సర్లే చెప్పు నాయనా! అలాగే పట్టిస్తాను" అంది అంకిత అసహనంగా.

"ఒట్టేయ్"

అతను చేతిని సాచాడు. అతని అరచేతిలో తన చేతినివేసి "ఒట్టు-" అంది అంకిత.

అతని కళ్ళు మెరిశాయి. అప్పుడు చెప్పడం మొదలుపెట్టాడు. వింటున్న అమ్మాయిలంతా అప్రతిభులయ్యారు. అతను చెప్పడం పూర్తిచేశాడు. ముందుగా తేరుకున్న మిథిల అంది ఎంతో ఉద్వేగంతో.

"ఎయిడ్స్ పేషెంటుగా ఎవరు యాక్ట్‌చేస్తారు? "

"నేను" అంది అంకిత ఉత్సాహంగా.

"ఆయితే పరుగెత్తు" అంది మిథిల.

అంకిత అక్కడ నుండి పరుగుతీసింది. మిగిలిన అమ్మాయిల్ని వెంటేసుకుని మిథిల ఆమెను పట్టుకోవడానికన్నట్లుగా ఆమె వెంట పరుగుతీసింది.

అదే సమయంలో పచ్చటి లాన్‌లో పద్మినిని నేలమీద పడేసి ఆమెను వివస్త్రను చెయ్యడానికి ప్రయత్నిస్తున్నారు పాండు అతని స్నేహితులు. అంకిత సంధించిన బాణంలా వాళ్ళమధ్యలోనుంచి దూసుకుపోయింది.

అంతలో మిథిల పాండు దగ్గరకు వచ్చి "ప్లీస్! కాస్త ఆ అమ్మాయిని పట్టుకోండి" అంది వేడికోలుగా.

"ఆ అమ్మాయిని ఎందుకు పట్టుకోవాలనుకుంటున్నారు? " పాండు అడిగాడు ఆరాగా.

ఆమె ఇబ్బందిగా చూసింది. దాంతో వాళ్ళల్లో ఆసక్తి పెరిగింది.

"చెప్పు" అన్నాడు పాండు రెట్టిస్తూ

"అది ... అది" నసిగింది

"ఎందుకు తట పటాయిస్తున్నావు? " పాండు సందేహంగా అడిగాడు.

"అది... అది మా హాస్టలు పరువుకి సబంధించిన విషయం. బయట వాళ్ళెవరికీ తెలియకూడదు" అంద.

దాంతో వాళ్ళందరిలో మరింత కుతూహలం పెరిగింది.

"మనమంతా ఒకే కాలేజీవాళ్ళం. మన మధ్య దాపరికాలెందుకు. ఫర్వాలేదు చెప్పు. మావాళ్ళని పంపించి అంకితని పట్టుకోమని చెప్తాను" అన్నాడు పాండు హామీ ఇస్తూ.

"కాని ఈ విషయం మీరు బయట ఎక్కడా చెప్పకూడదు". అంది మిథిల హెచ్చరిస్తూ.

"చెప్పం... ఎట్టి పరిస్థితుల్లో కూడా చెప్పం" అన్నాడు పాండు మాటిస్తూ.

ఆమె అటూ ఇటూ చూసి స్వరం తగ్గించి "ఆమధ్య ఒకసారి అంకితకి వంట్లో నలతగా వుంటే ఒక హాస్పటల్‌కి తీసుకువెళ్ళి డాక్టరుకి చూపించాం. ఆయన పరీక్షించి బ్లడ్‌టెస్టులు రాశాడు. ఆ రిపోర్టులు రెండు రోజుల తర్వాత వస్తాయని చెప్పి మమ్మల్ని పంపించేశాడు. ఈరోజు ఆ డాక్టరుగారు మా హాస్టలుకి ఫోన్‌చేసి రిపోర్టులు వచ్చాయని రోగం నిర్ధారణ అయిందని చెప్పాడు" అంటూ ఆగిందామె.

"ఏం జబ్బుది? " మామూలుగా అడిగాడు పాండు.

"ఎయిడ్స్"

పక్కన బాంబు పడ్డట్టుగా అదిరి పడ్డారు పాండు, అతని స్నేహితులు.

ఆమె కొనసాగించింది.

"అంకితని ఎక్కడికీ వెళ్ళనివ్వకుండా హాస్టల్లోనే వుంచమని ఆమెను హాస్పటల్‌కి తీసుకువెళ్ళడానికి అంబులెన్స్ పంపిస్తున్నానని ఆ డాక్టరుగారు చెప్పాడు. అయితే ఈ విషయం ఎలా తెల్సిందో అంకితకి తను ఆ హాస్పిటల్‌కి వెళితే అక్కడ తాను శాశ్వతంగా బందీ అవుతానని భావించి ఇక్కడ నుండి తప్పించుకోవడానికి ప్రయత్నిస్తోంది. దయచేసి మీరు ఎలాగైనా ఆమెను పట్టుకుని మాకు అప్పగించండి. లేకపోతే ఈమె ద్వారా చాలామంది అబ్బాయిలకి ఎయిడ్స్ వ్యాధి వచ్చే ప్రమాదం ఉంది" అంది

మిథిల అర్థింపుగా.

తన వెంట పడుతున్న అమ్మాయిలకి దొరక్కుండా తప్పించుకుంటూ అక్కడికి వచ్చిన అంకిత ఆ మాటలన్నీ విన్నట్లుగా మిథిల వంక తీవ్రంగా చూసింది.

"ఒసేయ్ మిథిలా! నాకు ఎయిడ్స్ అని వీళ్లందరికీ చెప్పి సంబరపడకు. ఈ హాస్టల్లో ఎంతమందికి ఎయిడ్స్ ఉందో నాకు బాగా తెల్సు. ఒక్కొక్క దాన్ని హాస్పిటల్‌కి తీసుకువెళ్లి బ్లడ్డు తీసి టెస్టులు చేస్తే అప్పుడు బయట పడుతుంది రంగు" అంది కసిగా అంకిత.

ఆ మాటలు విన్న పాండు తదితరులు నిర్ఘాంతపోయారు. అప్పుడు వాళ్ల చూపు తమ మధ్య నిస్సహాయంగా పడివున్న పద్మిని మీద పడింది.

"కొంపదీసి ఈ పద్మినికి కూడా ఎయిడ్స్ లేదు కదా? " ఆ ఆలోచన రాగానే అందరి గుండెలు గుభిల్లుమన్నాయి. ఆమె ఇప్పుడు అందమైన అమ్మాయిలా కాక చుట్టచుట్టుకుని పడుకుని ఉన్న కాలనాగులా అన్పించింది.

"ఏం చేయాలిప్పుడు? " సందిగ్ధావస్థలో పడ్డారు. మళ్లీ అటుగా వచ్చిన అంకితని అడిగాడు పాండు.

"ఈ హాస్టల్లో చాలామందికి ఎయిడ్స్ ఉందన్నావు కదా! మరి ఈ పద్మినికి ఎయిడ్స్ ఉందా? "

"నేను వాళ్లలా సంస్కారం లేని దాన్ని కాను. ఒకవేళ పద్మినికి ఎయిడ్స్ ఉన్నా లేదనే చెప్తాను" అంది అంకిత.

దాంతో మరింత అయోమయ పరిస్థితిలో పడిపోయారు వాళ్లంతా.

"అది కాదు. ఇప్పుడు మేము ఈ పద్మి

## నాకేం పర్లేదు



ఒక అమెరికావాడు, ఓ ఇంగ్లీష్‌వాడు, మరో సర్దార్జీ ముగ్గురూ ఒక మర్డర్ కేసులో ఇరుక్కున్నారు. విచారణ పూర్తిచేసి ముగ్గురికీ మరణ శిక్ష విధించింది కోర్టు. అయితే ఉరి, కరెంటు కుర్చీ, ఎయిడ్స్ ఇంజక్షన్ ఈ మూడింట్లో ఎవరికి ఏది ఇష్టమైతే దాన్ని ఎంచుకోవచ్చని తీర్పులో ఉటంకించింది.

వెంటనే అమెరికన్ ఉరినెంచుకుని ప్రాణాలు కోల్పోయాడు. ఇంగ్లీష్‌వాడు'ఉరేమిటి? ఛండాలంగా నాలుకు బయటకు వస్తుంది.. కరెంటు కుర్చీపై కూర్చుంటా'నని చెప్పి అలాగే ప్రాణాలు విడిచాడు. సర్దార్జీ మాత్రం తనకు ఎయిడ్స్ ఇంజక్షన్ చేయమన్నాడు. వెంటనే పెద్దడోస్ ఎయిడ్స్ వైరస్ తెచ్చి అతనికి ఇంజక్షన్‌చేశారు. చేయించుకున్న వెంటనే అతను సంతోషంతో గెంతులు వేస్తూ తెలివితేటలు మీకే సొంతమనుకున్నారా?..మాకూ ఉంటాయండీ' అంటూ నవ్వసాగాడు.

జైలు అధికారులు ఏంటయ్యా అసలు సంగతి అని అడగ్గానే.. 'నాకు మీరు ఎయిడ్స్ ఇంజక్షనైతే చేశారుగానీ.. నాకా రోగం చచ్చినా రాదు!' అన్నాడు.

ఎందుకని? అని వారడిగితే 'నేను కండోమ్ తొడుక్కుని ఉన్నానుగదా..' అన్నాడతను పళ్లికిలిస్తూ.

నిని రేప్ చెయ్యాలనుకుంటున్నాం కదా! ఒకవేళ ఈమెకి ఎయిడ్స్ ఉంటే మా కొంపలు మునుగుతాయి కాబట్టి దయచేసి ఈమెకి ఎయిడ్స్ ఉందో లేదో చెప్పి పుణ్యం కట్టుకో" వేడికోలుగా అన్నాడు పాండు.

"అక్కడే మీరు పొరపాటు పడుతున్నారు. అమెరికా వాడు ఇవ్వాళో రేపో ఎయిడ్స్‌కి మందు కనిపెట్టబోతున్నాడట. నిరభ్యంతరంగా రేప్ చేసుకోండి" అంది అంకిత భరోసాగా.

వాళ్లంతా గతుక్కుమన్నారు.

"నీకేం తల్లీ! నువ్వు ఆల్‌డీ పీకలదాకా ఊబిలోకి దిగబడి ఉన్నావ్. అందుకని ఎన్ని మాటలైనా మాట్లాడతావ్. అమెరికా వాడు మందు కనిపెట్టకపోతే ముందు మా సమాధులకి పునాదులు పడిపోతాయి" అక్కసుగా అన్నాడు పాండు.

అదే సమయంలో ఎవరికంట పడకుండా మిథిల వార్డెన్ ఆఫీసులోకి ప్రవేశించి పోలీస్‌స్టేషన్‌కి ఫోన్ చేసింది. అటువైపు ఉన్న నవీన ఫోనెత్తింది.

"హలో ఇన్‌స్పెక్టర్ స్పీకింగ్" అంది నవీన హుందాగా.

"మేడమ్! నేను మహారాణి ఉమెన్స్ హాస్టల్నుండి మాట్లాడుతున్నాను. మీరు వెంటనే ఈ హాస్టలు దగ్గరకు రావాలి. ఇక్కడ మినిస్టరు ఓంప్రకాష్ తమ్ముడు పాండు తన స్నేహితులతో కల్సి వచ్చి ఈ హాస్టలు ఆవరణలోనే పద్మిని అనే అమ్మాయిని రేప్ చెయ్యడానికి ప్రయత్నిస్తున్నాడు. మీరు వెంటనే బయల్దేరి వస్తే అతన్ని అతని మిత్రబృందాన్ని పట్టుకోవచ్చు. మీరు ఏమాత్రం ఆలస్యం చేసినా ఇక్కడ ఒక అమాయకురాలి జీవితం నాశనమవుతుంది. ప్లీజ్ దయచేసి మీరు వెంటనే రండి" అంది అర్థింపుగా. మిథిల చెప్పింది వినగానే నవీన నిటారుగా అయింది. ఆమె వంట్లో రక్తప్రసరణ పెరిగింది. ఎన్నో రోజులుగా, ఎదురుచూస్తున్న అవకాశం ఈ రూపంగా వస్తుందని ఆమె ఊహించలేదు. ఇప్పుడు బలమైన సాక్ష్యాధారాలతో ఆ పాండుని అరెస్టు చేస్తే ఆతర్వాత ఇంటరాగేషన్లో అతని నోటినుండి అతను గతంలో చేసిన నేరాలన్నింటిని కూడా బయటకు కక్కించవచ్చు ఆవిధంగా తన బావ నిర్దోషి అని నిరూపించవచ్చు అనుకుంది నవీన.

"మేడమ్... మేడమ్ మాట్లాడరేం?" కంగారుగా అంది మిథిల.

ఆలోచనల్నుండి బయటపడిన నవీన "మీరేం కంగారుపడకండి. నేను ఇప్పుడే బయల్దేరి వస్తున్నాను. ఒక్క పదినిమిషాల్లో అక్కడ ఉంటాను" అంది హామీ ఇస్తూ.

"థాంక్యూ మేడమ్! మీరు ఎంత తొందరగా వస్తే అంత త్వరగా మా ఫ్రెండు ప్రమాదం నుండి బయటపడుతుంది" అన్చెప్పి ఫోన్ పెట్టేసింది మిథిల. ఆతర్వాత పాండు వాళ్ల కంటబడకుండా బయటకు వచ్చి అమ్మాయిల్లో కల్సిపోయింది.

నవీన ఒక్కక్షణం కూడా ఆలస్యం చేయలేదు. వెంటనే అన్ని ప్రైవేటు టి.వి. ఛానల్స్ వారికి, పత్రికా విలేఖర్లకి ఫోన్ చేసి విషయం చెప్పింది. పాండు మినిస్టరు ఓంప్రకాష్ తమ్ముడు కావడంతో ఆ వార్త సంచలనం సృష్టిస్తుంది కాబట్టి వాళ్లు ఎంతో ఉత్సాహంతో మహారాణి హాస్టలుకి బయల్దేరారు. ఒక వ్యాను నిండా పోలీసుల్ని వెంటబెట్టుకుని నవీన పోలీస్ జీపులో హాస్టలుకి బయల్దేరింది.

"భగవంతుడా! ఆ పాండు అతని స్నేహితులు హాస్టలు దాటి పోకుండా ఉండేలా అనుగ్రహించు" అని ఆర్తిగా మనసులో ప్రార్థించుకుంది నవీన.

ఎయిడ్స్ భూతం భయపెట్టడం వలన పద్మినిని రేప్ చేయాలో వద్దో తేల్చుకోలేని అనిశ్చిత స్థితిలో పడిపోయారు పాండు అతని స్నేహితులు.



నమ్మనిది నమ్ముతున్నానని బుకాయించడమే ద్రోహానికి తొలిమెట్టు. - థామస్ పెయిన్

సరిగ్గా అప్పుడే పోలీసు వ్యాను, జీపు హాస్పటలు గేటులోంచి లోపలికి దూసుకు వచ్చాయి. వాటి వెనుకే అన్ని ప్రైవేట్ టి.వి. ఛానల్స్ రిపోర్టర్లు, ప్రముఖ దినపత్రికల విలేఖర్లు తమ తమ వాహనాల మీద వచ్చారు.

పోలీసుల్ని చూడగానే పాండు అతని స్నేహితులు అదిరిపడ్డారు.

"పోలీసులొచ్చారు. పారిపోదాం పదండి" పాండు తన స్నేహితుల్ని హెచ్చరించి అక్కడనుండి తప్పించుకోబోయాడు. అతనికన్నా మెరుపువేగంతో జీపు దిగిన నవీన అతనికి రివాల్వరు గురిపెట్టింది.

"మిస్టర్ పాండూ! కదలకు! కదిలితే ఛస్తావ్" హెచ్చరించింది కరుగ్గా.

ఆమె చేతిలో నల్లగా నిగనిగ మెరుస్తున్న రివాల్వరు చూడగానే అతను ఆగిపోయాడు. అంతలో పోలీసులు పాండు స్నేహితుల్ని చుట్టుముట్టారు.

"ఇన్స్‌పెక్టర్! నా గురించి నీకు పూర్తిగా తెలీదు. తెలిస్తే అసలు నువ్వు నా జోలికి వచ్చేదానివి కాదు" అన్నాడు పాండు.

"ఏంట్రా నీ గురించి నాకు తెలిసేది. అన్న మినిష్టరు కదా అని నీ ఇష్టమొచ్చినట్లుగా అత్యాచారాలకు, అఘాయిత్యాలకు పాల్పడుతున్నావ్. కాని ఏదో ఒక రోజు నీ పాపం బద్దలవుతుందని నీకు తెలీదు" అంది నవీన ఆవేశంగా.

అతను ఒక్క క్షణం దిమ్మెరపోయాడు. అంతలోనే తేరుకున్నాడు.

"గతంలో నీలాగానే చాలామంది ఇన్స్పెక్టర్లు ఇలానే రెచ్చిపోయి పాపం ఇప్పుడు సర్వం కోల్పోయి జీవచ్ఛవాల్లా బతుకుతున్నారు. ఆ దుస్థితి నీకు పట్టకుండా చూసుకో" అన్నాడు హెచ్చరిస్తూ.

ఆమె వంట్లోని రక్తం సలసల మరిగిపోయింది. పక్కనే వున్న కానిస్టేబుల్స్ చూసి చెప్పింది తీవ్రంగా.

"వీడి చేతులకి బేడీలు తగిలించి ఈడ్చుకుంటూ తీసుకుపోయి వ్యాను ఎక్కించండి"

కానిస్టేబుల్స్ పాండుని చుట్టుముట్టారు. అతను ఎంతగా పెనగులాడుతూ వున్నా పట్టించుకోకుండా అతని చేతులకి బేడీలు తగిలించి బలవంతంగా అక్కడ నుంచి వ్యాను దగ్గరికి గుంజుకుపోసాగారు.

పాండు అవమానంతో రగిలిపోయాడు.

"ఇన్స్‌పెక్టర్! ఇంతకు ఇంత అనుభవిస్తావ్" అని కసిగ అరిచాడు.

"పోరా!" అంది నిర్లక్ష్యంగా నవీన.

అప్పటికే పాండు స్నేహితుల్నందర్నీ వ్యాను ఎక్కించారు పోలీసులు. వాళ్ళ పక్కనే పాండుని కూడా కూర్చోబెట్టారు.

మిథిల వెళ్ళి వార్డెన్‌ని బంధ విముక్తురాల్ని చేసింది. గేటు దగ్గర స్పృహ లేకుండా పడి వున్న గార్డులకి స్పృహ వచ్చి లేచి అక్కడికి వచ్చారు.

అక్కడ జరుగుతున్నదంతా ప్రైవేట్ టి.వి. ఛానల్స్ వాళ్ళు షూట్ చేస్తున్నారు. పత్రికా ఫోటోగ్రాఫర్లు ఫోటోలు తీస్తున్నారు.

అందర్నీ అరెస్టు చెయ్యడం అయ్యాక నవీన మిథిల వాళ్ళ దగ్గరికి వచ్చింది.

"నాకు ఫోన్ చేసిందెవరు? " ఆసక్తిగా అడిగింది నవీన.

"నేనే" అంది మిథిల

"మీ పేరు? "

"మిథిల"

"ఏమయినా ఈ రోజు మీరు చాలా గొప్పపని చేశారు. పరమకిరాతకుడు, నీచుడు అయిన పాండుని బలమైన సాక్ష్యాధారాలతో పట్టించారు. అందువలన ఈ సభ్యసమాజానికి ఎంతో మేలు జరగడమే కాకుండా ఎంతోమంది అభాగ్యులకి విముక్తి లభిస్తుంది." అంది నవీన అభినందనగా.

"ఇదంతా మా గొప్పతనం కాదు మేడమ్! వాస్తవంగా అయితే వాళ్ళకున్న అవకాశానికి

> కార్య హాని కలిగించే శత్రువులలో ఆలస్యానిదే అగ్రస్థానం
> — ప్లేటో

ఈ పాటికే పద్మిని జీవితాన్ని వాళ్ళు నాశనం చేయాలి. కాని వాళ్ళని సందిగ్ధావస్థలో పడేసి మేము మీకు ఫోన్ చేసి పద్మినిని కాపాడుకునే వీలుని కల్పించిన వ్యక్తి మరొకరున్నారు" అంది మిథిల.

"ఎవరా వ్యక్తి? అతను మీకు ఎలాంటి సాయంచేశాడు? " అక్కడే వున్న పత్రికా విలేఖర్లు, టి.వి రిపోర్టర్లు కుతూహలంగా అడిగారు.

మిథిల కొద్దిగ ఇబ్బందిగా చూసింది.

"అతనెవరో చెప్పను. కాని అతను మాకు చేసిన సాయం మాత్రం చెప్తాను" అంది మిథిల.

"చెప్పండి" అన్నారు వాళ్ళంతా.

మిథల రాజు చెప్పిన ఉపాయాన్ని దాన్ని తాము ఎలా అమలు పరిచిందీ వివరంగా చెప్పింది.

అంతా దిగ్భ్రాంతులయ్యారు. వ్యానులో కూర్చుని వున్న పాండు అతని స్నేహితులు నిర్ఘాంతపోయారు.

అంటే ఎయిడ్స్ అనే భూతాన్ని తమకి చూపించి పద్మినిని రేప్ చెయ్యాలో వద్దో తేల్చుకోలేని అయోమయ పరిస్థితిలో తమని పడేసి వాళ్ళు తాపీగా పోలీసులకు ఫోన్ చేసి వాళ్ళని రప్పించి తమని పకడ్బందీగా పట్టించారన్న నిజం అర్థంకాగానే పాండు మొహం తెల్లగా పాలిపోయింది.

"ఎంత మోసం! ఎంత దగా" అనుకున్నాడు. తను బయటపడ్డాక ఈ ఇన్‌స్పెక్టరుతోపాటు ఈ హాస్టలు అమ్మాయిలందరి అంతు చూడాలనుకున్నాడు పాండు కసిగా.

"అంత అద్భుతమయిన ఉపాయం చెప్పిన ఆ వ్యక్తి ఎవరో చెప్పవచ్చు కదా!" పత్రికా విలేఖర్లు ఆసక్తిగా అడిగారు.

మిథిల నవ్వి "సారీ! అతనికి తన ఉనికి బయటి ప్రపంచానికి తెలియడం ఏమాత్రం ఇష్టంలేదు. దయచేసి ఆ ఒక్క విషయం అడగకండి" అంది వేడుకోలుగా.

దాంతో వాళ్ళిక అతని గురించి చెప్పమని రెట్టించలేదు. విలేఖర్లు, రిపోర్టర్లు అంతా మరికొన్ని ప్రశ్నలు అడిగి అక్కడ నుండి వెళ్ళిపోయారు.

నవీన వార్డెన్‌తో చెప్పింది.

"చూడండి. ఈ పాండుని పట్టించడం గొప్పకాదు. రేపు మీరు కోర్టుకి వచ్చి అతను తన స్నేహితులతో వచ్చి పద్మిని మీద చేయబోయిన అత్యాచారం గురించి ధైర్యంగా చెప్పాలి. అప్పుడే మీ శ్రమ ఫలిస్తుంది. ఆ దుర్మార్గులందరికీ శిక్షపడుతుంది"

"ఆ విషయంలో మీరు ఎలాంటి సందేహాలు పెట్టుకోనవసరంలేదు. మా హాస్టల్లోని అమ్మాయి జీవితాన్ని పాడుచేయాలని చూసిన ఈ కిరాతకులందరికీ తప్పకుండా శిక్షపడాలి. అందుకు మేం ఏం చెయ్యడానికైనా సిద్ధమే" అంది వార్డెన్ దృఢనిశ్చయంతో.

"ఇలా నేను ఎందుకు చెప్తున్నానంటే ఈ పాండు అన్న ఓం ప్రకాష్ జిత్తులమారి నక్క. పైగా అధికారం కూడా అతని చేతిలో వుంది. మీరు కోర్టుకి వచ్చి సాక్ష్యం చెప్పకుండా ఎన్నో అవరోధాలు సృష్టిస్తాడు. వాటినన్నింటిని మీరు అధిగమించాల్సి వుంటుంది" అంది నవీన హెచ్చరిస్తూ.

"ఆయన ఏం చేసినా ఎలాంటి పథకాలు వేసినా మేము కోర్టుకి రావడం ఖాయం. ఈ దుర్మార్గులందరికి శిక్షపడేలా చేయడం ఖాయం" అంది మిథిల నమ్మకంగా.

నవీన సంతృప్తి పడింది. ఆమె మనసులోని భయాలు, సందేహాలు తొలగిపోయాయి.

"మీకు చక్కటి ఉపాయం చెప్పి పాండు పట్టుబడటానికి, ఒక అమాయకురాలి జీవితం నాశనం కాకుండా ఉండటానికి కారణమైన అజ్ఞాతవ్యక్తికి నా కృతజ్ఞతలు అని చెప్పండి" అంది నవీన మనస్ఫూర్తిగా.

అంతా అలాగేనన్నట్లుగా తలూపారు.

నవీన వెళ్ళి జీపులో కూర్చుంది. జీపు, దాని వెనుక వ్యాను ఆ హాస్టలు గేటు

లోంచి బయటకు దూసుకుపోయాయి.

★ ★ ★

"ఈ ఆలోచన నీకు ఎలా వచ్చింది?" మిథిల రాజు వంక అనుమానంగా చూస్తూ అడిగింది.

"తూనిగను పట్టిస్తానన్నారు కదా! ముందు అది పట్టివ్వండి నాకు" అన్నాడు రాజు బుంగమూతిపెట్టి.

"అలాగే పట్టిస్తాం కాని అసలు ఆ ఆలోచన నీకు ఎలా వచ్చిందో చెప్పు?" రెట్టిస్తూ అంది మిథిల.

"అది కూడా తెలీదా! మీరొట్టి తెలివి తక్కువ దద్దమ్మలు. మీకంటే మా ఊరిలో సవరాలు, చెంపిన్నీసులు అమ్ముకునే వాళ్ళే బెటరు" అన్నాడు అదోలా నవ్వుతూ.



మిథిలకు వళ్ళు మండింది.

"ఆ వెధవ పోలికలు మాని అసలు విషయం చెప్పు" అని కసిరింది మిథిల.

అతను మొహం చిన్నబుచ్చుకున్నాడు.

"అలా అడిగితే నేను చెప్పను పో!" అన్నాడు కినుక వహిస్తూ.

"నీకు ఎప్పుడూ కోపమే. నోట్లో అరటి పండు పెట్టి కొరకమన్నా కొరకడం తెలీని అమాయకుడు రాజు. అలాంటి రాజును కొట్టినట్టు అడిగితే ఏం సమాధానం చెప్తాడు" అని మిథిలను మందలించిన అంకిత రాజు దగ్గరకు వెళ్ళి "రాజూ! కన్నా! నువ్వు చాలా మంచివాడివి కదూ! మరి నేను అడిగిన దానికి జవాబు చెప్పాలి" అంది లాలనగా.

"అలాగే" అన్నాడు వికసించిన మొహంతో.

"అయితే నీకు ఆ ఎయిడ్స్ ఆలోచన ఎలా వచ్చింది?" అడిగింది మృదువుగా.

"అదా!" అంటూ అక్కడ అలమారాలో ఉన్న ఓ పత్రికను బయటకు లాగి పాద రసం కథను అంకితకి చూపించాడు.

"నిన్ననే ఏమీ తోచక ఈ కథ చదివాను. అదే మీకు చెప్పాను." అన్నాడు.

ఆ కథను చదవిన అంకిత ఆశ్చర్యంగా చూస్తూ "అవును మిథిలా! ఇప్పుడు మనం ఆడిన ఎయిడ్స్ నాటకం ఈ కథ ఒకటే" అంది.

మిథిల తేలికగా నిట్టూర్చింది.

"నువ్వు అనవసరంగా రాజుని అనుమానించావ్" నిష్ఠూరంగా అంది అంకిత. మిథిల నొచ్చుకుంటూ అవునన్నట్లుగా తలూపింది. కాని వాళ్ళల్లో ఎవరైనా ఆ కథా రచయిత పేరు పరిశీలించినట్లయితే అప్పుడు అసలు విషయం బయటపడేది.

ఆ కథారచయిత పేరు రాజు

★ ★ ★

"ఎవరు? ... ఎవరు నా తమ్ముణ్ణి అరెస్టు చేసింది?" ధుమధుమలాడుతూ లోపలికి వచ్చిన ఓం ప్రకాష్ గద్దిస్తూ అడిగాడు. ఆయన వెనక ఆయన అనుచరులు ఆయన్ని ఎప్పుడూ అంటిపెట్టుకుని వుండే అయిదుగురు ఎమ్మెల్యేలు ఉన్నారు.

నవీన తన సీట్లోంచి మర్యాదగా లేచి నిల్చుని "నేనే" అంది వినమ్రంగా.

ఆమె వంక ఉరిమి చూశాడు ఓం ప్రకాష్.

"ఈ మినిష్టర్ ఓం ప్రకాష్ తమ్ముణ్ణి అరెస్టు చెయ్యడానికి నీకు ఎంత ధైర్యం. మర్యాదగా వాడికి క్షమార్పణ చెప్పి వాడిని వదిలిపెట్టు" అన్నాడు ఆదేశిస్తూ.

"సార్! అతను చేయబోయిన నేరం

సామాన్యమైనది కాదు. అంచేత అతన్ని వదిలి పెట్టే ప్రసక్తే లేదు" అంది నిక్కచ్చిగా.

ఆయన భగ్గుమన్నాడు.

"నేనెవరో తెలిసే మాట్లాడుతున్నావా? " హుంకరించాడు.

మీరు, బాధ్యత గల మినిష్టరు అని నాకు తెల్సు. అలాంటి మీరు లేడీస్ హాస్టల్లో ఒక అమ్మాయి మీద తన స్నేహితులతో కలిసి అత్యాచారం చెయ్యడానికి ప్రయత్నించిన మీ తమ్ముడిని ఎలా వదిలిపెట్టమంటున్నారు. అది మీ స్థాయికి తగదు. ఈ కేసు గురించి మర్చిపోండి" అంది సున్నితంగా మందలిస్తూ.

దాంతో ఆయన మరింత రెచ్చిపోయాడు.

"చూడూ! నువ్వు ఆఫ్టరాల్ పొట్టేలు లాంటి దానివి. అదే మేము పర్వతం లాంటి వాళ్ళం. వచ్చి వచ్చి మమ్మల్నే ఢీ కొనాలని చూడకు. తల పగిలి పోతుంది. వెళ్ళు... వెళ్ళి నా తమ్ముడిని బయటకుతీసుకురా" అన్నాడు కోపంగా.

నవీన మొహం కఠినంగా మారింది.

"ఇక్కడ నేను ఇన్స్పెక్టరుగా వుండగా అది జరగదు. అంతే కాదు. అక్కడ మీ తమ్ముడు మాట్లాడిన మాటలు, చేసిన చేష్టలు రేపు అన్ని పేపర్లలో మొదటి పేజీల్లో రాబోతున్నాయి. నేను ఇప్పుడు పత్రికల వారిని ఇక్కడకు పిలిపించి మీ గొప్పతనం గురించి వివరిస్తే మహాపర్వతం లాంటి మీరు రేపు పేపరులో వచ్చే డైనమేట్స్ లాంటి వార్తలకు తునాతునకలవుతారనుకుంటా!" అంది వ్యంగ్యంగా.

ఆయన ఉలిక్కిపడ్డాడు. ఇప్పుడు ఇక్కడికి పత్రికా విలేఖర్లు వస్తే తన పరువు బజారు పాలవుతుందని ఆయనకి తెలుసు.

పక్కనే ఉన్న ఒక ఎమ్మెల్యే కల్పించుకుని "చూడమ్మా! నువ్వు వయసులో చాలా చిన్నదానివి. అనుభవం లేనిదానివి. పెద్దవాడిని చెప్తున్నాను. నా మాట విను. ముందు పాండుని వదిలేయ్. ఆ తర్వాత మినిష్టరుగారు అనుగ్రహిస్తారు. నీ స్థాయి పెరుగుతుంది. ప్రమోషను, డబ్బు రెండూ లభిస్తాయి" అన్నాడు ఆశ చూపిస్తూ.

ఆమె అతని వైపు జాలిగా చూస్తూ నవ్వింది. "నాకు అలాంటి వాటి మీద వ్యామోహం లేదు. కష్టపడటం వల్ల నిజాయితీగా వచ్చే ప్రమోషన్ అయితేనే నాకు తృప్తిగా ఉంటుంది. అలాగే నీతిగా సంపాదించిన డబ్బుని ఖర్చుపెట్టడంలోనే అనిర్వచనీయమైన ఆనందం ఉంటుంది. ఆయాచితంగా వచ్చే దేన్నైనా ఆశించేటంత నికృష్టురాలిని మాత్రం కాదు" అంది నిష్కర్షగా.

ఆ ఎమ్మెల్యే మొహం పాలిపోయింది.

ఒక అనుచరుడు రెచ్చిపోతూ "దీంతో ఏంటన్నా మాటలు. మీరు ఊఁ అనండి చాలు. ఇక్కడికిక్కడే దీని ప్రాణాలు తీసిపారేస్తాను" అన్నాడు.

ఆమె మెరుపు వేగంతో రివాల్వరు తీసి ఆ అనుచరుడి గుండెలకు గురి పెట్టింది.

స్టేషన్‌లోకి వచ్చి డ్యూటీలో ఉన్న ఇన్స్పెక్టర్ని మర్డరు చేస్తాననడం మహానేరం. ఉగ్రవాదుల జాబితాలో నిన్ను చేర్చి పిట్టను కాల్చినట్టు కాల్చి పారేస్తే అడిగే నాథుడే లేడు. గుర్తుంచుకో" అంది తీవ్రంగా.

ఆ అనుచరుడు హడలి పోయాడు.

ఆమె కానిస్టేబుల్స్‌తో చెప్పింది. "వీడిని సెల్ లో వేయండి".

అతన్ని కానిస్టేబుల్స్ లాక్కుపోతూంటే ఓం ప్రకాష్ ఆగ్రహంతో వూగిపోతూ "మా వాడిని నా కళ్ళముందే అరెస్టు చేస్తావా" అన్నాడు.

"నీ తమ్ముడినే అరెస్టు చేశాను. వీడెంత? " అంది తేలికగా.

"నీకు రోజులు దగ్గరపడ్డాయి. అందుకే ఇలా పేట్రేగిపోతున్నావ్" అన్నాడు ఓం ప్రకాష్ గర్జిస్తూ.

"నీకు చేతనయినది చేసుకో" అంది నిర్లక్ష్యంగా. ఆయన బుసలు కొడుతున్న కాల

నాగులా పంజా విసరబోయే క్రూరమృగంలా ఆమె వైపు చూశాడు.

"నా తమ్ముడిని ఎలా రక్షించుకోవాలో నాకు బాగా తెలుసు. ఇక్కడ కాకపోతే వాడిని కోర్టులో కాపాడుకుంటాను. అక్కడ నువ్వు నా కాలిగోరుని కూడా పీకలేవు" అన్నాడు.

"కలలు కనకు ఓం ప్రకాష్! న్యాయదేవత ఈ సారి తప్పకుండా తన కళ్ళకు ఉన్న గంతల్ని తీసి చూస్తుంది. ఆ చూపుల తీవ్రతకే మీరు మట్టికొట్టుకుపోతారు" అంది నమ్మకంగా.

"అదీ చూద్దాం" అని ఆయన సెల్ దగ్గరికి వెళ్ళాడు. సెల్‌లో ఉన్న తమ్ముడి వంక ఆప్యాయంగా చూశాడు.

"నువ్వేం కంగారు పడకు పాండూ! కోర్టులో నిన్ను తేలికగా విడిపించుకుంటాను" అన్నాడు ధైర్యం చెప్తూ.

"నువ్వు నన్ను ఎలాగైనా విడిపిస్తావు. ఆ సంగతి నాకు బాగా తెల్సు. అది కాదు నాకు కావాల్సింది. ఈ ఇన్‌స్పెక్టర్ని నాకసి తీరా చిత్రహింసలు పెట్టి చంపుతుంటే అది బాధతో గిలగిలా తన్నుకుంటూ వుంటే నా కళ్ళారా చూడాలని వుందన్నయ్యా! నీకు సాధ్యమైతే అది జరిగేలా చూడు" అన్నాడు క్రూరంగా.

కటకటాలు పట్టుకుని వున్న తమ్ముడి చేతి మీద చిన్నగా తట్టాడు ఓం ప్రకాష్.

"తప్పక జరుగుతుంది. ఆ విషయంలో నువ్వు నిశ్చింతగా వుండవచ్చు" అన్నాడు అనునయంగా.

సంతృప్తిగా చూశాడు పాండు.

"మరి నేను వస్తాను" అన్నాడు. ఓం ప్రకాష్ పాండు అలాగేనన్నట్లుగా తలూపాడు. ఒక్క క్షణం ఆగి నవీన వంక నిప్పులు చిమ్మేలా చూసిన ఆయన బయటకు కదిలాడు. ఆయన్ని అనుసరించారు ఆయన అనుచరులు, ఎమ్మెల్యేలు.

★ ★ ★

మర్నాడు అన్ని పేపర్లలో ప్రముఖంగా వచ్చిన ఒక వార్త యావత్ ప్రజానీకాన్ని ఆశ్చర్యంలో ముంచెత్తింది.

"హాస్టలు అమ్మాయిపై మినిష్టరు తమ్ముడు పాండు అత్యాచార ప్రయత్నం. అజ్ఞాత వ్యక్తి సాయంతో అతన్ని పోలీసులకు పట్టించిన హాస్టలు అమ్మాయిలు"

★ ★ ★

పాండుని అతని స్నేహితుల్ని ఇంటరాగేషన్ చేయడం ప్రారంభించింది నవీన. కానిస్టేబుల్స్ లాఠీలతో విజృంభించారు. చేతి వేళ్ళ గోళ్ళల్లో సూదులు దింపారు. ఆ గాయాల మీద కారం చల్లారు. వాళ్ళ ఆక్రందనలతో సెల్ దద్దరిల్లిపోయింది.

పాండుని తలకిందులుగా వేలాడదీసి బాదడం మొదలుపెట్టారు. కొద్ది సేపట్లోనే అతను ఆ దెబ్బలకు తట్టుకోలేక నోరు విప్పాడు. నవీన టేప్ ఆన్ చేసింది.

ఆనాడు మధుని తను ఎలా మర్డరు కేసులో ఇరికించిందీ అందుకు ఆరుగురు కానిస్టేబుల్స్ ఎలా సహకరించిందీ వివరంగా చెప్పాడు పాండు. "అయితే ఆ కిరాయి గుండాని సెల్‌లో చంపింది నువ్వా! నీ స్నేహితులన్నమాట" అడిగింది నవీన.

"అవును" నిస్త్రాణగా అన్నాడు.

"నీకు సహకరించిన కానిస్టేబుల్స్‌కి ఎంతెంత ఇచ్చావు? "

"ఒక్కొక్కరికి లక్ష రూపాయిలు".

అప్పుడుగాని ఆమె వాళ్ళని ఇంటరాగేషన్ చెయ్యడం ఆపలేదు. అదే రోజు వేర్వేరు పోలీస్ స్టేషన్లలో పనిచేస్తున్న ఆరుగురు కానిస్టేబుల్స్‌ని ఆమె స్టేషన్‌కి పిలిపించింది. సెల్‌లో ఉన్న పాండుని అతని స్నేహితుల్ని చూడగానే వాళ్ళు దిగ్భ్రాంతులయ్యారు. నవీన వాళ్ళని తన పర్సనల్ ఛాంబరులోకి తీసుకువెళ్లి పాండు వెళ్లగక్కిన నిజాల్ని టేప్ ఆన్ చేసి విన్పించింది. అందరి మొహాలు పాలిపోయాయి.

గుండెలు జారిపోయాయి. భీతిగా ఆమె వంక చూశారు. "చెప్పండి! మీరు పాండుకి సహకరించారా లేదా? " అడిగింది గర్జిస్తూ.

"మాకు! మాకేం తెలీదు" భయంతో కంపించిపోతూ అన్నాడు ఒక కానిస్టేబుల్

"అవును. మీకేం తెలీదు. ఆ కిరాయి గుండాని, పాండుతో కల్సి మీరే హత్య చేశారు. అవునా? " నిలదీసింది.

వాళ్ళు కంగారుపడ్డారు.

"లేదు! లేదు! మేము అతన్ని హత్య చెయ్యలేదు. కేవలం సెల్ తాళం తీసి పాండు వాళ్ళు సెల్‌లోకి వెళ్ళడానికి అవకాశం కల్పించాం. అంతే!" అన్నారు.

ఆమె కళ్ళు మెరిశాయి.

"అప్పుడు పాండు ఏం చేశాడు? "

"అతన్ని కొట్టి చంపేశాడు. అందుకు అతని స్నేహితులు కూడా సాయం చేశారు".

ఆమె తృప్తిగా తలపంకించింది.

"పాండుకి సహకరించినందుకు మీకు ఎంత ముట్టింది? "

"మనిషికి లక్ష రూపాయిలు. ప్రమోషన్" అన్నారు తల దించుకుని.

"ఈ విషయాలన్నీ మీరు రేపు కోర్టుకి వచ్చి చెప్పాలి. లేకపోతే ఆ కిరాయి గుండాని ఆ పాండుతో కల్సి మీరే కొట్టి చంపారని నేను కోర్టులో నిరూపిస్తాను. దాంతో ఆ పాండుతోపాటు మీక్కూడా ఉరిశిక్ష పడుతుంది" హెచ్చరించింది నవీన.

వాళ్ళు హడలిపోయారు.

"అలా చేయకండి. మేము జరిగింది జరిగినట్లుగా కోర్టులో చెప్తాం" అన్నారు నమ్మకంగా.

ఆమె మనసు తేలిక పడింది.

"చూడండి! ఈ విషయం గనుక ఓంప్రకాష్‌కి మీరు తెలియజేస్తే అసలు సాక్ష్యం అనేది ఇక ముమ్ముందు మిగలకుండా ఉండటం కోసం తన తమ్ముడి భవిష్యత్తుని దృష్టిలో పెట్టుకుని మిమ్మల్నందర్నీ ఈ భూమ్మీద లేకుండా చేసినా చేస్తాడు. ఆయన్ని కలిసే ఆలోచన మీకుంటే విరమించుకోండి" హితవు చెప్తూ అందామె.

వాళ్ళు అర్థమైనట్లుగా బుద్ధిగా తలలూపారు.

"ఇక మీరు వెళ్ళవచ్చు" అందామె.

అప్పటిదాకా వాళ్ళు చెప్పినదంతా టేప్ చేసిన ఆమె రికార్డరులోంచి క్యాసెట్ బయటకు తీసి భద్రపరిచింది.

★ ★ ★

ఆ రోజు ఉదయం అమ్మాయిలంతా కోర్టుకి వెళ్ళే హడావిడిలో ఉన్నారు. అద్దం ముందు నిలబడి తల దువ్వుకుంటున్న మిథిల దగ్గరికి రాజు వెళ్లి ఆమె భుజం మీద చిన్నగా తట్టాడు.

"ఏమిటీ? " అందామె విసుగ్గా.

"ఒక్కసారి బాల్కనీలోకి రా" అన్నాడు మారాం చేస్తున్నట్లుగా.

"మేము కోర్టుకి వెళ్ళాలి. ఇప్పుడు కుదరదు. వెళ్ళు" అంది కసిరినట్లుగా.

అతను మొహం చిన్నబుచ్చుకున్నాడు.

"నేను ఎప్పుడు పిలిచినా నువ్వు ఇలానే అంటావు. మా బామ్మలా చూసుకుంటానని చెప్పి ఇక్కడకు తీసుకొచ్చి ఒక్కసారి కూడా నన్ను నువ్వు ప్రేమగా చూసుకోలేదు" అన్నాడు రాజు ఉక్రోషంగా.

"పోనీలేవే! ఒక్కసారి రాజు మాట వినరాదూ!" అంది అంకిత జాలిగా.

మిథిల రాజు వంక చిరాగ్గా చూసి "పద నాయనా! నన్ను చంపుకు తింటున్నావు కదా" అంది.

ఆమె రాజు వెనుక బాల్కనీలోకి వెళ్లింది.

"ఏమిటి చెప్పు" అంది అసహనంగా

రాజు హాస్టలుకి అవతల రోడ్డు పక్కగా ఆగి వెన్న వ్యానుని చూపించి "అది నాకు కొనిపెట్టవా" అని అడిగాడు.



చేతినిండా పనిలేనప్పుడు, పని తెమలక సతమతమవుతున్న వారిపై దాడిచేయటం సర్వసాధారణం. -అట్కిన్సన్

ఆమె గుర్రుగా చూసింది. ఆ తర్వాత "నీకు నేను ఆ వ్యాను కొని పెట్టాలా? అదేం తక్కువధర ఉంటుందనుకుంటు న్నావా? ఇంకానయం విమానం కొనిపెట్ట మని అడుగలేదు...." అంటూ ఇంకేదో అనబోయి ఉలిక్కిపడి ఆగిపోయింది.

ఆ వ్యాను అద్దాలు పక్కకు జరిపి ఆ వ్యానులోనుంచి ఓంప్రకాష్ మనుషులు హాస్టలు వైపే చూస్తున్నారు. ఆమె గొంతు తడారిపోయింది. వెన్ను జలదరించింది

ఆమె మరోసారి వాళ్ల వైపు పరిశీలనగా చూసింది. సందేహం లేదు. వాళ్లు తప్ప కుండా ఓం ప్రకాష్ అనుచరులై ఉంటారు అనుకుంది.

ఆమె గుండె వేగంగా కొట్టుకుంది.

"చెప్పు! నాకు ఆ వ్యాను కొనిపెడతావా?" రెట్టిస్తూ అడిగాడు రాజు.

ఆమె అతని మొహంలోకి నిశితంగా చూసింది. అతను కావాలని రాబోయే ప్రమాదాన్ని చూపించి హెచ్చరిస్తున్నాడా? లేక మామూలుగానే అమాయకంగా వ్యాను కొని పెట్టమని అడుగుతున్నాడా?

ఆమె ఎటూ తేల్చుకోలేకపోయింది.

"దాని సంగతి తర్వాత చూద్దాం" అని ఆమె కిందకు వెళ్లి ప్రమాదపరిస్థితిని మిగి లిన అమ్మాయిలకు తెలియచేసింది.

అంతా కలవరపడ్డారు.

"ఇప్పుడేమిటి చేయడం?" కంగారుగా అంది అంకిత

"మనం బస్సులో బయటకు వచ్చిన మరుక్షణం ఆ ఓంప్రకాష్ మనుషులు మనల్ని బస్సుతో సహా కిడ్నాప్ చెయ్యడం ఖాయం" ఆందోళనగా అంది మిథిల.

మిగిలన అమ్మాయిలంతా బేలగా చూశారు.

అప్పుడు రాజు కల్పించుకున్నాడు. "మీరు ఈ ప్రమాదం నుండి బయట పడే మార్గం నేను చెప్తాను. మరి నాకు ఆ వ్యాను కొని పెడతావా?" అడిగాడు ఆశగా.

అమ్మాయిలంతా ఉలిక్కిపడ్డారు. రాజు వైపు ఆశ్చర్యంగా చూశారు. ఇంతక్రితం పద్మిని విషయంలో రాజు చెప్పిన ఆలోచ నని పాటించడం వలన అప్పుడు పద్మినిని రక్షించుకోగలిగారు. ఇప్పుడు కూడా అలాంటి మంచి ఆలోచన అతను చెప్పవ చ్చుకదా అన్న ఆశ అందరికీ కలిగింది.

"చెప్పు" అంది అంకిత

"మొన్న తూనీగను పట్టిస్తానని నాచేత మంచి ఉపాయం చెప్పించుకుని ఆతర్వాత ఆ సంగతే మర్చిపోయారు. ఇప్పుడు కూడా అలానే చెప్పించుకుని ఆ వ్యాను కొని పెట్ట కుండా ఎగనాయమం పెడతారు మీరు. మీలాంటి అబద్ధాల కోర్లుకి డజనుమంది ఆడపిల్లలు పుడతారు" అన్నాడు.

అతని మొహం చూస్తే అందరికీ నవ్వొ చ్చింది. "వీళ్లెవరు కొనిపెట్టక పోయినా నేను తప్పకుండా నీకు ఆ వ్యాను కొనిపెడ తాను. ఆ ఆవ్యానులో నిన్ను వెంటబెట్టు కుని ఈ మహానగరమంతా చూపిస్తాను. నీకు ఏం కావాలన్నా కొనిపెడతాను" అంది అంకిత మాటిస్తూ.

"నాకు బుద్ధ విగ్రహం కొనిపెట్టాలి" గోముగా అన్నాడు.

"అలాగే కొనిస్తాను కన్నా! ఆ ఉపాయం ఏమిటో చెప్పు" అంది బుజ్జగింపుగా.

అతను ఉపాయం చెప్పాడు.

అందరికీ నవ్వువచ్చింది.

"ఉపాయం అద్భుతంగా వుంది. కానీ కొజ్జాల్ని తీసుకురావడం ఎలా?" సందే హంగా అంది మిథిల. "వాళ్ల గురిచి నువ్వేం ఆలోచించనవసరం లేదు. బోర బండ ఏరియాలో ఉంటారు కిరాయికి నాటకం ఆడమంటే ఉత్సాహంగా వస్తారు" అంది సుప్రియ.

ద్వేషభావం బలంగా ఉన్నప్పుడు విజ్ఞత బలహీనంగా ఉంటుంది. – అరిస్టాటిల్

"మరివాళ్లను తీసుకొచ్చేదెవరు? "

"నేను" అంది సుప్రియ

"సరే అయితే! ఇప్పుడే వెళ్లి నేను వార్డె న్‌తో మాట్లాడి వస్తాను." అని మిథిల కిందికు వెళ్లింది. వార్డెన్‌తో పొంచి వున్న ప్రమాదం గురించి వివరించి ఆ ప్రమాదం నుండి బయటపడే మార్గం ఏమిటో కూడా చెప్పింది మిథిల.

వార్డెన్ మనసు తెరిపినపడింది.

"అయితే వెంటనే బోరబండకి వెళ్లి కొజ్జాల్ని రప్పించే ఏర్పాటు చేద్దాం" అంది.

అంతేకాదు బస్సు డ్రయివర్ని పిలిపించి ఏం చేయాలో వివరంగా చెప్పింది వార్డెన్.

కొద్దిసేపటి తర్వాత హాస్టలు బస్సు సుప్రియతో సహా అక్కడనుండి బయలుదేరివెళ్లింది. అయితే బస్సులో అమ్మాయి లెవరూ కనిపించకపోవడంతో ఓంప్రకాష్ మనుషులు దాన్ని వెంబడించే ప్రయత్నం చేయలేదు. ఒక అరగంటలో యాభైమంది కొజ్జాలతో సుప్రియ బస్సులో హాస్టలుకి వచ్చింది. ఆ వచ్చిందెవరో ఓంప్రకాష్ మనుషులు గుర్తించకుండా అమ్మాయిలంతా బస్సుడోరు దగ్గరకు వచ్చి ఆ కొజ్జాల్ని తమలో చేర్చుకుని లోపలకు తీసుకువెళ్లారు.

వాళ్లందరికీ కిరాయి ఇచ్చి వాళ్లేం చేయాలో ముందుగా వివరించి చెప్పారు అమ్మాయిలు. అందుకు వాళ్లు అంగీకరించారు. తాము వేసుకునే ఆధునిక దుస్తుల్ని ఆ కొజ్జాలకిచ్చి అవి వేసుకోమని చెప్పారు అమ్మాయిలు. అవి ధరించిన కొజ్జాలు తమని పరిశీలనగా చూస్తే తప్ప గుర్తుపట్టలేని విధంగా ముస్తాబయ్యారు. వాళ్లు వయ్యారంగా నడుచుకుంటూ వచ్చి బస్సు ఎక్కారు. బస్సు ఆ హాస్టలు గేటులోంచి బయటకు కదిలింది. ఆ కొజ్జాల్ని హాస్టలు అమ్మాయిలుగా భావించిన ఓంప్రకాష్ అనుచరులు ఆబస్సు వెనుకే తమ వ్యానుని పోనిచ్చారు.

హాస్టలు బిల్డింగ్ పైనుంచి ఇదంతా గమనిస్తున్న అమ్మాయిలు ఒకర్నొకరు చూసుకుని నవ్వుకున్నారు.

కొద్దిదూరం వెళ్లాక బస్సుని ఓవర్‌టేక్ చేసిన వ్యాను బస్సుకి అడ్డంగా వచ్చి ఆగింది. దాంతో బస్సు ఆపక తప్పలేదు డ్రయివర్. వ్యానులో నుంచి దిగిన ఒక అనుచరుడు బస్సు ఎక్కి డ్రయివర్‌కి కత్తి చూపించి బెదిరించి అతన్ని కిందకి దింపేశాడు. ఆ డ్రయివర్ స్థానాన్ని ఆక్రమించిన ఆ అనుచరుడు బస్సుని అక్కడ నుండి ముందుకు పోనిచ్చాడు. బస్సుని మళ్లీ వ్యాను అనుసరించింది.

సిటీ లిమిట్స్ దాటాక మెయిన్‌రోడ్డుని వదిలి ఒక మెటల్‌రోడ్డుగుండా ముందుకు సాగిన బస్సు వ్యాను ఒక అరగంట తర్వాత నిర్జన ప్రదేశంలో ఆగాయి.

వ్యానులోంచి దిగిన ఓంప్రకాష్ అనుచరులు బస్సు దగ్గరకి వచ్చారు.

"ఒసేయ్! కిందకు దిగండి! మా పాండన్న ఏదో ముచ్చటపడి ఒక్కమ్మాయిని రేప్ చేయాలనుకుంటే మీరంతా మోసం చేసి మా అన్నని పోలీసులకు పట్టిస్తారా! ఇప్పుడు వీరవనితల్లా కోర్టుకి బయల్దేరి అక్కడ సాక్ష్యం చెప్పి అన్నకు శిక్ష వేయించాలని చూస్తారా! మేమంతా మీ అందర్నీ ఇక్కడికిక్కడే రేప్ చేస్తాం. ఎవరొచ్చి మిమ్మల్ని రక్షిస్తారో చూస్తాం" అన్నారు వికృతంగా నవ్వుతూ.

మరుక్షణం బిలబిలమంటూ కొజ్జాలంతా కిందికి దిగారు. వాళ్లని పరిశీలనగా చూసిన ఓంప్రకాష్ అనుచరులు నిర్ఘాంతపోయారు.

★ ★ ★

బస్సు వచ్చి కోర్టు ఆవరణలో ఆగింది. దానిలోంచి దిగుతున్న హాస్టలు అమ్మాయిల్ని చూడగానే అప్పటివరకు కలవరపడుతూ వాళ్ల కోసం ఎదురుచూసిన నవీన మొహం వికసించింది.

కొద్దిమంది అనుచరులతో, ఎమ్మెల్యేలతో అక్కడే నిలబడి వున్న ఓంప్రకాష్ మొహం

పాలిపోయింది.

నవీన పరుగులాంటి నడకతో అమ్మాయిల దగ్గరికి వెళ్ళింది.

"మీరు వస్తారో రారో అని తెగ కంగారు పడుతున్నాను. మీరు వచ్చారు. అంతే చాలు" అంది నవీన సంభ్రమంగా.

"వాస్తవానికైతే మేము అసలు ఇక్కడికి రాకూడదు" అంటూ ఓంప్రకాష్ వేసిన పథకాన్ని దాన్ని అజ్ఞాత వ్యక్తి చెప్పిన ఉపాయంతో ఎలా తిప్పి కొట్టిందీ వివరంగా చెప్పింది మిథిల.

మొదట నిర్ఘాంతపోయిన నవీన అంతలోనే తేరుకుని నవ్వుతూ "అయితే పాపం ఆ కొజ్జాల చేతుల్లో వాళ్ళు ఎన్ని అవస్థలు పడుతున్నారో కదా? " అంది.

"అవును" అన్నారు అమ్మాయిలు కూడా నవ్వుతూ.

ఊహించని పరిణామానికి నివ్వెరపోయిన ఓంప్రకాష్ వెంటనే సెల్‌లో తన అనుచరుడితో మాట్లాడాడు. మరుక్షణం ఆయన స్థాణువులా అయిపోయాడు.

"ఏమైంది? " ఆదుర్దాగా అడిగాడు ఒక ఎమ్మెల్యే.

ఆయన తడారిపోయిన గొంతుతో "ఈ అమ్మాయిలు మన వాళ్ళని దారుణంగా మోసం చేశారు. మన వాళ్ళు కిడ్నాప్ చేసింది అమ్మాయిల్ని కాదు కొజ్జాల్ని"

ఎమ్మెల్యేలు, అనుచరులు అదిరిపడ్డారు.

ఇప్పుడేమిటి చేయడం? " ఒక ఎమ్మెల్యే తేరుకుని అడిగాడు.

"తెలీదు" నిస్తేజంగా అన్నాడు ఓంప్రకాష్

అంతలో కోర్టు నుండి పిలుపు రావడంతో నవీన అమ్మాయిల్ని వెంటబెట్టుకుని కోర్టు హాలులోకి వెళ్ళింది. అమ్మాయిలంతా ఒకరి తర్వాత ఒకరిగా బోనులో నిలబడి ఆ రోజు పాండు తన స్నేహితులతో వచ్చి ఎలా గార్డుల్ని గాయపరిచి వార్డెన్‌ని కుర్చీలో బంధించి పద్మిని మీద ఏ విధంగా అత్యాచారం చెయ్యడానికి ప్రయత్నించారో వివరంగా చెప్పారు. అదంతా నోట్ చేసుకున్నారు జడ్జిగారు. గార్డులు, వార్డెన్ కూడా సాక్ష్యం చెప్పారు.

అంతలో నవీన లేచి జడ్జి గారి అనుమతి తీసుకుని తాను రికార్డు చేసిన పాండు చెప్పిన నిజాల్ని ఆయనకు వినిపించింది. ఆ తర్వాత సెల్‌లో ఉన్న గూండాని పాండు బృందం చంపినప్పుడు వాళ్ళకు సహకరించిన కానిస్టేబుల్స్ ఆమెతో చెప్పిన నిజాల్ని కూడా ఆమె క్యాసెట్టు ద్వారా ఆయనకు వినిపించింది. పాత కేసు విషయమై కానిస్టేబుల్స్ ఆరుగురు వచ్చి బోనులో నిలబడి ఆ రోజు అసలు ఏం జరిగిందో అంతా వివరంగా చెప్పారు.

మరో బోనులో నిలబడి ఉన్న పాండుకి తల తిరిగిపోయింది. ప్రేక్షకుల గ్యాలరీలో ఉన్న ఓం ప్రకాష్, ఎమ్మెల్యేలు, అనుచరులు అంతా షాక్ తిన్నారు. పాత కేసుని కూడా ఇంత పకడ్బందీగా నవీన తిరగతోడుతుందని వాళ్ళు ఊహించలేదు.

సాక్ష్యాధారాలన్నీ పాండు నేరస్థుడని రుజువు చేస్తుండడంతో జడ్జిగారు అతనికి యావజ్జీవ కారాగార శిక్ష విధించాడు. చేయని నేరానికి అయిదు నెలలుగా జైలు శిక్ష అనుభవిస్తున్న మధు నిర్దోషి అని తెలియజేస్తూ అతన్ని వెంటనే విడుదల చేయవలసిందిగా జైలు అధికారుల్ని ఆదేశిస్తూ జడ్జి గారు తీర్పు చెప్పారు.

మరుక్షణం ప్రేక్షకుల గ్యాలరీలో ఉన్న విశ్వనాథం మాస్టారి మొహం వెలిగిపోయింది. ఆయన మనసంతా ఆనందోద్వేగంతో నిండిపోయింది. మనసులోనే ఆయన తన శిష్యుడు రాజుకి కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.

అదే గ్యాలరీలో ఉన్న ఓంప్రకాష్ సర్వశక్తులు ఉడిగిపోయిన వాడిలో కృంగిపోయాడు. ఆయన అనుచరులు, సన్నిహితులు డీలాపడిపోయారు.

జీవితంలో మొదటిసారిగా ఓటమిని చవి



చూశాడు ఓంప్రకాష్

కోర్టు ఇచ్చిన ఆర్డరు అందుకున్న నవీన విశ్వనాధం మాస్టార్ని వెంటబెట్టుకుని జీపులో జైలుకి వెళ్ళింది. అక్కడ అధి కారులకి ఆ ఆర్డరు చూపించి తన బావని విడుదల చేయించింది.

బయటకు వచ్చిన మధుకి అది కలో నిజమో అర్ధంకాలేదు. కొడుకుని దగ్గరకు తీసుకుని చిన్నపిల్లాడిలా ఏడ్చేశాడు మాస్టారు.

మధు, నవీన కళ్ళు కూడా నీటితో నిండిపోయాయి. ఒక విధమైన భావోద్వే గంతో ముగ్గురి గొంతులు మూగపో యాయి. చేతిస్పర్శతో, కంటిచూపుతో మాత్రమే ఆత్మీయతని, మమకారాన్ని పంచు కున్నారు. విషాదాన్ని అక్కడే వదిలేసి ఆనం దాన్ని మనసుల్లో నింపుకుని ముగ్గురూ జీప్‌లో ఇంటివైపుగా సాగిపోయారు.

★ ★ ★

"అన్నా! మందు తీసుకో!" అంటూ ఒక అనుచరుడు ఓంప్రకాష్‌కి గ్లాసులో విస్కీ పోసి సోడా కలిపి అందించాడు.

"వద్దు" అంటూ ఓంప్రకాష్ కటిక నేల మీద పడుకున్నాడు.

"అదేంటన్నా!! అలా నేల మీద పడుకు న్నావ్? " అనుచరుడు కంగారుపడ్తూ అడి గాడు.

"మరి నా తమ్ముడు అక్కడ నేల మీద పడుకుని వుంటే ఇక్కడ నేను మెత్తని ఫోమ్‌బెడ్ మీద ఎలా పడుకోగలనని అను కుంటున్నావ్? " అన్నాడు విషాదంగా.

"మిమ్మల్ని ఈ స్థితిలో చూడలేమన్నా!" అన్నాడు అనుచరుడు బాధగా.

మరోసారి బరువుగా నిట్టూర్చాడు ఓం ప్రకాష్

ఈ రోజు నుండి నేను సత్తు పళ్ళెంలో అన్నం, సాంబారుతో భోజనం చేద్దామను



కుంటున్నాను. నంబరు ముద్రించిన తెల్లని జైలు దుస్తులు వేసుకుందామనుకుంటున్నాను' అన్నాడు నిస్తేజంగా.

"అన్నా!" అంటూ అనుచరులంతా బావురుమన్నారు.

వాళ్ళందరినీ జాలిగా చూసిన ఆయన తిరిగి అన్నాడు.

"మన బిల్డింగ్ ఆవరణలో ఒక పెద్ద బండరాయిని ఏర్పాటు చేయండి. దాన్ని కొడుతూ రోజంతా కష్టపడతాను. ఎందుకంటే అక్కడ నా తమ్ముడు చేత కూడా ఆ జైలు గార్డులు అదే పనిచేయిస్తారు కదా" అన్నాడు విరక్తిగా.

అనుచరుల ఏడ్పులు ఎక్కువయ్యాయి. అప్పుడే ఆయనకి సన్నిహితులైన ఎమ్మెల్యేలు ప్రముఖ ఉగ్రవాద నాయకుడు ఉస్మాన్‌ని వెంటబెట్టుకుని వచ్చారు. ఉస్మాన్, ఓం ప్రకాష్‌లు గత అయిదేళ్ళుగా మంచి మిత్రులు. ఆ ఇద్దరూ ఆపద సమయంలో ఒకరికొకరు సహకరించుకుంటూ వుంటారు. ఓంప్రకాష్ బాధలో ఉన్నాడని తెల్సి ఉస్మాన్ అక్కడికి వచ్చాడు. అతని వెంట అతని అనుచరులు కూడా ఉన్నారు.

నేల మీద పడుకుని వున్న ఓంప్రకాష్‌ని చూడగానే మనసు చివుక్కుమంది ఉస్మాన్‌కి.

"ఏమిటిది ఓం ప్రకాష్ భాయ్! ఏదో ఘోరం జరిగిపోయినట్టుగా నేలమీద పడుకున్నావ్. దెబ్బతిన్న సింహం వేటాడాలిగాని ఇలా ఎక్కడైనా డీలాపడిపోతుందా? " అన్నాడు ఉస్మాన్ అనునయంగా.

ఓంప్రకాష్‌కి కాస్తంత ఊపిరి వచ్చినట్టయింది. "నా తమ్ముడిని రక్షించుకోలేకపోయానన్న బాధ నన్ను దహించివేస్తోంది ఉస్మాన్ భాయ్! దాన్ని తట్టుకోలేకపోతున్నాను" అన్నాడు నిస్పృహగా

ఓంప్రకాష్ భుజం మీద చిన్నగా తట్టాడు

ఉస్మాన్.

"బాధపడకు ఓంప్రకాష్ భాయ్! ముందు మీరు మనసుని ఎలక్షన్ మీద లగ్నం చేయండి. గెలిచిన ఎమ్మెల్యేలంతా మీ గూటికి వచ్చేలా చేసుకోండి. అవన్నీ పూర్తయి మీరు ముఖ్యమంత్రి అయితే అన్ని సమస్యలూ వాటంతట అవే సర్దుకుంటాయి. అవసరం అనుకుంటే జైళ్ళనే రద్దు చేయవచ్చు" అన్నాడు ఉస్మాన్ భరోసాగా.

ఓం ప్రకాష్ మొహం వెలిగిపోయింది. అంతలోనే బరువుగా నిట్టూరుస్తూ "ఎమ్మెల్యేల్ని మనగూటికి తెచ్చుకోవాలంటే ఒక్కొక్కరికి ఎంత లేదన్నా కోటి రూపాయలు ఇచ్చుకోవాలి. అంత డబ్బు ఎక్కడనుండి తీసుకురావాలో అర్థం కావడంలేదు" అన్నాడు.

వాస్తవానికి ఓం ప్రకాష్ ఆస్తి వేల కోట్ల రూపాయల్లో ఉంటుంది. అయితే ఎలక్షన్ నిమిత్తం ఆ డబ్బులోనుంచి రూపాయి తీయడానికి ఆయన మనసు అంగీకరించదు. తను ముఖ్యమంత్రి అయితే తన వలన ఎవరయితే లాభం పొందాలని ఆశిస్తారో వారి దగ్గర్నుండి ఆ డబ్బు రాబట్టాలనుకుంటాడు ఓం ప్రకాష్.

ఉస్మాన్ ఆత్మీయంగా నవ్వి "డబ్బు కోసం మీరేం కంగరుపడకండి. నావంతు సాయంగా ఒక వంద కోట్ల వరకు తెచ్చాను. వాటితో ఒక వంద మంది ఎమ్మెల్యేల్ని దారిలోకి తెచ్చుకోవచ్చు" అన్నాడు.

ఓం ప్రకాష్ ఆనందంతో వుక్కిరి బిక్కిరయ్యాడు.

ఉస్మాన్ తన అనుచరుల వంక సాభిప్రాయంగా చూశాడు. వాళ్ళు పెద్దపెద్ద సూట్ కేసులు మోసుకొచ్చి అక్కడ వుంచి వాటిని తెరిచారు. లోపల వరుసగా పేర్చి వున్న అయిదు వందల రూపాయల నోట్ల కట్టలు కళ్ళు మిరుమిట్లు గొలుపుతూ కన్పించాయి.

సంతోషం పట్టలేక ఉస్మాన్ని కౌగిలించుకున్నాడు ఓం ప్రకాష్.

"నీ రుణం తీర్చుకోలేనిది ఉస్మాన్ భాయ్! రేపు నేను ముఖ్యమంత్రిని అయ్యాక ఈ రాష్ట్రం మొత్తాన్ని నీ దోసిట్లో వుంచుతాను. అప్పుడు నువ్వు దీన్ని విస్కీలోనంజుకుంటావో లేక ముక్కలుగా నరికి చలిమంట వేసుకుంటావో నీ ఇష్టం" అన్నాడు ఓం ప్రకాష్ ఉద్వేగంతో.

ఉస్మాన్ అదోలా నవ్వి "ఈ రాష్ట్రం నేనేం చేసుకుంటాను ఓం ప్రకాష్‌భాయ్! నాకు కావాల్సింది ఈ రాష్ట్రంలో మా స్థావరాలకు అవకాశం. ఆ తర్వాత మేము ఇక్కడ నుండి మా కార్యకలాపాల్ని సాగిస్తాం. మా ఉనికి బయట పడకుండా మా జోలికి ఏ చట్టమూ రాకుండా చూసుకోవాల్సిన బాధ్యత మీది" అన్నాడు.

"తప్పకుండా మీరు కోరినట్టే జరుగుతుంది ఉస్మాన్‌భాయ్! అవసరం అనుకుంటే ఇప్పుడున్న పోలీసు అధికారుల్నందర్నీ తొలగించి మీ కోసం మీకు అనుకూలించే వ్యక్తుల్నే ఆ పోస్టుల్లో నియమిస్తాను" అని హామీ ఇచ్చాడు ఓం ప్రకాష్

సంతృప్తిగా తలపంకించాడు ఉస్మాన్.

అప్పుడే ఫోన్ మోగింది. ఓం ప్రకాష్ వెళ్ళి రిసీవరు అందుకున్నాడు. అటువైపు నుండి మాట్లాడిన వ్యక్తి పేరు వినగానే ఆయన నిటారుగా అయ్యాడు. ఆయన మొహంలో విస్మయం తొంగిచూసింది.

"చెప్పండి సార్!" అన్నాడు వినమ్రంగా

"మా ఇంటిలిజెన్స్ రిపోర్టు ప్రకారం రేపు ఎలక్షన్లు అయ్యాక కాబోయే ముఖ్యమంత్రి మీరేనని తేలింది. ఇక్కడ మా పార్టీ అధికారం చేపట్టడానికి మీ వంతు సహకారంగా అప్పుడు మీ తరపు ఎమ్.పిల్నందర్నీ మాకు సపోర్టు చెయ్యమని చెప్పాలి" అన్నాడాయన.

ఆ జాతీయ పార్టీ నాయకుడు చెప్పింది వినగానే మనసులో నవ్వుకున్నాడు ఓంప్ర



తెలుసుకోవలసినది తెలుస్తున్నకొద్దీ మనిషికెంత తక్కువ తెలుసో తెలుస్తుంది. - డంకన్

కాష్. ఇప్పుడు మరో వంద కోట్లు సంపాదించే అవకాశం వచ్చినందుకు సంబరపడ్డాడు.

"అలాగే సార్! మీ మాట కాదంటానా! కాని...?" అంటూ నసిగాడు.

"ఫర్వాలేదు. చెప్పు" అన్నాడాయన.

"నేను ముఖ్యమంత్రి కావడం అంత తేలికయిన విషయం కాదన్సార్! కనీసం రెండు వందల మంది ఎమ్మెల్యేల్ని కొనాలి. అంటే ఎంతలేదన్నా రెండు వందల కోట్లు అవుతుంది. అంత డబ్బు ఎక్కడనుండి తీసుకురావాలో తెలియడంలేద్సార్" అన్నాడు దిగులుగా.

ఆ జాతీయ నాయకుడు చిన్నగా నవ్వాడు. "రేపు మా మనిషి ఒకతను మీ దగ్గరకు వచ్చి వంద కోట్ల రూపాయలు ఇస్తాడు. మిగతా డబ్బు మీరు ఎక్కడైనా చూసుకోండి. కాని మీరు ముఖ్యమంత్రి అయ్యాక మాట నిలబెట్టుకోవడం మర్చిపోవద్దు" అన్నాడాయన.

"ఆ విషయంలో మీరు ఎలాంటి సందేహాలూ పెట్టుకోవద్దు. మీరు కావాలంటే హామీ పత్రం రాసిస్తాను" అన్నాడు ఓం ప్రకాష్ నమ్మకంగా.

ఆ జాతీయ నాయకుడు తృప్తిగా నిట్టూర్చాడు.

"అవసరంలేదు. మీమీద మాకు నమ్మకం వుంది. మరి నేనుంటాను" అని ఆయన ఫోన్ పెట్టేశాడు.

ఓం ప్రకాష్ మనసు ఆనందంతో తుళ్ళిపడుతోంది. వచ్చి మరోసారి ఉస్మాన్‌ని కౌగిలించుకుని విషయమంతా చెప్పాడు.

అతను సంబరపడిపోయాడు. ఓం ప్రకాష్ అనుచరులు, సన్నిహితులైన ఎమ్మెల్యేలు పొంగిపోయారు.

"ఇదే అంటారు కలిసొచ్చే కాలం వస్తే నడిచొచ్చే కొడుకు పుడతాడని. ఇక మీరు ముఖ్యమంత్రి కావడాన్ని ఈ ప్రపంచంలో ఏ శక్తీ ఆపలేదు" అన్నాడు ఉస్మాన్ అభినందనగా.

"థాంక్యూ" అన్నాడు ఓంప్రకాష్ మెరుస్తున్న కళ్ళతో.

"ముందు మీరు మీ నియోజకవర్గం పరిస్థితిని కూడా ఒకసారి పరిశీలించుకోండి. ఎందుకంటే అక్కడ మీరు గెలిస్తేనే ఆ తర్వాత ఏం చెయ్యడానికైనా అవకాశముంటుంది" హెచ్చరిస్తూ అన్నాడు ఒక ఎమ్మెల్యే.

బదులుగా వికృతంగా నవ్వాడు ఓంప్రకాష్. "ఈ నియోజకవర్గం నాది. ఇక్కడ నన్ను ఓడించగల దమ్ము, సామర్థ్యం ఎవరికీ లేవు. అసలు అలాంటి వ్యక్తే ఇంతవరకు పుట్టలేదు. పుట్టడు కూడా" గర్వంగా అన్నాడు ఓం ప్రకాష్.

★ ★ ★

రాజుని చూడగానే సీతారామరాజు విగ్రహం దగ్గర నిలబడి వున్న పట్టాభి మొహం వెలిగిపోయింది.

"గురూ!" అంటూ ఆనందోద్వేగంతో రాజుని చుట్టేశాడు పట్టాభి.

రాజు ఆత్మీయంగా నవ్వాడు.

"నువ్వు వస్తావో రావోనని కంగారు పడుతున్నాను గురూ!"

"పిచ్చివాడా! రాకుండా ఎలా వుంటాను" అన్నాడు రాజు అభిమానంగా.

ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ రోడ్డుమీద నడవసాగారు. కొద్ది దూరం వెళ్ళాక వాళ్ళ ముందు మిడ్డీ వేసుకుని వున్న ఒకమ్మాయి వయ్యారంగా నడుచుకుని వెళ్ళడం గమనించారు రాజు, పట్టాభి. నగ్నంగా వున్న ఆమె కాలి పిక్కలు నున్నగా ఆరోగ్యంగా కన్పిస్తూ కళ్ళు చెదరగొడుతున్నాయి.

"గురూ! ఫిగరు పిటపిటలాడిపోతోంది. ఏ కాలేజీయో?" అన్నాడు పట్టాభి హుషా

తప్పులెన్నటం మొదలుపెడితే చుట్టాలంటూ ఎవరూ ఉండరు. – రాబర్ట్ ఫ్రాస్ట్

రుగా.

ఆ మాటలు మిడ్డీ అమ్మాయి చెవిన పడ్డాయి. అయినా పట్టించుకోలేదు.

పట్టాభి సన్నగా విజిల్ వేశాడు.

"పుల్లారెడ్డి స్వీటుకొట్టే కదిలి వెళ్తున్నట్టు లేదూ? " వుత్సాహంగా అన్నాడు పట్టాభి.

రాజు సన్నగా నవ్వాడు.

"బ్రహ్మ అమృతాన్ని, బంగారాన్ని, కుంకుమపువ్వుని, వజ్రాల పొడిని రంగరించి ఈమె ఆకృతిని మలిచినట్టున్నాడు. వెనక నుండి చూస్తూంటేనే ఇంత అందంగా వుంది. ఇక ముందు చూస్తే అరేబియా గుర్రంలా వుంటుందేమో? " అన్నాడు పట్టాభి వుత్సాహంగా.

"అయితే చూడు!" అంటూ ఆమె చటుక్కున ఆ ఇద్దరివైపు తిరిగింది. ఆమె మొహాన్ని చూసిన పట్టాభి కొయ్యబారిపోయాడు.

ఆమె నవీన! ఇన్‌స్పెక్టర్ నవీన.

ఆమె ఆ ఇద్దరివైపు రౌద్రంగా చూసింది. "ఈ ఏరియాలో రోడ్‌రోమియోల తాకిడి రోజురోజుకీ ఎక్కువైపోతూందని కాలేజి అమ్మాయిల్నుండి పదే పదే ఫిర్యాదులు వస్తూండటంతో ఈ రోజు పనిగట్టుకుని మరీ కాలేజి అమ్మాయి గెటప్‌లో ఈ ఏరియాకి వచ్చాను. చిన్న చేపలకి వల విసిర్తే ఏకంగా తిమింగలాలే పడ్డాయి" అంది వ్యంగ్యంగా.

పట్టాభికి పైప్రాణాలు పైనే పోయాయి. ఆమెవైపు భీతిగా చూడసాగాడు.

అప్పుడే పోలీసు జీపు వచ్చి ఆమె పక్కన ఆగింది. దానిలోనుంచి దిగిన కానిస్టేబుల్స్‌తో చెప్పిందామె.

"ఈ రోడ్‌రోమియో లిద్దర్నీ జీపు ఎక్కించండి" అంది ఆదేశిస్తూ.

"పదండి" అన్నారు కానిస్టేబుల్స్ ఆ ఇద్దర్నీ.

"మేము... మేము అలాంటి వాళ్ళం కాదు" అన్నాడు పట్టాభి కంగారుగా.

"ముందు జీపు ఎక్కరా!" గదమాయించింది నవీన.

ఆ ఇద్దరూ జీపు ఎక్కారు. ఆ ఇద్దరికీ కాపలాగా ఇద్దరు కానిస్టేబుల్స్‌ని పక్కన కూర్చోబెట్టింది.

"వీళ్ళిద్దరూ మన కిడ్నీలను మనకు తెలీకుండానే కాజేసి తిరిగి మనకే అమ్మివేసే రకం. చాలా జాగ్రత్తగా చూస్తూండండి" హెచ్చరించి ఆమె జీపులో డ్రైవరు పక్కన కూర్చుంది.

జీపు కదిలింది.

"మీరిద్దరూ ఇక జన్మలో నాకు దొరకరని అనుకున్నారు కదా! ఇప్పుడు చెప్తాను మీ ఇద్దరి సంగతి. జీవితాంతం ఈ నవీన పేరు వింటేనే ఉలిక్కిపడేలా చేస్తాను" అంది కసిగా.

పట్టాభి మొహంలో నెత్తురుచుక్కలేదు.

"గురూ!" ఇక మన పని అయిపోయినట్టే!" అన్నాడు బేలగా.

అప్పుడే దూరం నుండి భారీ ఉరేగింపుతో కామ్రేడ్స్ రావడం కన్పించింది. ఒక మహాప్రవాహంలో కదిలివస్తున్న ఆ కామ్రేడ్స్ దగ్గరికి రాగానే వెళ్ళడానికి దారి లేక జీపు స్లో చేశాడు డ్రైవరు.

ఆ కామ్రేడ్స్ అంతా తలలకు ఎర్రటి రిబ్బన్లు కట్టుకుని చేతుల్లో ఎర్రటి జండాలు పట్టుకుని వున్నారు.

వాళ్ళు జీపుకి రెండువైపుల్నుండి ముందుకు సాగుతుండగా వెనగ్గాకూర్చుని వున్న రాజు ఇద్దరు కామ్రేడ్స్ వద్ద నుండి రెండు జండాలు రెండు రిబ్బన్లు కొట్టేశాడు.

ఆ విషయం పోలీసులు గమనించినా పెద్దగా పట్టించుకోలేదు. ఆ జండాలు, రిబ్బన్లతో అతనేంచేసుకుంటాడులే అనుకున్నారు. ముందుసీట్లో డ్రైవరు పక్కన కూర్చునివున్న నవీన ఇదేమీ గమనించలేదు. ఆమె దృష్టి కామ్రేడ్స్ మీదే వుంది.

ఒక రిబ్బను, ఒక జండా పట్టాభికి ఇచ్చి ఏంచేయాలో అతని చెవిలో చెప్పాడు

రాజు. పట్టాభి మొహం వెలిగింది. అతను తలకు రిబ్బను కట్టుకుని జండాను పట్టుకున్నాడు. రాజు కూడా అదే పనిచేశాడు.

పట్టాభి బిగ్గరగా ఒక పాటందుకున్నాడు.

"ఎన్నియలో... ఎన్నియలో... ఎర్రెర్రెని జండా ఎన్నియలో..."

ముందుకు సాగిపోతూన్న కామ్రేడ్స్ చెవిలో పడిందా పాట. వాళ్ళు చటుక్కున వెనక్కి తిరిగి చూశారు. రిబ్బన్లు కట్టుకుని జండాలు పట్టుకుని వున్న రాజు, పట్టాభి పోలీసు జీపులో కన్పించారు. కామ్రేడ్స్ మొహాలు ఎర్రబడ్డాయి.

"ఒరేయ్! ఆగండ్రా! మన కామ్రేడ్స్ ఇద్దర్ని పోలీసులు అరెస్టుచేసి తీసుకుపోతున్నారు" అంటూ మిగిలిన కామ్రేడ్స్‌ని హెచ్చరిస్తూ అరిచారు.

అంతే! కామ్రేడ్స్ అందరి చూపు ఆ ఇద్దరిమీద పడింది.

పట్టాభి అదే అదనుగా మరో పాట అందుకున్నాడు.

"ఈ నేల మనదిరో! ఆ నింగి మనదిరో!
ఈ ఊరు మనదిరో! ఆ యేరు మనదిరో!... "

కామ్రేడ్స్‌లో ఆవేశం పెరిగింది. ఆ జీపు చుట్టూతా నిలబడి బిగ్గరగా నినాదాలు చేయసాగారు.

"అక్రమంగా అరెస్టుచేసిన కామ్రేడ్స్‌ని విడుదల చేయాలి"

"పోలీసుల జులుం నశించాలి"

వాళ్ళ నినాదాలతో ఆ ప్రదేశం హోరెత్తిపోయింది. ప్రమాదాన్ని గమనించిన నవీన జీపులోనుంచి దిగి కామ్రేడ్స్ అందరివైపు చూస్తూ "మీరు పొరపాటుపడుతున్నారు. వాళ్ళు మీ కామ్రేడ్స్ కాదు. వట్టి ఫోర్ ట్వంటీలు" అంది నచ్చచెప్తూ.

దాంతో మరింత రెచ్చిపోయారు ఆ కామ్రేడ్స్. వాళ్ళందరికీ నాయకుడిగా ఉన్న వ్యక్తి ముందుకొచ్చి ఆవేశంగా "మా కామేడ్స్ ఎప్పుడూ మీకు ఫోర్‌ట్వంటీల్లాగే కన్పిస్తారు. మర్యాదగా మా వాళ్ళని వదిలిపెట్టండి. లేకపోతే ఈ జీపు ఇక్కడ నుండి అంగుళం కూడా కదలదు" అని హెచ్చరించాడు.

ఆమె తెల్లబోయింది. ఏం చేయాలో దిక్కు తోచలేదు. తల తిప్పి రాజు వంక చూసింది. అతను ముసిముసిగా నవ్వుతుంటే ఆమెకు వళ్ళుమండిపోయింది.

అంతలో పట్టాభి ఇంకో పాట అందుకున్నాడు. "నీ పాదం మీద పుట్టుమచ్చనై చెల్లెమ్మా.... తోడ బుట్టిన రుణం తీర్చుకుంటనే చెల్లెమ్మా....." ఆ కామ్రేడ్స్ నాయకుడు "చూశారా! మా వాళ్ళకు మాత్రమే ఆ

## కప్ప కాకుండా మనిషైతే



బయాలజీ టీచర్ క్లాసురూమ్‌లో కప్పనుకోసి దాని లోపలి భాగాలను పిల్లలకు చూపించి వాటిని గురించి వివరిస్తున్నాడు. ఇలాగే మనిషిని కోసిచూస్తే ఏముంటాయో తెలుసా? అన్నాడు.

వెంటనే ఓ పిల్లవాడు లేచి 'అతనిలో ఏముంటాయోగానీ.. మనం మాత్రం జైల్లో ఉంటాం' అన్నాడు టక్కున.

పాటలొస్తాయి. ఆ పాడటంలో ఆ తీవ్రత మా వాళ్ళకు మాత్రమే ఉంటుంది" అన్నాడు.

ఆమెకు తల బాదుకోవాలనిపించింది. వాళ్ళకు ఎలా నచ్చచెప్పాలో అంతుబట్టలేదు. అంతలో వాళ్ళ నినాదాల హోరు పెరిగింది.

ఆమె ఏం చెప్తున్నా వాళ్ళు వినిపించుకోవడంలేదు. చివరికి అంతా జీపు చుట్టూతా బైఠాయించి ధర్నా కార్యక్రమానికి దిగారు. మరో పక్క పట్టాభి విప్లవ గేయాలు పాడుతూనే ఉన్నాడు.



ఇక లాభం లేదని ఆమె కానిస్టేబుల్స్‌తో చెప్పింది.

"ఆ ఇద్దరినీ వదిలేయండి"

రాజు, పట్టాభి జీపు జీపు దిగారు. పోలీసుల మీద విజయం సాధించిన ఆనందంతో కామ్రేడ్స్ చిందులు వేయసాగారు. పట్టాభి వాళ్ళతో కలిసిపోయి చిందులు వేశాడు.

కాస్త దూరం వాళ్ళతో ఊరేగింపుగా సాగిన రాజు, పట్టాభి మెల్లగా వాళ్ళ నుండి తప్పుకున్నారు.

★ ★ ★

ఎలాగైనా ఈ సారి జరగబోయే ఎలక్షన్లో ఓం ప్రకాష్‌ని ఓడించాలని గట్టిగా నిర్ణయించుకున్నారు ఆ నియోజికవర్గంలోని యువకులంతా. అందుకే ఓం ప్రకాష్‌కు పోటీగా నిస్వార్థపరుడు, త్యాగశీలి స్వాతంత్ర్య సమరయోధుడు అయిన సుందరయ్యగారిని నిలబెట్టారు. స్వరాజ్యం కోసం ఆయన తన యావదాస్తిని ధారాదత్తం చేయడమే కాకుండా ఇంతవరకు ఆయన అవివాహితుడుగానే మిగిలిపోయాడు. అలాంటి ఔన్నత్యం వున్న వ్యక్తి రాజకీయాల్లోకి వస్తే ప్రజలకు ఎంతో మేలు జరుగుతుందని ఆ యువకులు భావించారు.

మొదట ఆయన రాజకీయాల్లోకి రావడానికి విముఖత వ్యక్తం చేసేసరికి ఆ యువకులంతా గట్టి పట్టుదలతో ఆయన ఇంటి ముందు నిరాహారదీక్షకు కూర్చున్నారు. దాంతో ఆయన ఒప్పుకోక తప్పలేదు. ఆయన్ని ఊరేగింపుగా తీసుకెళ్ళి ఆయన చేత నామినేషన్ వేయించారు. అంతేగాకుండా ఓం ప్రకాష్ పట్ల అసంతృప్తితో వున్న ప్రజలకు ఆయన మనోభావాలను తెలియజేయడం కోసం ఒక బహిరంగ సభను ఏర్పాటు చేస్తూ ఆ సభకు హాజరుకావలసిందిగా ప్రజలందరికీ మనవి చేస్తూ నియోజకవర్గం మొత్తం వాల్ పోస్టర్లు అంటించారు.

ఇసుక వేస్తే రాలనంతగా జనం ఆ సభకు హాజరయ్యారు. అంతమంది జనాన్ని చూసేసరికి, సుందరయ్య మనస్సు ఆనందంతో నిండిపోయింది. మొదట యువకులు ఒకరి తర్వాత ఒకరుగా మైకు ముందు నిలబడి ఆవేశంగా మాట్లాడారు. ఓం ప్రకాష్ దురాగతాల్ని, అక్రమాన్ని దుయ్యబట్టారు. జనం వాళ్ళ ప్రసంగానికి ఈలలు వేసి చప్పట్లు కొట్టారు. చివరిగా సుందరయ్యగారు మైకు ముందుకొచ్చి మాట్లాడుతుండగా జనమంతా ఎంతో శ్రద్ధగా, ఆసక్తిగా వినసాగారు. ఆయన ప్రసంగం అందర్నీ ఆకట్టుకోవడమే కాకుండా ఎంతో ఉత్తేజపరిచింది. అందరికీ ఆయన పట్ల ఉన్న అభిమానం, ఆరాధన రెట్టింపయ్యాయి. ఆయన ఉపన్యాసం అలా అనర్గళంగా కొనసాగుతుండగా ఓం ప్రకాష్ మనుషులు రంగంలోకి దిగి పొగబాంబుల్ని

ఆ జనం మధ్యలోకి విసిరారు.

ఓం ప్రకాష్ మనుషులు వచ్చారు బాంబులు విసురుతున్నారు అన్న వార్త అంతటా వ్యాపించటంతో ప్రజలంతా ప్రాణ భయంతో అటూ ఇటూ పరుగులు తీయసాగారు. అక్కడ పెద్ద తొక్కిసలాట జరిగింది. కేవలం కొద్ది నిమిషాల్లోనే జనమంతా ఆ ప్రదేశాన్ని వదిలి పారిపోయారు. కొద్దిసేపటి క్రితం అక్కడ అసంఖ్యాకంగా జనం హాజరయ్యారనడానికి నిదర్శనంగా తెగిపడిన చెప్పులు పైకి లేస్తున్న దుమ్ము తెరలు మాత్రం సాక్ష్యంగా నిలిచాయి.

సుందరయ్యగారు, ఆ యువకులు నిర్ఘాంతపోయారు జరిగిన పరిణామానికి. స్వరాజ్యం వచ్చాక మనుషుల్లో ఎంతగా స్వార్థం, అరాచకం పెరిగిపోయాయో కళ్ళారా చూసిన సుందరయ్య గారి మనస్సు తీరని ఆవేదనకు గురయింది.

ఓం ప్రకాష్ మనుషులు ఆ దుమ్ము తెరల మధ్యగా నడుచుకుంటూ ఆ వేదిక దగ్గరకు వచ్చారు. వాళ్ళందరికీ నాయకత్వం వహిస్తున్నతను సుందరయ్య గారి వంక తీవ్రంగా చూశాడు.

"ఏరా! నువ్వేనా సుందరయ్య అంటే? " గదమాయిస్తూ అడిగాడు.

ఆయన మాట్లాడలేదు.

ఆయన్ని తేరిపారా చూసిన ఆ నాయకుడు వ్యంగ్యంగా నవ్వాడు.

"గట్టిగా గాలి పీల్చి ఊదితేనే చచ్చేలా ఉన్నావు కదరా నువ్వు! నీకు రాజకీయాలెందుకురా!" అన్నాడు హేళనగా.

ఆయన నిర్వికారంగా చూస్తున్నాడు. ఆవేశంతో యువకుల రక్తం మరిగిపోతున్నా ఆ దుర్మార్గుల చేతుల్లో ఉన్న అత్యాధునిక మారణాయుధాలు చూసి తమని తాము తమాయించుకుంటున్నారు. "చూడూ! రేపు సాయంత్రంలోగా నువ్వు నామినేషన్ వెనక్కి తీసుకోవాలి. లేకపోతే ఏం జరుగుతుందో తెలుసా? " అన్నాడతను హెచ్చరిస్తూ.

ఆయన నోరు విప్పలేదు.

"ఇదుగో! నిన్ను సపోర్టు చేస్తున్న ఈ యువకులందర్నీ చంపి వాళ్ళ శవాల్ని నీకు కానుకగా పంపిస్తాం" అన్నాడు కర్కశంగా.

సుందరయ్య గారి మొహం పాలిపోయింది.

"గుర్తుంచుకో! రేపు సాయంత్రం ఆరుగంటలు. ఆ తర్వాత నువ్వు ఎంత బాధపడినా ఎలాంటి ప్రయోజనం ఉండదు" మరో సారి హెచ్చరించిన అతను తన వాళ్ళతో కల్సి అక్కడ నుండి వెళ్ళిపోయాడు.

ఆయన హతాశుడయ్యాడు. గుండె బరువెక్కింది. కళ్ళు తడి అయ్యాయి.

"ఇలాంటి రాక్షసుల్ని అంతమొందించడానికి త్రేతాయుగంలో రాముడు, ద్వాపరయుగంలో కృష్ణుడు వున్నారు. కాని ఆనాటి రాక్షసుల్ని మించిన కిరాతకులు అడుగడుగునా రాజ్యమేలుతున్న ఈ కాలంలో అలాంటి వ్యక్తులు ఎందుకు పుట్టడంలేదో అర్థం కావడంలేదు" అన్నాడాయన విషాదంగా.

"అక్కడే పొరపాటుపడ్డారు. అలాంటి వ్యక్తి వున్నాడు" అంటూ స్టేజి వెనకనుండి పట్టాభి వాళ్ళ ముందుకొచ్చాడు.

వాళ్ళంతా ఆశ్చర్యపోయారు. పట్టాభిని వింతగా చూశారు.

"ఎవరతను? " తేరుకున్న యువకులు మామూలుగా అడిగారు.

"మా గురువుగారు"

"ఎక్కడుంటాడతను? "

"ఇక్కడ" అంటూ రాజు ఆ వేదిక మధ్యగా వున్న చెక్కను తొలగించుకుని పైకి వచ్చాడు.

అంతా అతనిని దిగ్భ్రాంతిగా చూశారు. రాజు సుందరయ్య గారి పాదాలకు నమస్కరించాడు. అతని భక్తిభావానికి ముగ్ధుడయ్యాడు సుందరయ్య గారు.

"చెప్పండి! నేను మీకు ఏం సహాయం చేయగలను? " అడిగాడు రాజు.

ఆయన చిన్నగా నిట్టూర్చాడు.

"నువ్వేం చేయగలవు నాయనా! ఇప్పుడు మమ్మల్ని బెదిరించి వెళ్ళిన ఆ ఓంప్రకాష్ అనుచరులు పరమ కిరాతకులు. మనుషుల ప్రాణాలు తీయడం వాళ్ళకు మంచినీళ్ళు తాగినంత తేలిక. ఇక ఆ ఓంప్రకాష్ నర రూప రాక్షసుడు. పైగా అతని చేతిలో డబ్బు అధికారం, పలుకుబడి, పరపతి అనే ఆయుధాలున్నాయి. అంచేత అతన్ని నువ్వే కాదు... ఈ లోకంలో ఎవరూ ఏమీ చేయ లేరు" అన్నాడాయన నిస్పృహగా.

రాజు ఆయన్ని జాలిగా చూశాడు. "అలా అయితే తన తమ్ముడిని కోర్టు విధించిన శిక్ష నుండి ఎందుకు తప్పించలేకపో యాడు? " అడిగాడు రాజు చిర్నవ్వుతో.

ఆయన తలెత్తి రాజు వంక ఒక్క క్షణం నిశ్శబ్దంగా చూశాడు.

"ఆ కేసు విషయంలో సాక్షులుగా వచ్చిన హాస్టలు అమ్మాయిలకి ఓ అజ్ఞాత వ్యక్తి అన్ని విధాలుగా సాయం చేశాడు. అందు వల్లే ఓంప్రకాష్ తన తమ్ముడి విషయంలో ఏం చేయలేకపోయాడు" అన్నాడు సుంద రయ్య గారు.

"ఆ అజ్ఞాత వ్యక్తి ఎవరో మీకు తెలుసా? " రాజు చిద్విలాసంగా నవ్వుతూ అడిగాడు.

"తెలీదు... మీకు తెలుసా? " ఒక యువ కుడు ఆసక్తిగా అడిగాడు.

"తెల్సు"

"ఎవరతను? "

"నేనే"

తమ తలల పక్క నుండి ఒక మిస్సైల్ దూసుకుపోయినట్టుగా వాళ్ళంతా వులిక్కిప డ్డారు. కళ్ళు పెద్దవి చేసి దిగ్భ్రాంతిగా రాజు వంక చూశారు.

"ఇప్పుడు చెప్పండి? ... ఆ ఓంప్రకాష్‌ని నేనేం చేయలేనంటారా? " అడిగాడు రాజు.

తేరుకున్న అందరి మనసులు ఆనందోద్వే గానికి గురయ్యాయి.

"తప్పకుండా చెయగలవు! ఆ నమ్మకం మాకుంది" ఆ యువకులు సంభ్రమంగా అన్నారు.

సుందరయ్యగారు రాజు దగ్గరికి వచ్చి అతని భుజం చుట్టూతా చేయివేసి దగ్గరకు తీసుకున్నాడు ఆప్యాయంగా.

"నీ విషయంలో మాకు ఎలాంటి సందే హాలు లేవు. ఆ ఓంప్రకాష్ అంతుచూడగల సమర్థుడివి నువ్వొక్కడివే" అన్నాడు నమ్మ కంగా.

రాజు నవ్వాడు. అంతలోనే గంభీరంగా మారిపోతూ సుందరయ్యగారిని అడిగాడు.

"మీరు నామినేషన్ వెనక్కి తీసుకోవడా నికి ఆ ఓంప్రకాష్ అనుచరులు ఎప్పటి వరకు గడువిచ్చారు? "

"రేపు సాయంత్రం ఆరుగంటల వరకు"

రాజు తల పరికించాడు.

"ఈ రోజు సాయంత్రం ఆరుగంటల్లోపే ఆ ఓంప్రకాష్‌కి శాశ్వతంగా రాజకీయ సమాధి కట్టబోతున్నాం" అన్నాడు రాజు స్థిరంగా.

"ఎలా? " అడిగారు యువకులు ఉత్సా హంగా. రాజు తన మనసులోని పథకాన్ని వాళ్ళకు వివరంగా చెప్పాడు. అందరి మొహాలు వికసించాయి.

"భగవంతుడు... భగవంతుడు వున్నాడు. అందుకే నిన్ను మా దగ్గరికి పంపించాడు" మనస్ఫూర్తిగా అన్నాడు సుందరయ్య గారు.

★ ★ ★

రాజు చెప్పిన పథకం ప్రకారం ఆ నియో జకవర్గంలో వున్న అన్ని కాన్వెంట్లలో చదివే పిల్లల్నందర్నీ కిడ్నాప్ చేశారు యువకులు. అంతేగాక ఆ కాన్వెంట్ల యాజమాన్యానికి కూడా ఫోన్లు చేశారు.

"మా అన్న ఓంప్రకాష్ మీద పోటీగా స్వాతంత్ర్య సమరయోధుడు సుందరయ్యను



మనల్ని మెచ్చుకునే వారిని ప్రేమిస్తాము. కానీ ప్రేమించే వారిని మెచ్చుకోము. – రోషి

# రచయితలకు సూచనలు

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.

★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్ట్‌లోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:

చతుర

'ఈనాడు' కాంపౌండ్

హైదరాబాద్, 500 082.

ఈ నియోజకవర్గ ప్రజలు కావాలని నిలబెట్టారు కాబట్టి మేము మీ కాన్వెంట్లలో చదివే పిల్లల్ని కిడ్నాప్ చేశాం. రేపు సాయంత్రంలోగా ఆయన చేత నామినేషన్ ఉపసంహరించుకునేలా చేస్తేసరి. లేదంటే ఈ పిల్లల శవాలు ఈ నియోజకవర్గ ప్రజలకు కానుకగా పంపించడం జరుగుతుంది" ఓంప్రకాష్ అనుచరులు హెచ్చరిస్తున్నట్లుగా చెప్పారు యువకులు.

దాంతో ఈ విషయం తెల్సిన ఆ నియోజకవర్గ ప్రజలంతా ఆగ్రహావేశాలతో రగిలిపోయారు. అంతా ఓంప్రకాష్ అంతు చూడాలనుకున్నారు. అదే అదనుగా, భావించిన యువకులు ఆ ప్రజల్లో కల్సిపోయి వాళ్ళను బాగా రెచ్చగొట్టసాగారు. ప్రజల్లో చైతన్యం వస్తేనేగాని ఓంప్రకాష్‌లాంటి పాతుకుపోయి వేళ్ళూనిన రాజకీయ నాయకుణ్ణి కదిలించడం అసాధ్యం అనే విషయం రాజుకి తెల్సు కనుక ప్రజల్లో అతనిపట్ల తిరుగుబాటు వచ్చేలా చేశాడు.

ఆడ, మగ, వృద్ధులు, యువకులు అనే తేడా లేకుండా అంతా ఓంప్రకాష్ ఇంటి మీదకు దాడి చేశారు. భద్రతా సిబ్బంది కళ్ళల్లో కారంకొట్టి గేట్లు తీసుకుని ఒక మహాప్రవాహంలా లోపలికి జొరబడ్డారు. అడ్డువచ్చిన ఓంప్రకాష్ అనుచరుల్ని చితక బాదారు. ఓంప్రకాష్‌ని చుట్టుముట్టి కసి తీరేలా కొట్టారు. ఆ దెబ్బలకు తాళలేక ఆయన స్పృహ తప్పాడు.

అదే సమయంలో రాజు పట్టాభి, ఓంప్రకాష్ పర్సనల్ గదిలోకి ప్రవేశించారు. అతను అక్రమంగా సంపాదించిన డబ్బు, నగలు, వజ్రాలులాంటి విలువయిన సంపదనంతా మూటలు కట్టారు. అవేగాక ఎమ్మెల్యేల్ని కొనడానికి దాచిన కోట్లాది రూపాయల్ని కూడా అపహరించారు. మొత్తం నాలుగయిదు బస్తాలయ్యాయి. వాటిని జాగ్రత్తగా ప్రహరీగోడ అవతలకి చేర్చారు.

ఇంకా పగ చల్లారని ప్రజానీకం ఓంప్రకాష్ భవంతిలోకి ప్రవేశించి కన్పించిన ఫర్నిచరంతా ధ్వంసం చేశారు. అప్పుడుగాని వాళ్ళ కోపం తగ్గలేదు. వాళ్ళు ఇళ్ళకు తిరిగి వచ్చేసరికి ఎవరి పిల్లలు వాళ్ళ ఇళ్ళ దగ్గరున్నారు.

ఇది జరిగిన ఒక గంటకు పోలీసులు రంగప్రవేశం చేసి ఓంప్రకాష్‌ని, అతని అనుచరుల్ని హాస్పిటల్లో చేర్పించారు. అందరికీ కాళ్ళూచేతులు విరిగాయని వాళ్ళకు వళ్ళంతా బ్యాండేజీలు వేశారు డాక్టర్లు.

ఎలక్షన్లు నిరాటంకంగా జరిగిపోయాయి. ఓట్లకోసం డబ్బు వెదజల్లడానికిగాని, సారా ఉద్ధృతంగా ప్రవహించేలా చెయ్యడానికిగాని, లేదా రిగ్గింగు చెయ్యడానికిగాని అవకాశం లేని విధంగా ఓంప్రకాష్, అతని అనుచరులు హాస్పిటల్లో బెడ్స్ మీద మూల్గుతూ మూలుగుతూ పడి వున్నారు.

దాంతో ప్రజలంతా తమ ఓటుని నిర్భయంగా స్వేచ్ఛగా వినియోగించుకున్నారు. అంతా నిస్వార్థపరుడు, త్యాగశీలి అయిన సుందరయ్య గారికి ఓటు వేశారు. ఫలితంగా ఆయన భారీ మెజార్టీతో గెలిచారు. ఓంప్రకాష్‌కి డిపాజిట్టు దక్కలేదు.

ఈ విషయం రాష్ట్రమంతా సంచలనం సృష్టించింది. ముఖ్యమంత్రి శ్రీరాములు గారు స్వయంగా వచ్చి సుందరయ్య గారిని అభినందించి ఆయన్ని పార్టీలోకి ఆహ్వానించడమే కాకుండా ఆయనకి మంత్రిపదవి ఇచ్చి తన గౌరవాన్ని చాటుకున్నారు.

ఆయనే గనుక గెలవకుండా వుంటే ఈపాటికి ఓంప్రకాష్ ఎమ్మెల్యేల్ని కొని తానే ముఖ్యమంత్రి అయివుండే వాడన్న నిజం ముఖ్యమంత్రి శ్రీరాములు గారికి బాగా తెలుసు. ఆ పరిస్థితి దాపురించకుండా అడ్డుకున్న సుందరయ్యగారి పట్ల ఆయనకి విపరీతమైన గౌరవాభిమానాలు ఏర్పడ్డాయి.

ఆ రోజు పత్రికా విలేఖర్లంతా సుందరయ్యగారి దగ్గరికి వచ్చారు.

"అపర చాణుక్యుడిగా పేరుపొంది, రాజ

కీయ దురంధరుడిగ్గా ప్రఖ్యాతి గడించి ఇంతవరకు ఓటమి అనేదే ఎరుగని ఓంప్రకాష్ గారిని మీరెలా ఓడించగలిగారు? ఈ విషయం యావత్ ఆంధ్ర రాష్ట్ర ప్రజానీకానికే వింతగా ఉంది" అన్నాడు ఒక విలేఖరి.

ఆయన చిర్నవ్వు నవ్వాడు.

"ఇందులో నా గొప్పతనం ఏమీలేదు" అన్నాడాయన.

"మరి? "

"నేను ఇంత గొప్ప మెజార్టీతో గెలవడానికి, ఆ ఓంప్రకాష్ ఘోరంగా ఓడిపోవడానికి పరోక్షంగా ఒక వ్యక్తి నాకు సహకరించడమే. ఇంకా చెప్పాలంటే ఈ గెలుపు అతనిదే" అన్నాడాయన మనఃస్ఫూర్తిగా.

"ఎవరతను? " విలేఖర్లంతా ఆసక్తిగా అడిగారు.

"అజ్ఞాత వ్యక్తి"

అంతా దిగ్భ్రాంతులయ్యారు.

"అంటే ఓంప్రకాష్ తమ్ముడిని హాస్టలు అమ్మాయిలు పోలీసులకు పట్టివ్వడంలో వాళ్లకు సహకరించిన అజ్ఞాత వ్యక్తి ఇప్పుడు మీ గెలుపుకి కారణమయిన అజ్ఞాత వ్యక్తి ఒక్కరేనా? " ఒక విలేఖరి ఆరాగా అడిగాడు.

"అయివుండవచ్చు"

"అతనెవరో చెప్పగలరా? "

ఆయన నవ్వి "సారీ". అన్నాడు. మర్నాడు అన్ని పేపర్లలో మొదటి పేజీల్లో రెండు వార్తలు ప్రచురించబడ్డాయి.

ఒకటి... సుందరయ్యా గారిని భారీమెజార్టీతో గెలిపించిన అజ్ఞాత వ్యక్తి.

రెండు... పేద ప్రజలకు వేల కోట్ల రూపాయలు పంచి పెట్టిన అజ్ఞాత వ్యక్తి.

ఈ రెండు వార్తలు రాష్ట్రమంతటా సంచలనం సృష్టించాయి. ఎక్కడ చూసినా జనం అజ్ఞాత వ్యక్తి గురించే చర్చించుకోసాగారు. అందరిలో అతనిపట్ల అపారమయిన అభిమానం ఏర్పడింది. అన్ని జిల్లాల్లో అతని పేరు మీద అభిమాన సంఘాలు వెలిశాయి.

★ ★ ★

హాస్టల్లోకి ప్రవేశించిన రాజు అక్కడ వాతావరణం గంభీరంగా ఉండటం గమినంచాడు. అమ్మాయిలంతా రాజువంక చురుగ్గా చూస్తున్నారు.

"ఏమిటి అంతా అలా వున్నారు? " అడిగాడు రాజు అయోమయంగా.

"ఎవర్నువ్వు? " మిథిల నోటి నుండి ఆ ప్రశ్న బాణంలా దూసుకువచ్చింది.

అతను ఉలిక్కిపడ్డాడు.

అతని గడ్డం పట్టుకుని అతని తలని పైకెత్తి అతని మొహంలోకి తీవ్రంగా చూసింది మిథిల.

"చెప్పు... ఎవర్నువ్వు? "

"నేను... నేనే" తడబడ్డాడు రాజు.

ఆమె విసురుగా అతన్ని గోడ దగ్గరకు తీసుకువెళ్లింది. గోడకు వెంకటేశ్వరస్వామి పటం వేలాడుతోంది. అతని చేతిని ఆ పటం మీద వుంచింది మిథిల.

"ఇప్పుడు చెప్పు... ఆ దేవుడి మీద ప్రమాణంచేసి మరీ చెప్పు... ఎవర్నువ్వు? " నిలదీసిందామె.

అతను నిర్వ్యెరపోయాడు. ఆమె చేతిలో ఉన్న తన చేతిని మెల్లగా విడిపించుకుని అందర్నీ కలయ చూశాడు రాజు. అంతా అతన్నే చూస్తున్నారు.

"చెప్తాను" అన్నాడు గంభీరంగా.

ఆ తర్వాత అతను చెప్పినదంతా విన్నవాళ్లంతా దిగ్భ్రాంతులయ్యారు. అతను ఇప్పుడు ఎంతో ఉన్నతంగా ఎందరో అభాగ్యుల జీవితాల్లో వెలుగునింపడానికి వచ్చిన దయామయుడిలా అన్పించాడు. అమ్మాయిలందరికీ చేతులు జోడించి అతనికి నమస్కరించాలన్పించింది. ఒక మహత్తరమైన పనికి ఇతను తమ హాస్టల్ని ఎంచుకుని ఇంతకాలం తమతోపాటు ఉన్నందుకు అమ్మాయిలంతా గర్వపడ్డారు.

"ఈ రోజు పేపరులో సుందరయ్యగారు

ఇచ్చిన ఇంటర్వ్యూ చదవడం వలన నిన్ను నిలదీయవలసి వచ్చింది రాజూ! ఇన్నాళ్లూ నిన్ను మేము అవమానించాం. కసురుకున్నాం. చిరాకుపడ్డాం. ఆ విషయమై నువ్వు మమ్మల్ని మన్నించాలి" అంది మిథిల పశ్చాత్తాపం పడుతూ.

"అలా అనకండి. మీరే నన్ను క్షమించాలి. నేనెవరో చెప్పకుండా మిమ్మల్ని మోసంచేసి మీ ఆశ్రయం పొందాను" అన్నాడు రాజు నొచ్చుకుంటూ.

"అందుకు శిక్షేమిటో తెలుసా? " సీరియస్‌గా చూస్తూ అంది అంకిత.

"ఏమిటీ? " అడిగాడు రాజు.

"ఇక ముందు కూడా నువ్వు మాతోనే వుండాలి" అంది అంకిత నవ్వుతూ.

"అవును... అవును" అన్నారు అమ్మాయిలంతా గట్టిగా.

"అలాగే" అన్నాడు రాజు.

అందరి మొహాలు వికసించాయి.

## అపార్థం



కోర్టులో కేసు విచారణ జరుగుతున్న వేళ ఓ లాయర్‌గారి ప్రవర్తన జడ్జిగారికి ఒళ్లుమండించింది. దాంతో ఆయన ఆగ్రహంగా 'మీరు హద్దులు మీరుతున్నారు?' అని హూంకరించారు.

వెంటనే లాయర్, 'కౌన్ సాలా ఐసా కహతా హై?' అన్నాడు గట్టిగా.'సాలా' అంటే ఓ తిట్టుగా కూడా ఉపయోగిస్తారు కదా? దాంతో జడ్జిగారు అగ్గిమీద గుగ్గిలమే అయ్యారు.

'నన్ను సాలా అంటావా? నీకెంత ధైర్యం ? నీమీద కోర్టుధిక్కార నేరం కింద చర్యతీసుకోవాల్సిందే' అని పళ్లుపటపట కొరికారు.

'సారీ.. సర్.. మిమ్మల్ని నేను 'సాలా' అనలేదు.. కౌన్‌సా 'లా' ఐసా కహతా హై అన్నానంతే అంటే ఏ చట్టం అలా చెప్పిందని మాత్రమే.' అన్నాడు లాయర్ లౌక్యంగా.

★ ★ ★

హాస్పటల్నుండి ఓంప్రకాష్ అతని అనుచరులు డిశ్చార్జి అయి ఇంటికి వచ్చారు. ఇల్లంతా అస్తవ్యస్తంగా వుంది. డబ్బు, నగలు, డైమండ్స్ అన్నీ పోయినందుకు కుంగిపోయాడు ఓంప్రకాష్. ఉస్మాన్ వచ్చి ఆయన్ని అనునయించాడు. అన్నివిధాలుగా తను అండగా ఉంటానని అభయం ఇచ్చాడు. అప్పుడే జైల్నుండి పారిపోయి వచ్చిన పాండు తన స్నేహితులతో వచ్చి ఓంప్రకాష్‌ని ఆనందంలో ముంచెత్తాడు. ఉస్మాన్ కూడా అతని రాకకి సంబరపడ్డాడు. ముగ్గురూ కలిసి భవిష్యత్తు కోసం ప్రణాళికలు తయారుచేయసాగారు.

"అన్నింటికన్నా ముందు ఆ ఇన్‌స్పెక్టర్ నవీనని చంపాలి" కసిగా అన్నాడు పాండు.

"నీ చేతికి మట్టెందుకు అంటడం. దాని సంగతి నా మనుషులు చూసుకుంటారు" అన్నాడు ఉస్మాన్.

పాండు తల అడ్డంగా వూపాడు.

"వద్దు. దాన్ని నేనే చంపాలి. అదీ మామూలుగా కాదు. చిత్రహింసలు పెట్టి మరీ చంపాలి. అప్పుడు అదిపడే నరకం చూస్తేనేగాని నా మనసు శాంతించదు" క్రూరంగా అన్నాడు పాండు.

"ఓ పక్క నీ కోసం పోలీసులు గాలిస్తు న్నారు. ఇలాంటి పరిస్థితుల్లో నవ్వు బయటకు వెళ్లడం అంతమంచిది కాదు" వారిస్తూ అన్నాడు ఓంప్రకాష్.

"ఏంకాదు" అంటూ పాండు తన మనసులోని పథకాన్ని వాళ్లకి చెప్పాడు. ఆ పథకం ఓంప్రకాష్‌కి, ఉస్మాన్‌కి బాగా నచ్చింది.

"సరే అయితే... కాని జాగ్రత్త!" హెచ్చరిస్తూ అన్నాడు ఓంప్రకాష్.

★ ★ ★

పట్టాభి వత్తిడి చేయడంతో రాజు పట్టాభితో కల్సి మార్నింగ్ షో సినిమాకి వెళ్ళాడు. అప్పటికే సినిమా మొదలు పెట్టేశారు. ఇద్దరూ థియేటరులోకి వెళ్ళేసరికి లోపలంతా మసక చీకటిగా వుంది. ఇద్దరూ నిలబడి ఖాళీ సీట్ల కోసం చూశారు. అప్పుడే పట్టాభి దృష్టి ఒంటరిగా కూర్చుని వున్న ఒకమ్మాయిమీద పడింది. ఆమెకు అటూ ఇటూ ఖాళీ సీట్లు వున్నాయి.

"గురూ! అలా చూడు! ఆమె పక్కన కూర్చుందాం" అన్నాడు పట్టాభి ఆ అమ్మాయిని చూపిస్తూ.

రాజు పట్టాభి వంక చురుగ్గా చేశాడు. "అలాంటివి నా ఆరోగ్యానికి సరిపడవు. వేరే చోట కూర్చుందాం" అన్నాడు.

"నువ్వు రాకపోయినా ఫర్వాలేదు. ఛాన్స్ మిస్ అవను" అన్నాడు పట్టాభి.

"నీ ఖర్మ" అని రాజు మరో చోటుకి వెళ్ళి కూర్చున్నాడు. పట్టాభి హుషారుగా వెళ్ళి ఒంటరిగా కూర్చుని వున్న ఆమె పక్కనే కూర్చుని క్రీగంట ఆమెను చూసాడు. మసక చీకట్లో ఆమె మొహం స్పష్టంగా కన్పించడం లేదు.

"నీకు నీ వాళ్ళు లేరు. నాకు నా వాళ్ళు లేరు. ఛల్ మోహనరంగా... ఇద్దరం ఒక్కటై లేచిపోదామా" అంటూ ఆమెకు మాత్రమే వినబడేలా ఆమె చెవి దగ్గర పాడాడు పట్టాభి.

ఆమె ఏం మాట్లాడలేదు.

"సన్నజాజి పక్కమీద సంకురాత్రి. మొగుడూ పెళ్లాలుగా మొదటి రాత్రి..." అని మళ్ళీ పాడాడు.

అమె నోరు విప్పలేదు.

ఆమె మౌనం అర్ధాంగీకారంగా భావించాడు పట్టాభి. "ఒక్కసారి నిండు జాబిల్లి లాంటి నీ అందమయిన ముఖారవిందాన్ని నాకు చూపించి నా జన్మ తరింపజెయ్యి" అన్నాడు పట్టాభి తన్మయంగా.

ఆమె చివ్వున అతనివైపుకి తిరిగింది. ఆమె మొహాన్ని చూసిన అతను షాక్ తిన్నాడు. "ఇక్కడ నేను వుంటానని నువ్వు వూహించలేదు కదూ? " వ్యంగ్యంగా నవ్వుతూ అంది ఇన్‌స్పెక్టర్ నవీన.

పట్టాభికి స్పృహ తప్పుతున్నట్టుగా వుంది. "పద... లేచిపోదాం" అంటూ అతని చేతిని పట్టుకుని బలవంతంగా లేపింది.

"మీరు... మీరనుకోలేదు" తడబడుతూ అన్నాడు పట్టాభి.

"మరెవరనుకున్నావురా... ఒంటరిగా ఆడది థియేటరులో కన్పిస్తే చాలు నీలాంటివాళ్ళు అసభ్యంగా ప్రవర్తిస్తున్నారని నాకు ఫిర్యాదులు అందడంతో యూనిఫాం మీద చీరకట్టుకుని వచ్చి కూర్చున్నాను. తమరు దొరికారు. ఇంతకీ తమరి ప్రాణమిత్రుడెక్కడ? " అంది యూనిఫాం మీద వున్న చీరని విప్పేస్తూ.

ప్రేక్షకులంతా ఆమె వంక ఆశ్చర్యంగా, అభినందనగా చూస్తున్నారు.

"తె... తెలీదు" పట్టాభి గొణిగాడు.

"నువ్విలా... ఎందుకు చెప్తావురా!" అని రివాల్వరు తీసింది.

పట్టాభి గుడ్లు తేలేశాడు.

రాజు లేచి ఆమె దగ్గరికి వచ్చాడు. అతన్ని చూసి ఆమె విజయగర్వంతో

నవ్వింది.

"గుడ్. నీకు నీ స్నేహితుడి మీద బాగానే అభిమానం వుంది. మొన్న ఆ క్రామ్రేడ్స్‌ని అడ్డం పెట్టుకుని తప్పించుకున్నారు. ఇక ఇప్పుడెలా తప్పించుకుంటారో చూస్తాను" అంది కసిగా.

ఆ ఇద్దర్ని బయటకు తీసుకొచ్చి ఆగి వున్న పోలీసు జీపులోకి ఎక్కించింది నవీన. ఆ జీపులో ఇద్దరు కానిస్టేబుల్స్ కూర్చుని వున్నారు. ఈసారి ఆ కానిస్టేబుల్స్‌తో పాటు ఆ ఇద్దరికి కాపలాగా ఆమె కూడా పక్కనే కూర్చుంది.

"స్టేషన్‌కి పోనివ్వు" డ్రైయివరుతో చెప్పిందామె.

జీపు అక్కడ నుండి రయ్యిమని దూసుకుపోయింది.

★ ★ ★

క్రాస్‌రోడ్స్‌కి పక్కగా వున్న ఒక రెస్టారెంట్ ముందు వేసి వున్న కుర్చీల్లో కూర్చుని వున్నాడు పాండు అతని స్నేహితులు. వాళ్ళందరి చూపులు దూరంగా రోడ్డు మలుపు తిరిగేచోట కేంద్రీకృతమై వున్నాయి.

అరగంట గడిచింది. అప్పుడు నవీన వస్తున్న పోలీసు జీపు పాండు కంటబడింది. మరుక్షణం పాండు లేచి తన చేతిలో వున్న గ్రీన్ కర్చీఫ్‌ని సిగ్నల్ లైటు స్తంభం దగ్గర నిల్చుని వున్న ఎలక్ట్రీషియన్ చూసేలా, గాల్లో వూపాడు. ఆ సంకేతం అందుకున్న ఆ ఎలక్ట్రీషియన్ తన చేతిలోని కటింగ్ ప్లేయర్‌తో ఎవరూ చూడకుండా ఆ సిగ్నల్ లైట్లకి సంబంధించిన వైర్లు కట్ చేశాడు. అంతే! ట్రాఫిక్‌ని నియంత్రించే గ్రీన్ అండ్ రెడ్ బల్బులు ఒక్కసారిగా ఆరిపోయాయి. దాంతో అక్కడ అయోమయ పరిస్థితి ఏర్పడి వెహికిల్సు ముందుకు వెళ్ళకుండా ఆగిపోయాయి.

ట్రాఫిక్ జామ్ అయింది. అప్పుడే నవీన వున్న పోలీసు జీపు కూడా అక్కడకు వచ్చి ఆగింది. చూస్తుండగానే చాలా వెహికిల్స్ వచ్చి ఆ జీపు వెనుక ఆగాయి. దాంతో ముందుకిగాని వెనక్కిగాని వెళ్ళే వీలులేకుండా ఆ జీపు ట్రాఫిక్ జామ్‌లో ఇరుక్కుపోయింది.

అప్పుడు కదిలారు పాండు అతని స్నేహితులు వాళ్ళందరి చేతుల్లో హాకీ బ్యాట్లున్నాయి. వాళ్ళని గమనించిన ఆమె గభాల్న రివాల్వరు తీసింది. అంతకన్నా వేగంగా కదిలిన పాండు తన చేతిలోని హాకీ బ్యాటుతో ఆమె చేతిమీద బలంగా కొట్టాడు.

ఆమె కెవ్వుమని అరుస్తూ చేతిలోని రివాల్వరు వదిలేసింది. ఆమె చెయ్యి పట్టుకుని విసురుగా బయటకులాగాడు పాండు. ఆమె వచ్చి వాళ్ళందరి మధ్యలో నేలమీద పడింది. అడ్డు వచ్చిన కానిస్టేబుల్స్‌ని కొట్టి స్పృహ తప్పించారు పాండు స్నేహితులు.

వలయాకారంలో నవీన చుట్టురా నిలబడ్డారు వాళ్ళంతా. తనని ఆ హాకీ బ్యాట్లతో కొట్టి చంపాలనే వుద్దేశ్యంతో వాళ్ళంతా వున్నారని గ్రహించిన నవీన మెరుపువేగంతో లేచి ఒకతని చేతిలోని బ్యాట్ లాక్కుని వాళ్ళని ఎదుర్కొంది. వాళ్ళు దాదాపుగా ఇరవై మంది వరకు వున్నారు. అంతమందితో ఒంటరిగా పోరాడుతున్న ఆమె అలా ఎంతసేపు వాళ్ళని నిలువరించ గలదో ఊహించడం కష్టమే.

ఆమెలో శక్తి సన్నగిల్లిన మరుక్షణం ఆమెను అతికిరాతకంగా కొట్టి చంపడం ఖాయం.

చుట్టూ ఆగి వున్న వాహనాల్లో, వాహనాల మీద వున్న జనం వినోదంగా చూస్తున్నారే తప్ప ఆ అఘాయిత్యాన్ని, ఘాతుకాన్ని అడ్డుకుందామనే ఆలోచన ఏ ఒక్కరిలోనూ కలగలేదు.

ప్రతి జీవిలో, ప్రతి వస్తువులో భగవంతుని చూడు
– విలియం కూపర్



ఒకవేళ ఎవరిలోనైనా కలిగినా దాన్ని మనసులోనే సమాధి చేసేశారు.

జీపులో ఉన్న పట్టాభి అన్నాడు ఉత్సాహంగా "గురూ! ఇదే తగిన సమయం. పారిపోదాం పద'

రాజు తల అడ్డంగా ఊపాడు.

"వద్దు. ముందు ఆమెను రక్షిద్దాం" అన్నాడు రాజు సాలోచనగా.

పట్టాభి దిమ్మెర పోయాడు.

"అదేమిటి గురూ! మనల్ని అరెస్టు చేసి సెల్ లో పడేసి ఉతుకుడు కార్యక్రమం పెట్టాలని ఎప్పటికప్పుడు హైటెక్ లెవల్లో కలలు కంటున్న ఆ రాక్షసిని కాపాడాలంటావేమిటి? నీకేమైనా మతి పోయిందా? " అన్నాడు విస్మయంగా.

"అలా అనకు. ప్రమాదంలో ఉన్న శత్రువునైనా రక్షించాలన్నదే మన సిద్ధాంతం."

"అయితే ఇప్పుడు తమరేం చేస్తారో? " విసుగ్గా అడిగాడు పట్టాభి.

"చూస్తూండు" అని రాజు జీపు దిగి అటూ ఇటూ చూశాడు. దూరంగా రోడ్డు పక్కగా ఉన్న ఒక జ్యూయలరీ షాపు కౌంటరు ముందు కూర్చుని ఉన్న ఆ షాపు యజమాని బల్లమీద వంద, అయిదు వందల రూపాయల నోట్ల కట్టలు పెట్టుకుని లెక్క పెట్టుకుంటూ కన్పించాడు. రాజు ఆ జ్యూయలరీ షాపు కౌంటరు దగ్గరికి వెళ్ళి చిన్నగా దగ్గాడు.

షాపు యజమాని తలెత్తి చూశాడు. "ఏమీ అనుకోకండి సార్! ఈ డబ్బుని దోచుకు పోతున్నాను' అని ఆ నోట్ల కట్టలన్నింటిని రెండు చేతులతో దగ్గరకు లాక్కుని వాటిని గుండెలకు హత్తుకుని అక్కడనుంచి పరుగు ప్రారంభించాడు.

ఒక్క క్షణం బిత్తరపోయిన ఆ యజమాని తేరుకుని "దొంగ... దొంగ... దొంగ... నా డబ్బు మొత్తం దోచుకు పోతున్నాడు. పట్టుకోండి" అని బిగ్గరగా అరిచాడు. ఆ షాపులోని సిబ్బంది పరు



గున వచ్చి రాజు వెంట పడ్డారు. రాజు వాళ్ళకి దొరక్కుండా పరుగున వచ్చి జీపు పైకి ఎక్కి నిల్చున్నాడు. ఆ నోట్ల కట్టల్ని చుట్టూ ఉన్న జనం చూసేలా పట్టుకు న్నాడు. ఆ కట్టల వంక వాహనాల మీద వాహనాల్లో ఉన్న జనమంతా ఆశగా మెరు స్తున్న కళ్లతో చూశారు.

అంతా అలా చూస్తుండగా రాజు ఎక్క డైతే నవీన పాండు అతని స్నేహితులతో ఒంటరిగా పోరాడుతూందో ఆ ప్రదేశంలో గాల్లోకి ఆ నోట్లని ఎగరేశాడు. ఆ నోట్లు గాల్లోంచి రెపరెపలాడుతూ నవీన, ఆమె చుట్టు ఉన్న పాండు అతని స్నేహితులమీద రాలసాగాయి.

అప్పటి వరకు వినోదం చూస్తూన్న జన మంతా ఆ నోట్ల కోసం పరుగున వచ్చారు. ఆశగా, ఆబగా, ఆరాటంగా ఆ నోట్ల కోసం ఒకర్నొకరు తోసుకోసాగారు. అక్కడ పెద్ద తొక్కిసలాట జరిగింది.

ఒక్కరు కాదు ఇద్దరు కాదు వేల మంది జనం వచ్చి ఒక్కసారిగా పడటంతో పాండు, అతని స్నేహితులు ఆ జనం కాళ్ళ కింద పడిపోయారు.

ఇక తమ పని పూర్తయినట్టుగా రాజు పట్టాభి అక్కడ నుండి జారుకున్నారు.

అప్పుడే స్పృహ వచ్చిన కానిస్టేబుల్స్ జనంలో ఇరుక్కుపోయిననవీనను బయ టకు లాగారు.

"పదండి మేడమ్! మనం ఇక్కడ ఉండటం అంత మంచిది కాదు" హెచ్చ రిస్తూ అన్నారు కానిస్టేబుల్స్.

తను పాండు వాళ్ల చేతుల్లోంచి అంత తేలిగ్గా బయట పడుతూందని ఆమె ఊహించలేదు.

"ఆ నోట్లు ఎవరు వెదజల్లారు? " అడిగిం

దామె ఆశ్చర్యంగా, ఆసక్తిగా.

"తెలీదు మేడమ్" కానిస్టేబుల్స్ అన్నారు.

అక్కడే ఉన్న ఒక పెద్దాయన చెప్పాడు.

"ఎవరో యువకుడు మిమ్మల్ని రక్షించాలనే ఉద్దేశ్యంతో ఆ నోట్లు ఎగరేశాడమ్మా! అతనికి మీరు జీవితాంతం ఋణపడి ఉండాలి. లేకపోతే మీరు తప్పకుండా ఆ కిరాతకుల చేతుల్లో ప్రాణాలు పోగొట్టుకుని ఉండేవాళ్ళు".

ఆమె అవునన్నట్లుగా తలూపింది.

"అతను ఇక్కడ ఉన్నాడా? " ఆత్రంగా అడిగింది.

ఆయన అటూ ఇటూ చూసి, "లేదమ్మా! వెళ్ళిపోయినట్టున్నాడు" అన్నాడు.

ఆమె నిరాశగా నిట్టూర్చింది.

"పదండి మేడమ్" తొందర చేశారు కానిస్టేబుల్స్. ఆమె అక్కడ నుండి కదలబోతూ ఆగి జీపు వంక చూసి, "రాజు, పట్టాభి ఏరి? " అని. అడిగింది.

కానిస్టేబుల్స్ నవ్వి "ఇంకా వాళ్ళు జీపులో ఎందుకుంటారు మేడమ్! మనం ప్రమాదంలో పడగానే అదే అదనుగా భావించి ఆ ఇద్దరూ ఇక్కడనుండి ఉడాయించారు" అన్నారు.

"రాస్కెల్స్" కసిగా అందామె.

★ ★ ★

నవీన స్టేషన్‌కి వచ్చేసరికి ఆమె కోసం ఎదురు చూస్తూ ఆమె ఛాంబరులో కూర్చుని ఉన్నాడు విశ్వనాథం మాస్టారు. ఆమెను చూడగానే ఆయన కలవరపడ్డాడు.

"ఏమిటమ్మా? ఏమైంది? ఆ గాయాలేమిటి? " అడిగాడు ఆదుర్దాగా.

ఆమె సన్నగా నవ్వి " అబ్బే ఏం లేదంకుల్. చిన్న గలాటా జరిగింది అంతే" అంటూ అసలేం జరిగిందో వివరంగా చెప్పింది.

ఆయన నిర్ఘాంతపోయాడు. " ఈ రోజు ఎంత పెద్ద ప్రమాదం తప్పింది. ఆ అపరిచిత వ్యక్తి ఆ నోట్లు వెదజల్లి నిన్ను రక్షించక పోయినట్లయితే ఎంత అనర్థం జరిగేదో కదా" అన్నాడాయన.

"అవునంకుల్. అతనెవరో గాని చాలా తెలివిగా సమయస్ఫూర్తితో నన్ను ఆ దుర్మార్గుల బారి నుండి రక్షించాడు. కనీసం కృతజ్ఞతయినా చెప్పుకుందామనుకుంటే అతను ఎలా ఉంటాడో తెలీదు. ఎక్కడ ఉంటాడో తెలీదు" నిరాశగా అంది నవీన.

ఆయన జాలిగా నవ్వాడు.

"నువ్వు చెప్పినదాన్ని బట్టి అతనెవరో నేను ఊహించగలనమ్మా" అన్నాడు.

ఆమె నివ్వెర పోయింది.

"ఎవరని మీ ఉద్దేశ్యం? " ఆత్రంగా అడిగింది.

"అజ్ఞాత వ్యక్తి".

ఆమె దిగ్భ్రాంతురాలయింది.

"మీరు... మీరు చెప్పేది నిజమా? "

"అవునమ్మా".

"అతనే అని మీరు ఎలా అంచనా వేయగలుగుతున్నారు? "

"అలా రక్షించే చాకచక్యం, సమర్థత, తెలివి తేటలు అతనికి మాత్రమే ఉన్నాయి గనుక" అన్నాడాయన స్థిరంగా.

"అతని గురించి అంత ఖచ్చితంగా ఎలా చెప్పగలుగుతున్నారు? "

"అతను నాకు తెల్సు కాబట్టి"

ఆమె స్థాణువైంది.

"మీకు... మీకు... మీకు తెలుసా? " అంది సంభ్రమాశ్చర్యాలతో.

"అవును"

"ఎలా? "

ఆయన రాజు గురించి అతన్ని ఈ హైద్రాబాద్ ఎందుకు రప్పించిందీ అంతా వివరంగా చెప్పాడు.

ఆమె నోరెళ్ళబెట్టి విభ్రాంతిగా వింటూండిపోయింది.

"అంకుల్. అతన్ని... అతన్ని నాకు పరిచయం చేస్తారా? " ఆశగా అడిగింది నవీన.

ఆయన నవ్వాడు.

"రేపు మీ అక్క కొడుకు సిద్ధార్థ పుట్టిన్రోజు. ఆ విషయమై మీ అక్క నిన్ను ఈ రాత్రికే ఇంటికి రమ్మనమని చెప్పింది. అంతే కాదు ఆ పుట్టిన్రోజుకి బాబుని దీవించడానికి మీ అక్కా బావ అజ్ఞాత వ్యక్తిని పిలిపించమని నన్ను మరీ మరీ కోరారు. ఆ విషయం నేను అతనికి చెప్పాను. అతను రావడానికి అంగీకరించాడు. రేపు నువ్వు అతనితో మాట్లాడవచ్చు" అన్నాడాయన.

అనిర్వచనీయమైన ఆనందోద్వేగంతో ఆమె ఉక్కిరిబిక్కిరయింది.

"థాంక్యూ అంకుల్! థాంక్యూ" అంది నవీన ఆయన చేతిని పట్టుకుని ఊపేస్తూ.

ఆయన ఆప్యాయంగా ఆమె తల నిమిరాడు.

"ఉంటాను తల్లీ" అని ఆయన లేచాడు వెళ్ళడానికి.

★ ★ ★

పది గంటలు అయ్యేసరికి ఆ ఇంటిలో పండుగ వాతావరణం నెలకొంది. అంతా కొత్త బట్టల్లో కళకళలాడుతున్నారు. ఎవరి మొహం చూసినా ఆనందంతో వెలిగిపోతోంది. ఒకప్పుడు విషాదానికి మారుపేరైన ఆ ఇల్లు ఇప్పుడు సంతోష సంబ్రమాలకి నెలవైంది. ఇదంతా అజ్ఞాత వ్యక్తి పుణ్యమనే భావన అందరి మనసుల్లో ఏర్పడటం వలన అంతా ఆ రోజు ఉదయం నుంచే అతని కోసం ఎంతో ఆతృతగా ఎదురుచూస్తున్నారు.

అందరి కన్నా ఎక్కువగా ఆరాటపడుతూన్న వ్యక్తి నవీన. అతను పదింటికి వస్తాడని అంకుల్ చెప్పడం చేత ఆమె చూపులు మాటిమాటికీ గోడ గడియారం మీదికి మరలుతున్నాయి. అంతే కాదు ఎన్నడూ లేని విధంగా ఆమె ఆ రోజు ప్రత్యేకంగా అలంకరించుకుంది. ఆమె అందం మిరుమిట్లు గొలిపేలా వుంది.

ఇల్లంతా రంగురంగు కాగితాలతో బెలూన్లతో అలంకరించారు. మామిడి తోరణాలు కట్టడానికి నవీన గుమ్మం దగ్గరికి వెళ్ళింది. అప్పుడే ఆమె దృష్టి తమ ఇంటి గేటు ముందు ఆటోలోనుంచి దిగుతున్న రాజు, పట్టాభిల మీద పడింది.

ఆమె మొహం కఠినంగా మారింది.

గేటు తీయబోతూన్న ఆ ఇద్దర్నీ చూసి ఆమె చటుక్కున పక్కకు తప్పుకుంది.

"అంటే ఈ ఇద్దరూ ఈ ఇంటినే దోచుకోవడానికి వస్తున్నారన్న మాట. పాపం! తను ఈ ఇంట్లో ఉంటానని వాళ్ళకు తెలియకపోవడం వాళ్ళ దురదృష్టం. ఇక ఈసారి వాళ్ళని ఎట్టి పరిస్థితుల్లో కూడా వదిలిపెట్టకూడదు" అనుకుంది నవీన గట్టిగా.

ఆమె రివాల్వరు అందుకుని అప్పుడే మెట్లు ఎక్కబోతూన్న ఆ ఇద్దరికీ గురిపెట్టింది.

"కదలకండి. కదిల్తే ఛస్తారు" అంది.

పట్టాభికి గుండాగినంత పనైంది.

"ఏమిటి గురూ! విందు పెట్టిస్తానని చెప్పి ఈ బ్రహ్మ రాక్షసి ఇంటికి తీసుకొచ్చావ్. విందు అంటే లాఠీలతో కుళ్ళబొడిపించుకోవడమా? " అన్నాడు పట్టాభి ఏడుపు మొహం పెట్టి.

రాజు మాట్లాడలేదు. చిరునవ్వుతో చూస్తున్నాడు.

"ఇది మా ఇల్లు అనుకోలేదు కదూ? " అంది నవీన వ్యంగ్యంగా.

"అనుకుంటే ఇక్కడకెందుకొస్తాం తల్లీ! ఎవరైనా తెల్సి తెల్సి సింహం గుహలోకి అడుగుపెడతారా? " అన్నాడు పట్టాభి దిగులుగా.

"ఇద్దరూ చేతులు పైకెత్తండి" అంది కరుగ్గా.

అప్పుడే ఏదో పని మీద అక్కడికి వచ్చిన విశ్వనాథం మాస్టారు ఎదురుగా కన్పించిన దృశ్యం చూసి కంగారు పడ్డాడు.

"ఏమిటమ్మా ఇది? ఏం చేస్తున్నావు నువ్వు?" అంటూ వారించాడు.

"మీకు తెలీదంకుల్. ఈ ఇద్దరూ ఆ రోజు ట్రైనులో నా టిక్కెట్టు కొట్టేసి నా చేత పెనాల్టీ కట్టించారు. ఆ తర్వాత వీళ్ళని అరెస్టు చేస్తే కామ్రేడ్స్‌ని అడ్డం పెట్టుకుని నా నుండి తప్పించుకున్నారు. నిన్న నేను ప్రమాదంలో పడితే ఈ ఇద్దరూ అదే అదనుగా భావించి ఉడాయించిన టక్కరి దొంగలు. ఇక ఈ రోజు నా చేతుల్నుండి ఎలా తప్పించుకుంటారో చూస్తాను" అంది నవీన ఆవేశంగా.

ఆయన మందలింపుగా చూశాడు.

"తప్పు తల్లీ! ఈ రాజు ఎవరనుకుంటున్నావ్? నిన్ను ఆ కిరాతకుల బారి నుండి రక్షించడానికి నోట్లు వెదజల్లిన అజ్ఞాత వ్యక్తి. మీ బావని జైల్నుండి బయటకు తీసుకువచ్చేలా చేసిన ఆపద్బాంధవుడు" అన్నాడాయన రాజును ఆప్యాయంగా చూస్తూ.

ఆమె ఘ్రూన్పడిపోయింది. ఆమె చేతిలోని రివాల్వరు జారిపోయింది.

"అంకుల్" అంది నమ్మలేనట్టుగా.

"అవునమ్మా! అతన్ని లోపలికి రమ్మను" అన్నాడాయన.

రాజును చూడాలంటేనే ఆమెకు చాలా ఇబ్బందిగా అన్పించింది. అతి ప్రయత్నం మీద తలెత్తి చూసింది.

"నన్ను... నన్ను మన్నించండి" అంది చేతులు జోడించి.

"అబ్బే అలా అనకండి. మీరే నన్ను క్షమించాలి. మిమ్మల్ని నేను చాలా సార్లు అల్లరి పెట్టాను" అన్నాడు రాజు నొచ్చుకుంటూ

ఇదంతా చూస్తున్న పట్టాభికి మతిపోయింది. జుట్టు పీక్కోవాలన్పించింది.

"ఇది కలా నిజమా గురూ! ఛండశాసనురాలిలా వుండే నవీన ఇలా హఠాత్తుగా ఖజురహో శిల్పంలా అయిపోయిందేమిటి?" అన్నాడు పట్టాభి అయోమయంగా.

ఆ మాటలకు నవీన సిగ్గుపడుతూ నవ్వింది.

"లోపలికి రండి" అందామె ఆ ఇద్దర్నీ ఆహ్వానిస్తూ.

రాజు పట్టాభి లోపలికి వచ్చారు.

తన కొడుకు మధుని, కోడలు తులసిని రాజుకి పరిచయం చేశాడు మాస్టారు. ఆ ఇద్దరూ రాజు పాదాలకు నమస్కరించబోతూంటే రాజు వారించి పిల్లలిద్దర్నీ దగ్గరకు తీసుకుని పక్కన కూర్చోబెట్టుకుని వాళ్లతో కబుర్లు చెప్పాడు. తను తెచ్చిన బొమ్మల్ని వాళ్ళకు ఇచ్చాడు. వాటిని చూసి వాళ్లెంతో మురిసిపోయారు.

సిద్ధార్థ కేక్ కట్ చేయగానే రాజు వాడి తల మీద అక్షింతలు వేసి ఆశీర్వదించాడు. పిల్లలిద్దరి చేత రాజు పాదాలకు నమస్కారం చేయించింది తులసి.

అందరూ డైనింగు టేబుల్ దగ్గర భోజనానికి కూర్చున్నారు. రాజుకి పట్టాభికి కొసరి కొసరి వడ్డించింది తులసి.

"మా చెల్లాయి మిమ్మల్ని చాలా ఇబ్బంది పెట్టిందని విన్నాను. దాన్ని క్షమించండి" అంది తులసి నొచ్చుకుంటూ.

"అదేం లేదండీ" అన్నాడు రాజు.

"లేకపోవడమేమిటి. మమ్మల్ని సెల్‌లో వేసి మా కిడ్నీలను లాఠీలతో కుళ్ళబొడిచి, మా లివర్ని చపాతి చేసి, మా అవయవాలన్నింటినీ గుత్తకు తీసుకుని మరీ బాక్సింగు ఆడుకోవాలనుకుంది మీ చెల్లాయిగారు. అదృష్టవశాత్తు సెల్ దాకా వెళ్ళలేదు గాని వెళితే మాత్రం ఇదిగో ఇలా తినడానికి చేతులు పనిచేసేవి కావు. నమలడానికి పళ్ళుండేవి కావు" అన్నాడు పట్టాభి నిష్ఠూరంగా.

ఆ మాటలకి అంతా నవ్వారు. నవీన మొహం సిగ్గుతో కందిపోయింది.



మన ప్రతి ఆలోచనను, ప్రతీ పనిని, ప్రతి అలవాటును తీర్చిదిద్దేది నమ్మకమే! - లాంగ్‌ఫెలో

భోజనాలు అయ్యాక అంతా ముందు గదిలోకి వచ్చి కూర్చున్నారు. అంతా కాసేపు కబుర్లు చెప్పుకున్నారు.

మధు, తులసి కొత్త బట్టలు తెచ్చి రాజుకి, పట్టాభికి పెట్టారు. రాజు వద్దని వారిస్తున్నా వాళ్ళు విన్పించుకోలేదు.

కాసేపటి తర్వాత రాజు, పట్టాభి వెళ్ళడానికి లేచారు.

"ఇది మీ ఇల్లే అనుకోండి. మేమంతా మీ వాళ్ళమని భావించండి. ఇక్కడున్న ప్రతి ఒక్కరి మనసులో మీరున్నారని తెల్సుకోండి. దయచేసి తరచూ ఇక్కడకు వచ్చి మాకు ఆనందాన్ని కలుగజేయండి" అన్నాడు మధు రాజు చేతులు పట్టుకుని ఉద్వేగంతో.

'అవును. నేను రోజూ పూజించే దేవుడే మా కుటుంబాన్ని ఆదుకోవడానికి మిమ్మల్ని పంపించి ఉంటాడని నేను ఎప్పుడూ అనుకుంటూ వుంటాను. మీరే గనుక ఈ హైద్రాబాద్ మా కోసం రాకుండా వుంటే మేమంతా ఏమైపోయేవాళ్ళమో ఊహించుకుంటేనే భయంగా వుంది" అంది తులసి చెమ్మగిల్లిన కళ్ళతో.

ఆ మాటలకు రాజు కదిలిపోయాడు. అతని మనసంతా ఆర్ద్రంగా అయిపోయింది.

"నన్ను అంతగా పొగడకండి. నేను ఎప్పటికీ మాస్టారు గారి ప్రియశిష్యుడినే. అలాగే మీరంతా కూడా నాకు కావాల్సిన వాళ్ళే. మీరు సంతోషంగా సుఖంగా వుండటమే నేను ఎల్లప్పుడూ కోరుకునేది" అన్నాడు రాజు ఆత్మీయంగా.

"అయితే మీరు ఈ ఆత్మీయుల కోసం ఈ ఇంటికి వస్తూ వుండాలి" మరోసారి గుర్తు చేశాడు మధు.

ఆ విషయంలో మీరు నిశ్చింతగా వుండండి. ఒకవేళ మా గురువుగారు రాకపోయినా నేను బలవంతంగానైనా వెంటబెట్టుకుని వస్తాను. ఎందుకంటే ఇక్కడ భోజనం చేశాక ఇక ఎక్కడా కూడా భోజనం చేయాలనిపించడంలేదు" అన్నాడు పట్టాభి.

అతని మాటలకి అంతా హాయిగా నవ్వుకున్నారు.

రాజు విశ్వనాథం మాస్టారి పాదాలకు నమస్కరించి ఆయన దగ్గర్నుండి సెలవు తీసుకున్నాడు.

★ ★ ★

అక్కడ పేరుకున్న నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ ఓం ప్రకాష్ అన్నాడు.

"శ్రీరాములు ముఖ్యమంత్రి పదవి నుండి దిగిపోవాలి. అలా జరిగితే ప్రభుత్వం పడిపోతుంది"

"అది అంత తేలికైన విషయం కాదుగా" అన్నాడు ఉస్మాన్.

ఓంప్రకాష్ నవ్వాడు. ఆ నవ్వు అతి క్రూరంగా వెన్ను జలదరించేలా వుంది.

"మనం తలచుకుంటే అది చాలా తేలికయిన విషయం" అన్నాడు ఓంప్రకాష్ కళ్ళు చికిలించి కర్కశంగా చూస్తూ.

"ఎలా? " ఆసక్తిగా అడిగాడు ఉస్మాన్

"మత కలహాలు"

"అంటే? " కళ్ళు పెద్దవి చేసి చూస్తూ అడిగాడు ఉస్మాన్.

అతనికి తన మనసులోని పథకం మొత్తం వివరించి చెప్పాడు ఓం ప్రకాష్

ఉస్మాన్ మొహం పైశాచికానందంతో వెలిగిపోయింది.

"ఈ దెబ్బతో ఆ శ్రీరాములు ముఖ్యమంత్రి పదవి పోగొట్టుకోవడం ఖాయం. ఆ తర్వాత పార్టీ పడిపోవడం తథ్యం" అన్నాడు సంబరంగా.

"ఈ రాత్రికే పని జరిగిపోవాలి" పాము బుసలా విన్పించింది ఓం ప్రకాష్ స్వరం.

"చూస్తారుగా" ఉత్సాహంగా అన్నాడు ఉస్మాన్

★ ★ ★

లోకోత్తరమైన జ్ఞానాన్ని అవిద్య కప్పివేయడం వల్లనే కష్టాలు సంభవిస్తున్నాయి. – డా. రాధాకృష్ణన్

ఆ రాత్రి జంట నగర వాసులకు నిజంగా కాళరాత్రే అయింది. కొందరు ముస్లింలు, కొందరు హిందువులు కత్తిపోట్లకు గురయ్యారు. ఓ మసీదులో, ఓ గుడిలో బాంబులు పేలాయి. ఫలితంగా జంట నగరాల్లో మత ఘర్షణలు ప్రారంభమయ్యాయి. వీధుల్లో కత్తులు పట్టుకుని మతోన్మాదులు వీరవిహారం చేశారు. ఎందరో అమాయకులు ప్రాణాలు కోల్పోయారు. ప్రశాంతతకు, చైతన్యానికి ప్రతీకలైన జంట నగరాల వీధులు నెత్తుటి ధారలతో, శవాలతో రణక్షేత్రాన్ని తలపిస్తున్నాయి. ఎంతోమంది గోడుగోడునా విలపిస్తున్నారు. ప్రజలు ప్రాణభయంతో తలుపులు బిగించుకుని ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకుని బిక్కుబిక్కుమంటూ బతుకుతున్నారు. ఈ దారుణం గురించి తెల్సిన వెంటనే ముఖ్యమంత్రి జంట నగరాల్లో కర్ఫ్యూ విధించాడు. పోలీసుల్ని, మిలటరీ వాళ్ళని రంగంలోకి దింపాడు. అయినా ఎలాంటి ఫలితం కన్పించలేదు. మారణకాండ యధేచ్ఛగా కొనసాగింది. భయం గుప్పిట్లో చిక్కుకున్న జంట నగరాలు కొండచిలువ నోటికి చిక్కుకున్న లేడికూనల్లా విలవిలలాడుతున్నాయి.

ఇదే అదనుగా భావించిన ప్రతిపక్షం నాయకులు రంగంలోకి దిగి ముఖ్యమంత్రి శ్రీరాములు గారు తన పదవికి రాజీనామా చేయాలని రాష్ట్రంలో అన్ని చోట్లా భారీయెత్తున ధర్నాలు, రాస్తారోకోలు చేయసాగారు. ప్రభుత్వాన్ని రద్దుచేయమని గవర్నరు గారికి మెమోరాండం కూడా సమర్పించారు.

మత ఘర్షణల విషయం ఢిల్లీ వరకు పాకింది. ప్రధానమంత్రి ముఖ్యమంత్రి గారికి స్వయంగా ఫోన్ చేశాడు.

"మీ రాష్ట్రంలో శాంతి భద్రతలు పూర్తిగా క్షీణించాయని మాకు రిపోర్టు అందింది. మీకు ఇరవై నాలుగు గంటలు టైమిస్తున్నాను. ఈ వ్యవధిలో మీరు ఏం చేస్తారో ఎలా చేస్తారో మాకు తెలీదు. మత కలహాలు, మారణకాండలు పూర్తిగా సమసిపోయి తిరిగి శాంతి భద్రతలు నెలకొల్పాలి. లేదంటే ఇరవై నాలుగు గంటలు అయిన మరుక్షణం మీరు మీ పదవికి రిజైన్ చేయాల్సి వుంటుంది" అని హెచ్చరించాడు.

ముఖ్యమంత్రి హతాశుడయ్యాడు. ఆయనకేం చెయ్యాలో పాలుపోలేదు. ఇరవై నాలుగు గంటల్లో మత కలహాలు ఆపడం అసాధ్యమన్న సంగతి ఆయనకి తెల్సు. మనసంతా దిగులుతో నిండిపోయింది.

అత్యవసర మంత్రివర్గ సమావేశం ఏర్పాటు చేశాడు. దానికి మంత్రులంతా హాజరయ్యారు. రాష్ట్రపతి ఫోన్ గురించి చెప్పి ఆ విషమ పరిస్థితుల్నుండి జంట నగరాల్ని, పార్టీని రక్షించే ఉపాయం చెప్పమని ఆయన అందర్నీ కోరాడు.

ఎవరూ ఏమీ చెప్పలేకపోయారు. అంతా అశక్తుల్లా తలలు దించుకున్నారు. వాళ్ళను అంతకన్నా బాధపెట్టడం ఇష్టంలేక ఆ సమావేశాన్ని అంతటితో ముగించాడాయన. ఆ హాలు నుండి అంతా వెళ్ళిపోయారు. ఆయన కూడా తన సీట్లోంచి లేవబోతూ ఎదురుగా కుర్చీలో ఒంటరిగా కూర్చుని వున్న సుందరయ్యగారిని చూశాడు.

"మీరు వెళ్ళలేదేం? " పేలవంగా నవ్వుతూ అడిగాడు ముఖ్యమంత్రిగారు.

ఆయన లేచి "ఇప్పుడు ఏర్పడిన దుష్పరిణామాల్నుండి జంటనగరాల్ని, మన పార్టీని రక్షించగల సమర్థుడు, ప్రతిభాశాలి అయిన ఒక వ్యక్తి వున్నాడు సార్" అన్నాడు.

"ఎవరతను? " ఎంతో ఆతృతగా అడిగాడు ముఖ్యమంత్రి

"అజ్ఞాతవ్యక్తి"

ఆయన నిటారుగా అయ్యాడు.

"అంటే మీరు గెలవడానికి ఆ ఓంప్రకాష్ ఎలక్షన్లో ఓడిపోవడానికి కారణమయిన వ్యక్తి గురించేనా మీరు మాట్లాడేది? " అడి

గాడాయన ఆసక్తిగా.

"అవును"

శ్రీరాములుగారికి ప్రాణం లేచొచ్చినట్ట యింది.

"అయితే ఇంకా చూస్తారేం? అతన్ని పిలి పించండి" అన్నాడు తొందరపెడుతూ.

అరగంట తర్వాత రాజు ఆయన ముందున్నాడు.

"చెప్పండి సార్" అన్నాడు రాజు వినమ్రంగా.

ఆయన రాజు వైపు ఆశ్చర్యంగా చూశాడు.

"చాలా చిన్నవాడివే" అన్నాడు.

రాజు సిగ్గుపడుతూ నవ్వాడు. జంటనగరాల్లో ఏర్పడిన సంక్షోభం గురించి వివరించి ఆ పరిస్థితి నుండి జంటనగరాల్ని, పార్టీని 24 గంటల్లో రక్షించే ఉపాయం ఏదైనా వుంటే చెప్పమని ఆయన కోరాడు.

రాజు కొద్దిక్షణాలు ఆలోచించి అద్భుతమైన ఉపాయాన్ని ఆయనకి చెప్పాడు.

ముఖ్యమంత్రి శ్రీరాములుగారు రాజువైపు దిగ్భ్రాంతిగా చూశాడు. ఆయనకి ఆ క్షణంలో ఎంత ఆనందం కలిగిందంటే రాజుని అమాంతం కౌగిలించుకున్నాడు.

"నీలాంటి వ్యక్తిని ఈ భూమ్మీద పుట్టించినందుకు ఆ భగవంతునికి కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను" అన్నాడు మనస్ఫూర్తిగా.

ఆ తర్వాత ఆయన ఏమాత్రం ఆలస్యం చేయకుండా రాజు చెప్పిన ఉపాయాన్ని అమలుపరిచాడు.

★ ★ ★

మత ఘర్షణలకి సంబంధించిన వార్తలు వినడం కోసం జంటనగరాల ప్రజలు ఎంతో ఉద్విగ్నతతో టి.వి.ల ముందు కూర్చుని ఉన్నారు.

అప్పుడే న్యూస్‌రీడర్ టి.వి స్క్రీన్ మీద ప్రత్యక్షమైంది.

"అమెరికా దేశానికి చెందిన శాస్త్రవేత్తలు ప్రయోగించిన ఒక ఉపగ్రహం కొన్ని సాంకేతిక లోపాల కారణంగా పాడై భూమి దిశగా వేగంగా దూసుకువస్తోంది. అది రాబోయే పన్నెండు గంటల్లో భారతదేశంలో ఆంధ్ర రాష్ట్రంలోని జంటనగరాల మీద కూలిపోయే అవకాశాలు ఎక్కువగా వున్నాయని ఆ శాస్త్రజ్ఞులు తెలియజేస్తున్నారు. అది పడినచోట రెండు వందల కిలోమీటర్ల వరకు అంతా ధ్వంసమవుతుందని అంచనా వేస్తున్నారు. ఈ విషయం తెల్సిన వెంటనే మన ప్రధానమంత్రి, ముఖ్యమంత్రి తమ తీవ్ర దిగ్భ్రాంతిని వ్యక్తంచేశారు. సత్వర సహాయచర్యల కోసం పోలీసుల్ని, మిలటరీ దళాల్ని ఇప్పట్నుంచే రంగంలోకి దింపడమేకాకుండా కేంద్ర ప్రభుత్వం నుండి సహాయ సహకారాలు తీసుకోవడానికి మన ముఖ్యమంత్రి శ్రీరాములు గారు ప్రయత్నాలు ప్రారంభించారు. ఈ విషయమై ప్రజలంతా ఆత్మస్థైర్యంతో వుండాలని ఆయన ఉద్బోధించారు" అని చెప్పిన ఆ న్యూస్ రీడరు ఒక్క క్షణం ఆగింది.

"ప్రతి అరగంటకోసారి ఈ ఉపగ్రహానికి సంబంధించిన వార్తలు ప్రసారమవుతాయి" అని విషాదంగా నవ్వుతూ చెప్పి అదృశ్యమైంది.

మరుక్షణం "ఎవరికి ఎవరు? చివరికి ఎవరు? ముగిసే ఈ యాత్రలోనా..." అనే పాట గుండెల్ని పిండుతూ ప్రసారమైంది.

జంటనగరాల ప్రజలు షాక్ తిన్నారు. అప్పటి వరకు వాళ్ళని భయభ్రాంతుల్ని చేస్తున్న మతకలహాల మారణహోమం ఈ ఉపగ్రహం వార్త ముందు పిపీలికంలా అయిపోయింది.

ఇప్పుడు ఎవరూ మిగలకుండా అంతా చావబోతున్నారన్న నిజం ఎవరో వచ్చి తమని చంపబోతున్నారన్న ఆందోళనని పక్కకునెట్టేసింది. ఆ చంపబోయే వాళ్ళు కూడా మృత్యువుకి చేరువగా ఉన్నారన్న ఆలోచన అందరికీ గమ్మత్తుగా అన్పించింది.

దేవుడిని విభజించుకుని మా దేవుడు

గొప్ప అంటే మా దేవుడు గొప్ప అని మనిషి సృష్టించుకున్న మతాలపేరిట మారణకాండకు పాల్పడుతున్న ఉన్మాదుల కళ్ళు తెరిపించడానికి, చావు విషయంలో మానవజాతి మొత్తం నా దృష్టిలో ఒక్కటే అని తెలియజేయడానికి దేవుడు ఈ ఉపగ్రహమనే ఉపద్రవాన్ని సృష్టించాడు కాబోలు అన్న భావన జంటనగరాల ప్రజలందరికీ కలిగింది.

జనం అంతా ఇళ్ళల్లోంచి నిర్భయంగా బయటకు వచ్చారు. షాపులు, దుకాణాలు తెరవబడ్డాయి. ఇరు మతస్థుల ప్రజలు ఒకర్నొకరు ఆప్యాయంగా కౌగిలించుకుని కన్నీళ్ళు పెట్టుకున్నారు.

మతోన్మాదులు, కత్తులు వదిలేసి మనసు నిండా జ్ఞానజ్యోతుల్ని వెలిగించుకున్నారు. విద్వేషాల్ని విడనాడి శాంతిమార్గాన్ని అనుసరించారు.



బతికే ఈ కొద్ది గంటలైనా హాయిగా ఆనందంగా గడపాలన్న ఉద్దేశ్యంతో అంతా విందులు వినోదాల్లో మునిగిపోయారు. కులం, మతం, పేద-గొప్ప అనే తారతమ్యాల్ని మరిచి అంతా ఒక్కటిగా సామరస్యంతో మెలిగారు.

ఒక్క గంటలో జంటనగరాల వీధులన్నీ జనంతో కళకళలాడసాగాయి. వాహనాలు నిరాటంకంగా సాగిపోతున్నాయి. అంతటా శాంతిభద్రతలు నెలకొన్నాయి.

దాంతో ప్రభుత్వం అన్నిచోట్లా కర్ఫ్యూ ఎత్తివేసింది.

★ ★ ★

ముఖ్యమంత్రి శ్రీరాములుగారు టి.వి. స్క్రీన్ మీద ప్రత్యక్షమయ్యారు. ఆయన ప్రజల్ని ఉద్దేశించి మాట్లాడుతూ "అందరికీ నా నమస్కారాలు. మీరంతా కూడా నన్ను ఒక విషయంలో మన్నించాలి. వెయ్యి అబద్ధాలు ఆడి ఒక పెళ్ళి చెయ్యమన్నారు. కాని నేను మీడియా ద్వారా ఒక అబద్ధం ఆడించి జంటనగరాల్ని మతఘర్షణల మారణహోమం నుండి రక్షించుకున్నాను. వాస్తవంగా ఉపగ్రహం అనే వార్త మేం సృష్టించినదే తప్ప అది నిజం కాదు. మనిషిలోని రాక్షసత్వాన్ని రూపుమాపి మానవత్వం మేల్కొలపడానికే ఈ అసత్యం చెప్పించవలసి వచ్చింది. కొందరు స్వార్థపరులు తమ స్వప్రయోజనాల కోసం ఈ మతమనే ఆయుధాన్ని ఉపయోగించుకుని మారణహోమాన్ని సృష్టిస్తున్నారు. అలాంటి వ్యక్తులపట్ల మీరు ఎంతో అప్రమత్తంగా ఉండాలి. అలాగే ఈనాడు మీలో వెలిగిన జ్ఞానజ్యోతులు ఆరిపోకుండా జాలి, దయ, కరుణ, మానవత్వం అనే అరచేతుల్ని అడ్డుగా ఉంచండి. మరోసారి మిమ్మల్ని మనస్ఫూర్తిగా క్షమార్పణలు కోరుతూ మీ ముఖ్యమంత్రి" అంటూ ముగించాడు.

అప్పటివరకు ఆయన చెప్పినదంతా విన్న ప్రజలు దిగ్భ్రాంతికి గురయ్యారు. ఆయన ఆడించిన అబద్ధం విషయంలో అంతా హర్షం వ్యక్తం చేశారు. సమయస్ఫూర్తితో వ్యవహరించి జంట నగరాల ప్రజలు మత దావాగ్నిలో శలభాల్లా మలమల మాడి మసికాకుండా ఆయన కాపాడినందుకు మనసులోనే అంతా ధన్యవాదాలు తెలియజేసుకున్నారు.

ప్రధానమంత్రి మళ్ళీ ముఖ్యమంత్రి గారికి ఫోన్ చేశారు.

"మేము మీకిచ్చిన గడువు ఇరవైనాలుగు గంటలు. కాని మీరు కేవలం ఒక గంట

లోనే ఎంతో బుద్ధికుశలతతో ఒక మారణ కాండను తెలిగ్గా నివారించారు. ఎన్నో వేల ప్రాణాలు బలికాకుండా కాపాడగలిగారు. ఈ విషయంలో మిమ్మల్ని మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను" అన్నాడు.

"థ్యాంక్యూ సార్" అన్నాడు ముఖ్య మంత్రి.

"నేను అలా కఠినంగా మాట్లాడి మీ మనసు గాయపరిచినందుకు నన్ను మన్నిం చండి" అన్నారు ప్రధానమంత్రి గారు నొచ్చు కుంటూ.

"అబ్బే అదేం లేదన్సర్" అన్నారు ముఖ్య మంత్రి.

"ఉంటాను" చెప్పి ఆయన ఫోను పెట్టే శాడు. అదేరోజు పత్రికా విలేఖర్లు, టి.వి. రిపోర్టర్లు ముఖ్యమంత్రి గారిని ఆయన ఛాంబరులో కలిశారు. అక్కడ జరిగే ఇంటర్వ్యూ టి.వి.కి సంబంధించిన అన్ని తెలుగు ఛానల్స్‌లో ప్రత్యక్ష ప్రసారం కాసా గింది.

"మీరు ఎంతో తెలివిగ్గా, ఎవరూ ఊహిం చని విధంగా జంటనగరాల్లో ఏర్పడిన విప త్కర పరిస్థితుల్ని చక్కబెట్టారు కదా! ఇంత మహత్తరమైన ఆలోచన మీకెలా వచ్చింది? " ఒక విలేఖరి కుతూహలంగా అడిగాడు.

ఆయన చిర్నవ్వు నవ్వాడు.

"ఇది నా గొప్పతనంకాదు"

"మరి"

"నాకు ఏంచేయాలో దిక్కుతోచని పరిస్థి తిలో వుండగా సుందరయ్యగారు ఒక వ్యక్తిని నా దగ్గరికి తీసుకొచ్చారు. ఆ వ్యక్తి చెప్పిన ఉపాయమే ఈ ఉపగ్రహం ఆలో చన" అన్నాడాయన.

"ఎవరతను? " అందరిలో అమితాసక్తి.

"అజ్ఞాత వ్యక్తి"

అంతా దిమ్మెరపోయారు.

"అతనెవరో కనీసం మీరైనా చెప్తారా? " అంతా ఆశగా అడిగారు.

ఆయన సన్నగా నవ్వాడు.

"సారీ"

"ఎన్నో గొప్ప పనులు చేస్తూ అందరి మనసుల్లో అభిమానం సంపాదించుకున్న అతనెవరో తెలుసుకోవాలని, అతన్ని చూడా లని రాష్ట్ర ప్రజలంతా ఎంతో ఆరాటపడుతు న్నారు. అతను ఒక్కసారి బయటకు వచ్చి వాళ్లందరి కోరిక నెరవేర్చవచ్చు కదా" ఒక విలేకరి అడిగాడు.

"అది అతని వ్యక్తిగత విషయం" అన్నాడు ముఖ్యమంత్రి గారు.

అదే సమయంలో టి.వి.లో ఆ ఇంటర్వ్యూ చూస్తూన్న ఓంప్రకాశ్ చేతిలోని విస్కీ బాటిల్ని టి.వి. స్క్రీన్‌వైపు గురిచూసి ఆవేశంగా విసిరాడు. స్క్రీన్ భళ్లున బద్ద లైంది.

"అజ్ఞాత వ్యక్తి... అజ్ఞాత వ్యక్తి... అజ్ఞాత వ్యక్తి అడుగడుగునా మన పథకాలకు అడ్డు పడుతూ అనుక్షణం మనం ఖంగుతినేలా చేస్తున్నాడు. వాడి మూలంగా మనం ప్రతి విషయంలో కూడా ఓటమిని చవిచూ స్తున్నాం" పళ్లు పటపట కొరుకుతూ అన్నాడు ఓంప్రకాశ్.

"అవును అన్నయ్యా! నేను హాస్టల్లో అరెస్టు కావడానికి, ఆ తర్వాత నువ్వు ఆ సుందరయ్య చేతిలో అతిదారుణంగా ఓడి పోవడానికి, ఇప్పుడు అధికార పార్టీ మతఘ ర్షణల మూలంగా పడిపోయే పరిస్థితిలో ఉండగా అడ్డుచక్రం వేసి ఆదుకుని మన పథకం మొత్తం దెబ్బతినడానికి ప్రధాన కారకుడు ఆ అజ్ఞాత వ్యక్తి. అతనెవరో తెలిస్తే బావుండు. ముక్కలు ముక్కలుగా నరికేవాడిని" అన్నాడు పాండు కసిగా.

"అవునూ... ఇంతకీ అసలు ఆ అజ్ఞాత వ్యక్తి ఎవరు? " అయోమయంగా అడిగాడు ఉస్మాన్.

గ్లాసులో విస్కీ పోసుకుని సోడా కలుపు కోకుండానే ఒక గుక్కలో ఆ విస్కీని తాగిన ఓంప్రకాశ్ గ్లాసు నేలకేసి కొట్టి క్రూరంగా

చూశాడు. ఆయన కళ్లు చింతనిప్పుల్లా ఉన్నాయి.

"తెలుస్తుంది. వాడెవడో తెలుస్తుంది. వాడిని బయటకు రప్పించడమే కాదు, మన కసితీరేలా వాడిని చిత్రహింసలు పెట్టి మరీ చంపుదాం. ఈ ఓంప్రకాశ్ పథకం వేస్తే పాతాళంలో ఉన్నవాడు సైతం బయటకు రావాల్సిందే" అన్నాడు ఓంప్రకాశ్ కర్కశంగా.

"ఎలా అతన్ని బయటకు రప్పించడం? " ఉస్మాన్ అడిగాడు.

ఓంప్రకాశ్ పెదవుల మీద పైశాచికత్వంతో కూడిన చిర్నవ్వు కదలాడింది.

ఆయన తన మనసులోని పథకాన్ని వివరించాడు. పాండు, ఉస్మాన్‌ల మొహాలు వెలిగిపోయాయి.

"ఒక దెబ్బకు రెండు పిట్టలు అంటే ఇదే కాబోలు. అజ్ఞాత వ్యక్తి చావడం, మళ్లీ ఎలక్షన్లు రావడం ఒకేసారి జరుగుతాయన్న మాట" అన్నాడు ఉస్మాన్ ఉత్సాహంగా.

"అద్భుతంగా ఉందన్నయ్యా... ఈ పథకం. దీనిలో నేను కూడా పాలుపంచుకుంటాను" హుషారుగా అన్నాడు పాండు.

"వద్దు" వారించాడు ఓంప్రకాశ్.

"ఎందుకని? " ఆశ్చర్యంగా అడిగాడు పాండు.

"ఈ పథకంలో మన ప్రమేయం ఉన్నట్టు ఎవరికీ తెలియకూడదు. ఇదంతా కేవలం ఉగ్రవాదుల చర్యగా అంతా భావించాలి. మనం ఉగ్రవాదుల ఘాతుకాన్ని ఖండిస్తూ ప్రకటనలు ఇవ్వడమే కాకుండా ప్రభుత్వం యొక్క అసమర్థతని దుయ్యబట్టాలి" అన్నాడు ఓంప్రకాశ్. అందులో అంతర్లీనంగా ఇంత విషయం వుందని ఊహించని పాండు తన అన్న వంక ఆరాధనా పూర్వకంగా చూశాడు.

"అయితే నేను ఈ రోజే రంగంలోకి దిగుతాను" అన్నాడు ఉస్మాన్.

"మంచిది' అన్నాడు ఓంప్రకాశ్.

★ ★ ★

పెద్దాపురం, చిలకలూరిపేటల నుండి దరిదాపుగా ఒక వందమంది యువతుల్ని రప్పించి నడిరోడ్డుమీద ధర్నా చేయించసాగాడు ఓంప్రకాశ్.

అప్పుడే గండిపేటకు వనభోజనాల కోసం ఒక ప్రత్యేక బస్సుల్లో యాభైమంది వరకు ఎమ్మెల్యేలు బయల్దేరారు. వాళ్లకు సంబంధించిన భద్రతా సిబ్బంది వెనుక వ్యానులో అనుసరించసాగారు.

యువతులు ధర్నా చేసే ప్రదేశానికి రాగానే అక్కడ ట్రాఫిక్ జామ్ అయివుండటంతో బస్సు ఆపాడు డ్రైవరు.

విషయం తెల్సిన ఎమ్మెల్యేలు బస్సు దిగి ఆ యువతుల దగ్గరికి వెళ్లబోతుంటే భద్రతా సిబ్బంది వాళ్ల వెంట రాబోయారు.

"మేము వెళ్లేది అభాగ్యులైన ఆడవాళ్ల దగ్గరికి గాని భద్రాచలం అడవుల్లోకి కాదు. మీరు ఇక్కడే ఉండండి" అని ఆ ఎమ్మెల్యేలు భద్రతా సిబ్బంది మీద మండిపడ్డారు.

దాంతో ఆ భద్రతా సిబ్బంది మొహాలు చిన్నబోయాయి.

ఎమ్మెల్యేల్ని చూడగానే తన స్వరాల్ని పెంచారు యువతులు.

"ఆడది అర్ధరాత్రి సైతం నిర్భయంగా నడిరోడ్డు మీద తిరగగలగాలి"

"ఆడవాళ్లమీద జరిగే అత్యాచారాలు నశించాలి"

అని బిగ్గరగా నినాదాలు చేయసాగారు.

ఒక ఎమ్మెల్యే మైకు అందుకుని "మీకు వచ్చిన సమస్యేమిటో చెప్పండి. ఇక్కడికక్కడే పరిష్కరిస్తాను. మీకు తగిన న్యాయం జరిపిస్తాను" అని హామీ ఇచ్చాడు.

ఒక యువతి లేచి జారిపోతున్న పైటను



చెప్పదగ్గది ఏమీలేనప్పుడు నిశ్శబ్దం ఎంతో చక్కగా మాట్లాడుతుంది. - లోవె

సవరించుకుంటూ "నన్ను ఒకతను పెళ్లి చేసుకుంటానని నమ్మించి నా శీలాన్ని దోచుకున్నాడు. దయచేసి నా శీలాన్ని నాకు తెచ్చిపెట్టండి" అంది.

ఆ ఎమ్మెల్యే గతుక్కుమన్నాడు.

"నీ శీలాన్ని నేను ఎక్కడనుండి తెచ్చేది తల్లీ! అదేమైనా కొట్లో దొరికే వస్తువా? కొని తీసుకురావడానికి" అన్నాడు నిస్పృహాయంగా.

"మరి అలాంటప్పుడు ఏ సమస్యనైనా ఇట్టే పరిష్కరిస్తాను. మీకు తక్షణం న్యాయం జరిపిస్తాను లాంటి వెధవ బిల్డప్‌లు ఇవ్వొద్దు" అంది వ్యంగ్యంగా.

ఆయన మొహం పాలిపోయింది. వెంటనే పక్కనే ఉన్న ఒక ఎమ్మెల్యేకి మైకు అందించి పక్కకు తప్పుకున్నాడు.

మైకు అందుకున్న ఎమ్మెల్యే బిగ్గరగా "అక్కలారా... నా చెల్లెళ్లలారా..." అని మొదలుపెట్టాడు.

మరుక్షణం ఒకామె లేచి సీరియస్‌గా అభ్యంతరం చెప్పింది. "మీరు అలా అందర్నీ ఉద్దేశించి అంటే మీ కళ్లు పోతాయి. నన్ను గుర్తుపట్టలేదనుకుంటా మీరు. ఆమధ్య ఓసారి మీరు పెద్దాపురం పూలవీధిలో ఉన్న పంకజం కంపెనీకి వచ్చినప్పుడు, నామీద మనసుపడి..." అంది పరిహాసంగా.

అంతా పకపకా నవ్వారు. ఆ ఎమ్మెల్యే మొహం గంటుపెట్టుకుని పక్కకు తప్పుకున్నాడు.

అదే సమయంలో ఆ యువతుల మధ్యలో ఆడవాళ్లలా వేషం వేసుకుని అప్పటివరకు నిశ్శబ్దంగా కూర్చుని ఉన్న ఓ పదిమంది ఉగ్రవాదులు మెరుపువేగంతో పైకి లేచి తమ చేతుల్లో ఉన్న అత్యాధునిక ఆయుధాల్ని ఆ ఎమ్మెల్యేలకి గురిపెట్టారు.

ఊహించని ఆ పరిణామానికి ఎమ్మెల్యేలు నిర్ఘాంతపోయారు. ప్రమాద పరిస్థితిని గమనించిన భద్రతా సిబ్బంది పరుగున అక్కడికి రాబోయారు.

"ఒక్కడుగు ముందుకు వేశారో ఈ ఎమ్మెల్యేల శరీరాల్లోకి బుల్లెట్లు నిర్దాక్షిణ్యంగా దూసుకుపోతాయి. ఆ తర్వాత ఏమాత్రం విచారించినా ఫలితం ఉండదు" అని ఆ ఉగ్రవాదులు ఆ భద్రతాసిబ్బందిని తీవ్రంగా హెచ్చరించారు.

దాంతో ఆ భద్రతా సిబ్బంది నిస్పృహాయంగా నిలబడిపోయారు. వాళ్లకు ఏం చేయాలో దిక్కుతోచలేదు.

"మీ దగ్గర ఉన్న ఆయుధాలన్నీ కింద పడేయండి" ఆదేశించాడు ఒక ఉగ్రవాది.

ఇక తప్పని పరిస్థితిలో తమ దగ్గర ఉన్న ఆయుధాలన్నీ కింద పడేశారు భద్రతా సిబ్బంది. ఆ ఆయుధాలన్నింటినీ ఉగ్రవాదులు స్వాధీనపరుచుకున్నారు. ఇలాంటి పరిస్థితి దాపురించడానికి కారణమైన ఎమ్మెల్యేలందరిమీద పీకలదాకా కోపం ముంచుకొచ్చింది భద్రతా సిబ్బందికి.

ఎమ్మెల్యేల్నందర్నీ బలవంతంగా బస్సెక్కించి బస్సుని ముందుకి పోనిచ్చారు ఉగ్రవాదులు. ఆ బస్సు నగరానికి వంద కిలోమీటర్ల దూరంలో నిర్జనంగా ఉన్న ప్రదేశంలో ఒంటరిగా ఉన్న ఓ పాత నవాబుల కోట ముందాగింది. ఆ ఎమ్మెల్యేల్నందర్నీ ఆ కోటలోనే బంధించారు.

★ ★ ★

రాజు, పట్టాభి సెకండ్ షో సినిమాకి వెళ్లి రాత్రి పన్నెండు గంటల ప్రాంతంలో థియేటరులోంచి బయటకు వచ్చారు.

"ఈరోజు కాకపోతే ఓ పదిరోజులు పోయిన తర్వాత చూసేవాళ్లం కదా సినిమా! అనవసరంగా బ్లాక్‌లో టిక్కెట్లు కొన్నావు. ఎంత దండగ" అన్నాడు రాజు మందలింపుగా.

"ఏ సినిమా అయినా మొదటిరోజు

నీ అదృష్టానికి, దురదృష్టానికి నేవే కర్తవని తెలుసుకో
– అలెగ్జాండర్ పోప్

చూస్తేనేగానీ నాకు సంతృప్తి అన్పించదు. ఆ విషయంలో నేను డబ్బుగురించి అసలు ఆలోచించను" అన్నాడు పట్టాభి.

రాజు చిన్నగా నవ్వాడు.

"అసలు ఈ బ్లాక్ టిక్కెట్లు థియేటరు ఓనరే అమ్మిస్తున్నాడు గురూ! ఒక పదో పది హేనో టిక్కెట్లు మాత్రమే క్యూలో ఉన్న వాళ్లకి ఇచ్చి మిగిలినవన్నీ లాభాలకు అమ్ముకుంటాడు. ఈ థియేటరు యజమాని పరమ రోగ్ గురూ" అన్నాడు.

"అలాగా" అన్నాడు రాజు నిరాసక్తంగా. ఇద్దరూ రోడ్డుమీద నడుచుకుంటూ వస్తున్నారు.

"నేను ఏదో ఒక ఆటో చూసుకుని హాస్టలుకి వెళతాను. నువ్వు లాడ్జికి వెళ్లు" అన్నాడు రాజు.

★ ★ ★

"రాజూ! నువ్వు చేసిన పనేం బాగాలేదు" మొహం గంటు పెట్టుకుని అసంతృప్తిగా అంది అంకిత.

"నేనేం చేశాను? " అయోమయంగా అడిగాడు రాజు.

"క్రితం రోజు రాత్రి నువ్వు పట్టాభితో కలిసి సెకండ్ షో సినిమాకి వెళ్ళావా లేదా? " నిలదీసింది.

"వెళ్ళాను"

"సినిమాకి వెళ్తుంటే మేం ఎవ్వరం నీకు గుర్తుకు రాలేదా? " అనడిగింది అంకిత నిష్ఠూరంగా.

మిమ్మల్నందర్నీ రేపు సినిమాకి తీసుకువెళతాను" అని హామీ ఇచ్చాడు.

అమ్మాయిలందరి మొహాలు వికసించాయి. అప్పుడే అక్కడికి పట్టాభి వచ్చాడు. "ఎలా గురూ! ఇంతమందికి బ్లాక్‌లో కూడా టిక్కెట్లు దొరకవు. నువ్వు అనవసరంగా వీళ్ళకి మాటిచ్చావు" అన్నాడు.

రాజు పట్టాభిని దగ్గరకు పిలిచి అతని చెవిలో గుసగుసగాఏదో చెప్పాడు. పట్టాభి మొహం వికసించింది.

"ఎంత గొప్ప ఉపాయం చెప్పావు గురూ! నీ అమోఘమైన తెలివితేటలమీద అపారమైన నమ్మకం ఉండి కూడా నేను అనుమానం వ్యక్తం చేశానంటే నా అంతటి మూర్ఖుడు మరొకరు ఉండరదనుకుంటా" అన్నాడు నొచ్చుకుంటూ.

"నువ్వు మూర్ఖుడివన్న సంగతి ఇప్పుడు తెల్సుకున్నావా? నిన్ను చూసిన మరుక్షణమే మాకు నీమీద అలాంటి అభిప్రాయమే ఏర్పడింది. ఎర్రగడ్డలో ఉండాల్సిన శాల్తీ ఇక్కడికెలా వచ్చిందా అని ఆశ్చర్యపోయాం" అంది దివ్య నవ్వుతూ.

పట్టాభి మొహం చిన్నబుచ్చుకున్నాడు.

"మాకో సాయం చేసి పెడతావా? " అడిగింది అంకిత గంభీరంగా.

"అదేమిటో చెప్పు" అన్నాడు పట్టాభి.

"మా హాస్టలుకి ఎదురుగా రోడ్డు పక్కన మాకు తెల్సిన వాళ్ళు ఒక పెద్ద బిల్డింగు కడుతున్నారు. బిల్డింగు పూర్తయ్యేవరకు ఆ బిల్డింగు ముందు ఒక దిష్టిబొమ్మని వేలాడదీయాలనుకుని ఓ మంచి దిష్టిబొమ్మ ఉంటే చూడమని మాకు చెప్పారు. నువ్వు ఎలాగూ దిష్టిబొమ్మలా ఉంటావు కాబట్టి ఆ బిల్డింగు పూర్తయ్యేవరకూ నువ్వే ఒక దిష్టి బొమ్మలా ఆ బిల్డింగు ముందు వేలాడకూడదూ! ఎలాగూ నీకు పనీపాటా లేదు కాబట్టి వాళ్ళ నుండి నీకు ఎంతో కొంత డబ్బు ఇప్పిస్తాం" అంది అంకిత.

అమ్మాయిలంతా పకపక నవ్వారు.

పట్టాభికి వళ్ళు మండిపోయింది. కాని తమాయించుకుని ఎక్కడి నుంచో దూది తెచ్చుకుని రెండుచెవుల్లో పెట్టుకున్నాడు.

"ఇక ఏం వాక్కుంటారో వాక్కోండి. నాకు మాత్రం ఒక్కముక్క కూడా విన్పించదు" అన్నాడు హుషారుగా.

అమ్మాయిలు ఒకర్నొకరు చూసుకున్నారు.

"పాపం ఏం చేయాలో తోచడంలేదను

కుంటా" కవ్విస్తూ అన్నాడు పట్టాభి.

అమ్మాయిలకు చిర్రెత్తుకొచ్చింది.

అంకిత మౌనంగా తన సంజ్ఞల ద్వారా అతనికి గుండుకొట్టించి సున్నంబొట్లు పెట్టి, ఎలా గాడిదమీద ఊరేగించేది వివరంగా చెప్పింది.

అమ్మాయిలంతా అభినందనగా చప్పట్లు కొట్టారు. పట్టాభి మొహం అరకిలో వేపకాయలు, ఓ కేజీ పచ్చి కాకరకాయలు తిన్నట్టుగా వికారంగా పెట్టాడు. అంతలోనే దివ్య అతన్ని తామంతా కలిసి బలవంతంగా ఫానుకి ఉరితీస్తే అప్పుడు అతని శవం ఎలా వ్రేలాడుతుందో ఆ దృశ్యాన్ని కన్నుల పండుగగా అభినయించి చూపించింది.

పట్టాభి ఏడుపు మొహం పెట్టాడు.

"ఈవిధంగా కూడా మనుషుల్ని హింసించవచ్చున్న సంగతి నాకు అర్థమైంది. మీమధ్య వుండేకన్నా కాశ్మీర్ బోర్డరులో ఆ మిలిటెంట్లతో కూర్చుని బాంబులతో బాడ్మింటన్ ఆడుకోవడం చాలా బాగుంటుంది" అన్నాడు పట్టాభి విరక్తిగా.

★ ★ ★

ఆ రాత్రి పట్టాభి ఒక యాభై ఏళ్ళ క్రితం నాటి 'స్త్రీ పాతివ్రత్యం' అనే చిత్రం తాలూకూ వాల్ పోస్టర్లు సంపాదించాడు. ఆ విషయం హాస్టలుకి వచ్చి రాజుతో చెప్పాడు. అర్థరాత్రి పన్నెండు గంటల తర్వాత రాజు పట్టాభి ఒక బక్కెట్టు నిండా మైదా, నిచ్చెన, వాల్ పోస్టర్లు తీసుకుని బయల్దేరారు. ముందుగా కొత్త సినిమా ఆడుతున్న థియేటరు దగ్గర ఆగి అటూ ఇటూ చూశారు. అంతటా నిశ్శబ్దంగా, నిర్మానుష్యంగా ఉంది. థియేటరు గేట్లు వేసి ఉన్నాయి. థియేటరు సిబ్బంది లోపల ఎక్కడో ఆదమరిచి నిద్రపోతున్నారు.

ఇద్దరూ సరంజామా అంతా తీసుకుని ఆ థియేటరు ప్రహరీగోడ దగ్గరికి వచ్చారు. ఆ ఏభై ఏళ్ళనాటి 'స్త్రీ పాతివ్రత్యం' తాలూకు సినిమా వాల్ పోస్టర్లని ఇప్పుడు ఆడుతున్న కొత్త సినిమా వాల్ పోస్టర్లమీద అంటిం

## నువ్వే పంపు



ఢిల్లీలోని ఒకాయన అమృత్‌సర్‌లోని తన స్నేహితుడి పీపీ నెంబరుకు ఫోన్ చేశాడు. కుశల ప్రశ్నలు అయ్యాక 'ఒరే.. నేను చాలా కష్టాల్లో ఉన్నాను. అయిదొందలుంటే సర్దు.. వచ్చేనెల పంపిస్తా'అన్నాడు.

అప్పటిదాకా నవ్వుతూ మాట్లాడిన స్నేహితుడు 'హలో... హలో.. ఏమిటి? లైన్లు సరిగా లేనట్లున్నాయి? ఏం వినబడడం లేదు' అని అరిచాడు.

అతను పదేపదే ఫోన్‌లైన్‌లు బాగోలేదనడం వింటున్న ఆ ఇంటియజమాని రిసీవర్ తీసుకుని ఢిల్లీ ఆయనతో మాట్లాడాడు. తర్వాత, 'మీ ఫ్రెండ్ ఐదొందలు అప్పడుగుతున్నాడు.. ఫోన్ బాగోలేదంటావేంటి? భేషుగ్గా ఉంటేను..' అంటూ తిరిగి రిసీవర్ స్నేహితుడికి ఇవ్వబోయాడు. కానీ అతను దాన్ని తీసుకోకుండా 'సరే.. నీకంత బాగా వినబడితే వాడడిగిన ఐదొందలేదో నువ్వేపంపెయ్' అంటూ లేచి విసవిస వెళ్లిపోయాడు.

చారు. చూసేవాళ్ళకు ఆ థియేటరులో ఇప్పుడు 'స్త్రీ పాతివ్రత్యం' అనే బ్లాక్ అండ్ వైట్ సినిమా ఆడుతుందనే భావన తప్పక కలుగుతుంది. రాజు పట్టాభి సంతృప్తిగా ఆ వాల్‌పోస్టర్ల వంక చూసి అక్కడ నుండి కదిలారు. సిటీలో ఆ థియేటరుకి సంబంధించిన అన్ని వాల్‌పోస్టర్ల మీద ఆ పాత సినిమా వాల్‌పోస్టర్లు అంటించారు రాజు పట్టాభి. తెల్లవారుజామున మూడు గంటల ప్రాంతంలో హాస్టలుకి చేరుకుని అప్పుడు స్నానం చేసి పడుకున్నారు.

ఉదయం ఏడు గంటలకి నిద్రలేచిన రాజుని అడిగారు అమ్మాయిలు.

"ఈ రోజు ఉదయం మమ్మల్ని మార్నింగ్ షోకి తీసుకువెళ్తానన్నావు కదా! ఏమైంది? "

"మా గురువుగారు మాటిచ్చాడు అంటే అది వెనక్కి తీసుకోవడం అంటూ ఉండదు. మీరు ఆ విషయంలో ఎలాంటి సందేహాలు పెట్టుకోనవసరం లేదు" అన్నారు పట్టాభి.

"నిజమేనా? " అమ్మాయిలు రాజువైపు చూశారు. "మీరు రెడీ అవండి. మార్నింగ్ షోకి వెళదాం" అన్నాడు రాజు.

అమ్మాయిలంతా ఎంతో ఉత్సాహంగా అక్కడ నుండి కదిలారు. స్నానాలు చేసి డ్రెస్సింగ్ టేబుల్స్‌ముందు కూర్చుని అందంగా ముస్తాబై ఆ తర్వాత క్యాంటీన్‌కి వెళ్ళి టిఫిన్ చేసి వచ్చారు.

"మేం రెడీ" అన్నారు రాజుతో.

అంతకుముందే రాజు, పట్టాభి తయారై సిద్ధంగా వున్నారు.

"అయితే పదండి" అన్నారు రాజు.

అప్పుడే ఏదో ముఖ్యమైన విషయం గుర్తుకొచ్చిన వాడిలా పట్టాభి "గురూ! మీరు థియేటరుకి వచ్చేయండి. నాక్కాస్త పనుంది. అది చూసుకుని అట్నుంచి అటే థియేటరుకి వస్తాను" అన్నాడు.

"సరే నీ ఇష్టం" అన్నాడు రాజు.

పట్టాభి వెళ్ళిపోయాడు. రాజు అమ్మాయిల్నందర్నీ వెంటబెట్టుకుని హాస్టల్నుండి బయటకు వచ్చాడు. అంతా రోడ్డుమీద నడవసాగారు.

చుక్కల్లో చంద్రుడిలా రాజు ఆ మెరుపు తీగల మధ్య వెలిగిపోతున్నాడు. అమ్మాయిలు రకరకాల అధునాతన దుస్తుల్లో మిలమిలా మెరిసిపోతున్నారు. షాపుల్లో, దుకాణాల్లో, రోడ్ల పక్కన, బస్టాపుల్లో నిలబడి వున్న జనమంతా విభ్రాంతిగా వాళ్ళని చూడసాగారు.

ఏ అబ్బాయికైనా వుంటే ఒక గర్ల్‌ఫ్రెండు వుంటుంది. కాని ఇతనకేమిటి దరిదాపుగా ఓ వందమంది మెరుపుతీగల్లాంటి అమ్మాయిలు గర్ల్‌ఫ్రెండ్సుగా వున్నారు. నిజంగా ఇది ఓ అద్భుతమయిన విషయమే అనుకున్నారు అంతా.

కుర్రకారు మనసులు రాజుపట్ల అసూయతో భగ్గుమనసాగాయి. అయితే వాళ్ళ చూపుల్ని భావాల్ని ఏమాత్రం పట్టించుకోకుండా రాజు ఆ అమ్మాయిలు కబుర్లు చెప్పుకుంటూ ముందుకు నడవసాగారు.

అప్పుడే అటుగా ఓ సబ్బుల కంపెనీ యజమాని కారులో వెళ్తూ రాజుని, ఆ వందమంది అమ్మాయిల్ని చూశాడు. వెదకబోయిన తీగేదో కాలికి తగిలిన భావన కలిగిందాయనకి. మరుక్షణం కారాపి కిందకి దిగి ఆయన రాజు వాళ్ళ వద్దకు వచ్చాడు.

"మీరంతా ఎవరు? " అమ్మాయిల్ని అడిగాడు.

"మేము మీ కళ్ళకు కాలేజి స్టూడెంట్సులా కన్పించడంలేదా? " అంది దివ్య గడుసుగా.

"కాలేజీ అమ్మాయిల్లానేకాదు అందమైన సీతాకోక చిలుకల్లా కూడా అన్పిస్తున్నారు. అద్సరే, ఆ అబ్బాయి ఎవరు? " అని రాజుని చూపించి అడిగాడాయన.

"మా ఫ్రెండు" అంతా ముక్త కంఠంతో అన్నారు.

"అయితే మీరంతా నాకో సహాయం చేయాలి" అన్నాడు అర్థింపుగా.

"ఏమిటది? " రాజు అడిగాడు.

"నేను ఒక సబ్బుల కంపెనీకి యజమానిని. మా కంపెనీ మార్కెట్టు పెరగడానికి ఒక యాడ్ ఫిల్ము తీసి దాన్ని అన్ని టి.వి ఛానల్స్ లో ప్రసారం చేయించాలనుకుంటున్నాం. కాని ఆ యాడ్ ఫిల్మ్‌కి సరిపడే అందమైన అమ్మాయిలు, అబ్బాయి ఇంత వరకు మాకు దొరకలేదు. అయితే మిమ్మల్ని చూశాక మిమ్మల్ని మించిన వాళ్ళు ఇంకెక్కడా దొరకరని నాకు అన్పించింది. నిజం చెప్పాలంటే ఈ రోజు మీరు తారసపడటం నా అదృష్టం. దయచేసి మీరు అంగీకరిస్తే మీ అందరితో ఒక యాడ్ ఫిల్మ్ తీసుకుంటాను. అందుకు ప్రతిఫలంగా మీకు ఒక లక్ష రూపాయలు ఇస్తాను" అన్నాడు.

అమ్మాయిలు అసహనంగా చూశారు. రాజు మాత్రం ఆలోచనలో పడ్డాడు.

"యాడ్ ఫిల్మ్ వద్దు. గాడిద గుడ్డూ వద్దు. పద రాజూ పోదాం" అంది మిథిల చిరాకుగా.

ఆ యజమాని కలవరపడ్డాడు.

"అంత మాటనకండి. కావాలంటే మరో యాభైవేలు అదనంగా ఇస్తాను" అన్నాడాయన ప్రాధేయపడుతూ.

అంకితకు చిర్రెత్తుకొచ్చింది.

"మీ కళ్ళకి మేమంతా ఎలా కన్పిస్తున్నాం? వేషాలేసుకుని డబ్బులు సంపాదించే డ్రామా కంపెనీ వాళ్ళలా అనిపిస్తున్నామా? అందుకు వేరే వాళ్ళుంటారు వాళ్ళని చూసుకో. అంతేగాని మా వెంట పడి మమ్మల్ని వేధించకు" అంటూ కస్సుమంది అంకిత.

"ప్లీజ్ అలా అనకండి. మీలాంటి వాళ్ళు నటిస్తేనే మా కంపెనీ ఉత్పత్తి చేసే సోప్స్‌కి బాగా గిరాకీ వస్తుంది. తండ్రిలాంటి వాడిని అర్థిస్తున్నాను. కాదనకండి" అన్నాడు దీనంగా.

"నీక్కాదూ చెప్పేది తప్పుకో" కసిరింది దివ్య.

ఆయన ముఖం వాడిపోయింది.

అమ్మాయిలు అక్కడనుండి కదలబోతుంటే రాజు అన్నాడు "ఆగండి"

అమ్మాయిలంతా ఆగి అతనివంక ప్రశ్నార్థకంగా చూసారు.

"మనం ఈ యాడ్ ఫిల్మ్‌లో నటిద్దాం" అన్నాడు రాజు.

అమ్మాయిలు దిమ్మెరపోయారు.

"నీకు మతిగానీ పోయిందా రాజూ! మనమేమిటి యాడ్ ఫిల్మ్‌లో నటించడమేమిటి. వద్దు. పద వెళ్దాం" అంది మిథిల వారిస్తూ.

"అది కాదు మిథిలా! ఆయన లక్షాయాభై వేల రూపాయలు ఇస్తామంటున్నారు కదా! అంత డబ్బుని పోగొట్టుకోవడం దేనికి? ఒక పది నిమిషాలు నటిస్తే సరిపోతుంది కదా!" అన్నాడు సర్ది చెప్తూ.

అమ్మాయిలు నిర్ఘాంతపోయారు. రాజు అలా డబ్బుకి ఆశపడతాడని వాళ్ళు కలలో కూడా ఊహించలేదు.

"అంటే ఏమిటి నీ ఉద్దేశ్యం? డబ్బుకి కక్కుర్తి పడి మమ్మల్ని నటించమంటావా? " గయ్యిమంది మిథిల.

"నువ్వు ఎలాగైనా అనుకో మిథిలా! ఈ ఒక్కసారికి మాత్రం నా మాట మన్నించు. ఇంకెప్పుడూ జీవితంలో నిన్నేమీ అడగను" అన్నాడు రాజు వేడుకోలుగా.

ఆమెకు, మిగిలిన అమ్మాయిలకి ఆ పరిస్థితి చాలా చిరాకుగా, ఇబ్బందిగా అన్పించింది. ఆ పరాయి వ్యక్తి ముందు ఘర్షణ పడటం ఇష్టంలేక అయిష్టంగానే ఆ యాడ్ ఫిల్ములో నటించడానికి అమ్మాయిలు అంగీకరించారు. కాని రాజు మీద మాత్రం వాళ్ళందరికీ విపరీతమైన కోపంగా ఉంది. లక్షాయాభైవేల రూపాయల కోసం అతను కక్కుర్తిపడుతున్నాడనే భావన అందరిలో ఏర్పడిపోయింది.

సబ్బుల కంపెనీ యజమాని అమ్మాయి

లంతా నటించడానికి ఒప్పుకోగానే చాలా సంతోషించాడు.

"మీరు తీసే ఫిల్ము ఒక అరగంటలో అయిపోవాలి. ఎందుకంటే మేమంతా మార్నింగ్ షో సినిమాకి వెళ్ళాలి" అని రాజు ఆయన్ని హడావుడి చేశాడు. ఆయన వెంటనే సెల్ ఫోన్‌లో తమకి సంబంధించిన యూనిట్‌కి ఫోన్ చేసి తను ఏ ఏరియాలో వున్నదీ వివరించి అక్కడికి ఓ అయిదు నిమిషాల్లో రమ్మని చెప్పాడాయన. ఆయన చెప్పినట్లుగానే ఆ యూనిట్ మొత్తం వెంటనే అక్కడికి తరలి వచ్చింది. కెమేరామేన్, డైరెక్టరు, రైటరు, ఇతర సిబ్బంది ఆగిన వ్యాను లోంచి కిందకు దిగారు. వాళ్ళందరికీ రాజుని, అమ్మాయిల్ని పరిచయం చేశాడు సబ్బుల కంపెనీ యజమాని.

"అమ్మాయిలు, అబ్బాయి చాలా అందంగా ఉన్నారు సార్. సినిమా హీరోహీరోయిన్లు కూడా వీళ్ళ ముందు దిగదుడుపే. వీళ్ళతో గనక ఈ ఫిల్ము తీస్తే మీ కంపెనీ సేల్స్ విపరీతంగా పెరిగిపోతాయి" అన్నాడు డైరెక్టరు నమ్మకంగా.

ఆ యజమాని మనసు ఆనందంతో నిండిపోయింది. రాజుకి, ఆ అమ్మాయిలకి తాము తీయబోయే ఫిల్ము గురించి వివరించి వాళ్ళు ఎలా నటించాలో ఏం చేయాలో చెప్పాడు డైరెక్టరు. అమ్మాయిలు, రాజు అర్థమైనట్టుగా తలలూపారు.

షూటింగ్ ప్రారంభమయింది.

ఉమెన్స్ కాలేజీ గేటు ముందు ఉన్న బస్టాప్ దగ్గర చాలా మంది అబ్బాయిలు నిలబడి ఉన్నారు. మరి కొంత మంది అబ్బాయిలు తాము వేసుకొచ్చిన మోటర్ బైకుల మీద అలాగే స్టైలుగా కూర్చుని ఉన్నారు. అప్పుడే ఉమెన్స్ కాలేజీకి అమ్మాయిలు గుంపులు గుంపులుగా వస్తున్నారు. రాజహంసల్లా, ఇంద్రలోకం నుండి దిగివస్తున్న దేవకన్యల్లా కదిలి వస్తున్న ఆ అమ్మాయిలకి అబ్బాయిలు అనేక రకాలుగా లైటింగ్ కొడుతున్నారు. అయినా వాళ్ళ ప్రయత్నాలేవీ ఫలించడంలేదు. కనీసం ఒక్క అమ్మాయి కూడా వాళ్ళల్లో ఏ ఒక్కరి వైపు చూసిన పాపాన పోలేదు. దాంతో అబ్బాయిలంతా ఎంతో నిరుత్సాహానికి గురయ్యారు. ఏది ఏమైనా ఒక్క అమ్మాయి మనసునైనా గెలుచుకోవాలన్న దృఢనిశ్చయంతో అబ్బాయిలు కాలేజీ క్లాసులు మొదలైనా కూడా కదలకుండా అక్కడే నిల్చున్నారు. పల్లీలు, మిరపకాయ బజ్జీలు మొక్కజొన్నపొత్తులు, కూల్‌డ్రింక్సు అమ్ముకునేవాళ్లతో అక్కడ సందడిగా ఉంది. అలాగే అడుక్కునేవాళ్లు కూడా ఎక్కడెక్కడి నుంచో అక్కడికి చేరుకుని అబ్బాయిల్ని తెగ విసిగిస్తున్నారు. కాలేజి వదిలేంతవరకు అబ్బాయిలకి ఆ నిరీక్షణ, ఆ ఇబ్బందులు తప్పవు మరి.

అదే సమయంలో ఏదో ఆఫీసులో ఇంటర్వ్యూ ముగించుకుని రాజు హడావిడిగా వస్తున్నాడు. ఎండన పడి రావడం చేత అతని మొహం జిడ్డుగా ఉంది. సరిగ్గా అప్పుడే అతనిముందు నుండి వేగంగా వెళ్లిన ఒక సబ్బుల కంపెనీ వ్యానులోంచి ఒక సబ్బు జారి అతని పాదాల దగ్గర పడింది. అప్రయత్నంగా వంగి అతను ఆ సబ్బును చేతిలోకి తీసుకున్నాడు. దాన్నుండి మనసుల్ని మత్తెక్కించి హృదయాలకు రెక్కలు తొడిగి ఏవో అపూర్వ లోకాలకు ఎగరేసుకుపోయే గమ్మత్తయిన పరిమళాలు వెలువడుతున్నాయి. ఒక్క క్షణం ఆ సబ్బు వంక చూసిన అతనికి మొహం కడుక్కోవాలనే ఆలోచన వచ్చింది. అతను అటూ ఇటూ చూశాడు. దూరంగా రోడ్డు పక్కన ఒక పబ్లిక్ ట్యాప్ కనిపించింది. అతను అటు నడిచాడు.

ఆ ట్యాప్ దగ్గర మొహాన్ని ఆ సబ్బుతో కడుక్కుని సబ్బుని కవరులో ఉంచి జేబులో



కోపంలో ఉన్న మనిషి నోరువిప్పి, కళ్లు మూసుకుంటాడు. - కాటో

పెట్టుకున్నాడు. కర్చీఫ్‌తో మొహం తుడుచుకుంటూ సిటీ బస్సు కోసం ఉమెన్స్ కాలేజీ ఎదురుగా ఉన్న బస్టాప్‌కి వచ్చి నిల్చున్నాడు. ఇప్పుడు అతని మొహం ఒక విధమైన తేజస్సుతో వెలిగిపోతోంది.

అతని జేబులో ఉన్న సబ్బు నుండి అపూర్వమైన పరిమళాలు గాల్లో వ్యాపించి తరంగాలుగా ప్రయాణించి ఉమెన్స్ కాలేజీలో క్లాసు రూముల్లో కూర్చుని లెక్చరర్స్ చెప్పే పాఠాల్ని శ్రద్ధగా వింటున్న అమ్మాయిల్ని ముప్పిరిగొన్నాయి. ఒక్కసారిగా అమ్మాయిల్లో కదలిక వచ్చింది. వాళ్లు ఊహించని మైకం ఏదో వాళ్లని కమ్మేసింది. ఒక విధమైన పారవశ్యానికి గురైన వాళ్లంతా అప్రయత్నంగా లేచి నిల్చుని లెక్చరర్స్‌తో మాట మాత్రమైనా చెప్పకుండా క్లాసు రూముల్లోంచి బయటకు పరుగుతీశారు. ఒక ప్రవాహంలా గేటు బయటకు వచ్చిన అమ్మాయిలందరి దృష్టి రాజుమీద పడింది. అక్కడున్న అబ్బాయిలందరి మధ్యలో పున్నమి నాటి చంద్రబింబంలా వెలిగిపోతున్న రాజు మొహం వాళ్లని ఎంతగానో ఆకట్టుకుంది. అతని జేబులో ఉన్న సబ్బు నుండి వెలువడే పరిమళాలు అయస్కాంతంలా వాళ్లని అతని దగ్గరకు లాక్కువచ్చాయి.

అమ్మాయిలంతా రెప్పవేయడం కూడా మర్చిపోయి అతనివైపు ఆరాధనగా, అపురూపంగా చూడసాగారు. అక్కడున్న అబ్బాయిలంతా వూహించని ఆ విచిత్ర పరిణామానికి దిగ్భ్రాంతులయ్యారు. తాము రోజూ పనిగట్టుకుని మరీ అక్కడికి వచ్చి రకరకాల స్టయిల్స్‌తో అమ్మాయిల్ని ఆకట్టుకోవడానికి శతవిధాలా ప్రయత్నిస్తున్నా ఇంతవరకు ఒక్క అమ్మాయి హృదయంలో కూడా స్థానం సంపాదించుకోలేకపోయారు. అలాంటిది ఈ వ్యక్తి ఈరోజే ఇక్కడికి వచ్చి అలా నిల్చున్నాడో లేదో ఇలా ఉమెన్స్ కాలేజి అమ్మాయిలంతా తనకోసం పడిచచ్చేలా చేశాడు. ఏమిటి ఇతనిలో ఉన్న గొప్పతనం? ఏం చూసి అమ్మాయిలు ఇతని కోసం అంతగా ఆరాటపడుతున్నారు? అని అక్కడున్న అబ్బాయిలంతా మనసుల్లో తర్జనభర్జనలు పడసాగారు.

"మీ మొహం ఇంత తేజస్సుగా ఉండటానికి, మీ నుండి అపూర్వమైన అద్భుతమైన పరిమళం వెలువడటానికి కారణం ఏమిటి?" ఒక అమ్మాయి కుతూహలంగా అడిగింది.

రాజు సన్నగా నవ్వాడు.

"ఇంతకుముందే నేను ఒక సోప్‌తో మొహం కడుక్కున్నాను. ఆ సోప్ ప్రభావం మూలంగా నాకు ఈ వర్చస్సు, పరిమళం లభించాయి" అన్నాడు. అమ్మాయిలంతా ఒకర్నొకరు చూసుకున్నారు.

"ఆ సోప్ పేరేమిటో చెప్తారా?" ఒక అమ్మాయి ఆసక్తిగా అడిగింది.

"గోల్డ్ డైమండ్" చెప్పాడు రాజు.

"ఇంతకుముందెప్పుడూ ఆ పేరు వినలేదు. ఆ సోప్‌ని చూడలేదు" అంది మరో అమ్మాయి.

"అయితే ఇప్పుడు చూడండి" అంటూ రాజు జేబులోంచి సోప్ తీసి ఇచ్చాడు. ఆ సోప్ నుండి వెలువడిన పరిమళానికి అమ్మాయిలంతా మరో సారి వివశత్వానికి గురయ్యారు. అంతా ఒకరి తర్వాత ఒకరిగా ఆ సోప్‌ని అందుకుని గుండెలకు హత్తుకుని ముద్దులతో దాన్ని ముంచెత్తారు. దానివైపు మురిపెంగా చూస్తున్న ఒక అమ్మాయి తన్మయత్వానికి గురవుతూ" దేవతలూ, రాక్షసులు కలిసి అమృతం కోసం పాలకడలిని చిలికినప్పుడు కామధేనువు, కల్పతరువులతోపాటు ఇది కూడా ఉద్భవించిందా?" అని అడిగింది.

"కాదు దీన్ని డి.ఆర్.సి.సి. కంపెనీ వాళ్లు ఉత్పత్తి చేస్తున్నారు. హిమాలయాల్లో మాత్రమే దొరికే చాలా అరుదైన వనమూ

లికలను సేకరించి వాటి మిశ్రమంతో తయారుచేస్తున్న మహత్తరమైన సోప్ ఇది. విశ్వామిత్రుడు ఘోరమైన తపస్సు చేస్తున్నప్పుడు అతని తపస్సుని భంగపరచడానికి దివి నుండి భువికి దిగివచ్చిన మేనక ఈ వనమూలికల మిశ్రమాన్ని తన స్నానానికి ఉపయోగించేదట. అందుకే ఈ సోప్‌లో ఆ పరిమళం, దేహసౌందర్యాన్ని పెంచి కాంతివంతంగా ఉంచే అపూర్వమైన శక్తి ఇమిడి ఉంది" అన్నాడు రాజు.

"మేమంతా ఇకనుండి ఈ గోల్డ్ డైమండ్ సోప్‌లనే వాడతాం" అన్నారు అమ్మాయిలంతా ముక్తకంఠంతో. అమ్మాయిల్ని ఆకట్టుకోవాలంటే ఏంచేయాలో అక్కడున్న అబ్బాయిలందరికీ బోధపడింది. అప్పుడే అటుగాడి ఆర్.సి.సి. కంపెనీ వ్యాను వచ్చింది. దాన్నిండా గోల్డ్ డైమండ్ సోపులున్నాయి. అబ్బాయిలంతా పరుగున వెళ్లి ఆ వ్యానుని ఆపి అంతా తలో యాభై సోపులు కొనుక్కున్నారు. దాంతో వ్యానులో ఉన్న సోపులన్నీ హాట్‌కేకుల్లా అమ్ముడైపోయాయి. అబ్బాయిలంతా దగ్గరలో ఉన్న పబ్లిక్ ట్యాపుల దగ్గరికి వెళ్లి ఆ సోప్‌లతో మొహాలు కడుక్కుని వచ్చి తమ బైక్‌లు స్టార్ట్ చేసి ఆశగా అమ్మాయిలవంక చూశారు. మరుక్షణం అమ్మాయిలంతా పరుగున వచ్చి తలో ఒక బైక్‌మీద అబ్బాయిల వెనుక కూర్చున్నారు. అబ్బాయిల ఆనందానికి అవధుల్లేవు. హుషారుగా బైక్‌ల్ని ముందుకు పోనిచ్చారు.

"మేఘాలలో తేలిపొమ్మన్నది.
తుఫానులా రేగి పొమ్మన్నది"
గోల్డెన్ సబ్బుతోనే సాధ్యం ఇది"

అని పాడుకుంటూ ఆ జంటలు కలల తీరం వైపుగా దూసుకుపోతున్నారు.

షూటింగు పూర్తయింది.

యూనిట్ మొత్తం రాజు, అమ్మాయిలు చేసిన సహజమైన నటనకి అభినందనలు తెలుపుతూ చప్పట్లు కొట్టారు. డి.ఆర్.సి.సి. కంపెనీ యజమాని రాజుని కౌగిలించుకుని తన ఆనందాన్ని వ్యక్తం చేశాడు.

"నేను ఊహించినదానికన్నా అద్భుతంగా మీరు నటించారు. మీరు చేసిన సహాయం ఎప్పటికీ మర్చిపోలేను" అని అప్పటికప్పుడు లక్షా ఏభై వేల రూపాయల్ని బ్రీఫ్ కేసుతో సహా రాజుకి అందించాడాయన.

"థ్యాంక్యూ" అంటూ రాజు ఆ బ్రీఫ్‌కేసు అందుకున్నాడు. ఆ యూనిట్ మొత్తం వీడ్కోలు చెప్తుండగా రాజు అమ్మాయిలతో సహా అక్కడి నుండి కదిలాడు. అమ్మాయిలందరికీ మాత్రం రాజుమీద కోపంతో రక్తం మరిగిపోతోంది. లక్షా యాభైవేల రూపాయల కోసం తామందరిచేత బలవంతంగా నటింపజేశాడనే అక్కసుతో అంతా రగిలిపోతున్నారు. కాని ఎవరూ కూడా తమ నిరసనని పైకి వ్యక్తం చేయలేదు.

అంతా సినిమా థియేటరుకి చేరుకున్నారు. థియేటరు మొత్తం ప్రేక్షకులు లేక వెల వెలాబోతోంది. ఆ థియేటరు ఆవరణలో థియేటరు యజమాని, మేనేజరు, ఇతర సిబ్బంది అయోమయ పరిస్థితిలో కొట్టుమిట్టాడుతున్నారు. యజమాని మాత్రం అసహనంగా కలవరపడుతూ అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. మధ్య మధ్యలో పిచ్చి పట్టిన వాడిలా జుట్టు పీక్కుంటున్నాడు. తనలో తాను ఏదో గొణుక్కుంటున్నాడు. ఆయనకి యాభై ఏళ్ళుంటాయి. బట్టతల. మెడలో రుద్రాక్షలు, తెల్లటి పంచె లాల్చీ ధరించి నల్లగా పోతపోసిన విగ్రహంలా వున్నాడు. ఉదయాన్నే పూజ చేసినట్లుగా నుదుట గంధం బొట్టు. దానిపైన చిన్న కుంకుమబొట్టు.

రాజు, అమ్మాయిలు ఆ థియేటరు ఆవరణలోకి వచ్చారు. వాళ్ళని చూడగానే ఆ ఓనరుకి ప్రాణం లేచి వచ్చింది. పరుగున వాళ్ల దగ్గరికి వచ్చి "రండి! రండి! టిక్కెట్లు తీసుకోండి! ఇంకా సినిమా మొదలు కాలేదు" అన్నాడు ఆత్రుతగా.

రాజు మొహం చిట్లించి అనుమానంగా చూస్తూ "ఇదేమిటి? ఈ సినిమాకి మేము తప్ప ఇంకెవరూ రానట్టున్నారు? అంతగొప్పగా ఈ సినిమా ఫ్లాపయిందా?" అని అడిగాడు.

ఆ ఓనరు గతుక్కుమన్నాడు.

"అబ్బే అలాంటిదేమీ లేదు. మొదటి రోజే సినిమాకి సూపర్ డూపర్ హిట్ టాక్ వచ్చింది. ఇక జనమంటారా... ఇంకాసేపట్లో వస్తారు" అన్నాడు ఓనరు ఓ వెర్రిన వ్వునవ్వి.

రాజు చేతివాచీని చూసుకుని "సినిమా స్టార్టు కావడానికి ఇంకా పావుగంట మాత్రమే వ్యవధి ఉంది. సినిమా రిలీజు అయి వారం రోజులే అయింది. పైగా ఇది ఓ అగ్రహీరో సినిమా. టాక్ చూస్తే సూపర్ డూపర్ హిట్టు కూడా అయిందంటున్నారు మీరు. అలాంటప్పుడు ఇక్కడ టిక్కెట్లకోసం జనం ఎంతగా కొట్టుకు చస్తూవుండాలి. ఎంతగా తొక్కిసలాట జరుగుతూ వుండాలి. కాని అలాంటి ఛాయలేవీ మచ్చుకి కూడా కన్పించడంలేదు. అంటే తప్పకుండా ఈ సినిమా దిగ్విజయంగా ఆట్టర్‌ఫ్లాప్ అయి వుండాలి. అందుకే మీరిలా థియేటరు ముందు నిలబడి మార్కెట్టులో కూరగాయలు అమ్ముకునేవాడిలా పిలుస్తున్నారు. అవునా? అన్నాడు.

థియేటరు ఓనరు మొహం వెలవెలపోయింది. దూరంగా నిలబడి వున్న థియేటరు సిబ్బంది ఆయనవంక జాలిగా చూశారు. నిన్నటి వరకు సినిమా టిక్కెట్లన్నీ ఇదే థియేటరు ఆవరణలో బ్లాక్‌లో అమ్మించి రెండు చేతులా లక్షలకు లక్షలు ఆర్జించే ఆయన ఈ రోజు ఒక ప్రేక్షకుడి ముందు వెర్రి మొహం వేసుకుని దీనావస్థలో నిలబడటం వాళ్ళందరికీ బాధను కల్గించింది. రాజు అమ్మాయిల వైపు తిరిగి "పదండి పోదాం వేరే ఏదైనా సినిమా చూద్దాం" అన్నాడు.

అమ్మాయిలంతా బిత్తరపోయారు. క్రితం రోజు ఈ సినిమా చాలా బావుందని పట్టాభి తామందరికీ చెప్పాడు. టిక్కెట్లు దొరకడం లేదని బ్లాక్‌లో కూడా కష్టంగా వుందని కాబట్టి ఇప్పుడిప్పుడే మీరు సినిమా చూడటం కుదరదని అన్నాడు. అలాంటిది ఈ రోజు ఇక్కడ ఒక్క మనిషి కూడా కన్పించడం లేదు. నిన్నటి పట్టాభి మాటలకి ఈ రోజు ఇక్కడి పరిస్థితికి ఏమాత్రం పొంతన కుదరడం లేదు. అంటే ఎక్కడో ఏదో జరిగింది. జనం థియేటరు ఛాయలకి రాకుండా రాజు ఏదో చేసే వుంటాడు. లేకపోతే హిట్టయిన సినిమాకి జనం రాకుండా ఎందుకుంటారు? అని ఆలోచిస్తున్న అమ్మాయిలకి రాజు ఏం చేసి జనం థియేటరుకి రాకుండా చేశాడో మాత్రం అంతుబట్టలేదు.

ఓనరు కంగారు పడుతూ "అలా అనకండి పది లక్షలు పోసి ఈ సినిమా బాక్సు కొన్నాను. రిలీజు అయి వారం రోజులు మాత్రమే అయింది. సినిమా బాగుందని టాక్ వచ్చినా ఈ మాయదారి జనం ఎందుకు రావడంలేదో నాకు అర్థం కావడం లేదు. ఇప్పుడు మీరు కూడా వెళ్ళిపోతే నానోట్లో మట్టే. అంచేత దయచేసి మా సినిమా చూసివెళ్ళండి" అన్నాడు వేడుకోలుగా.

"మీరు పదిలక్షలు పోసి బాక్సు కొన్నారని మేము పనిగట్టుకుని మరీ సినిమా చూడాలా? ఫ్లాపయిన ఈ సినిమాని రెండు గంటల పాటు ఓపిగ్గా చూసే సహనం ఓర్పు మాకులేవు. అంచేత మరేదైనా సినిమాకి వెళతాం. మమ్మల్ని వదిలేయండి" అన్నాడు రాజు ఖచ్చితంగా.

"మీరు పొరపాటు పడుతున్నారు. మా సినిమా చాలా బావుంది. ఇంకా చెప్పాలంటే వానపాటలో హీరోయిన్ తన అందాలన్నీ ఆరబోసేసింది. మీకు అంతగా అనుమానంగా వుంటే ఓ పనిచేయండి. ముందు టిక్కెట్లు తీసుకుని లోపలికి వెళ్ళండి.

సినిమా ఏ మాత్రం బోరుగా వున్నా వెంటనే బయటకు వచ్చేయండి. మీ డబ్బులు మీకు వాపసు ఇస్తాం" అన్నాడా యన హామీ ఇస్తూ.

"అంటే అంతసేపు ఓ చెత్త సినిమా చూస్తూ మా టైమును వేస్ట్ చేసుకోమం టారా? ఆ టైములో మేము వేరే ఏదైనా మంచి సినిమా చూసి ఎంజాయ్ చేస్తాం కదా!" అన్నాడు రాజు.

ఆ ఓనరు జుట్టు పీక్కున్నాడు.

"నువ్వెవరివయ్యా బాబూ! కాలికేస్తే వేలి కేస్తావ్! వేలికేస్తే కాలికేస్తావ్! ఇలా అయితే నేనెలా చచ్చేది. పోనీ నువ్వే ఏదైనా చెప్పు. మీరు మాత్రం తప్పకుండా ఈ సినిమా చూడాలి. లేకపోతే ఈ సినిమా థియేటరు అమ్ముకుని నేను ఈ థియేటరు ముందే పల్లీలు అమ్ముకోవాలి" అన్నాడు ఓనరు ఆక్రోశంగా.

రాజు సన్నగా నవ్వి "ఇప్పుడు దారిలోకి వచ్చారు. ఇలా రండి" అని ఆయన్ని పక్కకు తీసుకువెళ్ళి "చూడండి! మిమ్మల్ని మీ మాటల్ని వింటూంటే నా గుండె తర క్కుపోతోంది. మీరు ఓ నిక్కరు వేసుకుని, భుజం మీద ఎర్రతువాలుతో ఎర్రటి ఎండలో ఈ థియేటరు ముందు బుట్ట పెట్టుకుని" పల్లీలోయ్... పల్లీలు... వేడి వేడి పల్లీలు. వుడకబెట్టిన పల్లీలు" అని అరుస్తూన్న దృశ్యం అతి దయనీయంగా నా మనోనేత్రం ముందు ఈస్ట్‌మన్ కల ర్‌లో కదలాడుతూంటే నా మనసుని ఎవరో పిండి ఆరవేస్తూన్న ఫీలింగు కలుగుతోంది. అందుకే... అందుకే... మీ కోసం మీరు పల్లీలు అమ్ముకోకుండా ఉండటంకోసం మేమంతా ఈ సినిమా తప్పక చూడాలని నిశ్చయించుకున్నాం. కాకపోతే మీరు ఓ పనిచేయాలి" అన్నాడు రాజు.

అప్పటికే సంతోషంతో ఉబ్బి తబ్బిబ్బయి పోతున్న ఓనరు ఎంతో ఉత్సాహంతో "ఏమి టది? " అని అడిగాడు.

"బాల్కనీ టిక్కెట్లు సగం రేటుకి ఇవ్వండి" ఓనరు స్పృహతప్పి పడిపోబో తుంటే రాజు ఆయన పడిపోకుండా ఒడిసి పట్టుకున్నాడు. ఆయన మొహంమీద కాసిని నీళ్ల చిలకరించగానే స్పృహలోకి వచ్చాడు.

"టిక్కెట్టుని మరీ అంత తక్కువ రేటుకి అడగడం ఏం బాగాలేదు. మరీ అంత అన్యాయమా. అంత దారుణమా" అన్నాడు ఓనరు గింజుకుంటూ.

"నీకు ఇష్టమైతేనే. అంతేతప్ప మిమ్మల్ని వరూ బలవంతం చేయరు. మాకు ఈ సినిమా కాకపోతే మరో సినిమా. ఏదీ లేద నుకో టి.వి. ముందు కూర్చుని ఛానల్స్ తిప్పితే ఏదో ఒక ఛానల్‌లో అదిరిపోయే సీన్సుతో ఆరబోసే అందాలతో ప్రోగ్రామ్స్ ప్రసారం అవుతాయి. హాయిగా చూసి ఎంజాయ్ చేస్తాం" అన్నాడు.

"నా పరిస్థితిని ఇలా క్యాష్ చేసుకోవడం ఏం బాగాలేదు" అన్నాడు ఓనరు ఉక్రో షంగా.

"మీరేమైనా తక్కువతిన్నారా? సినిమా రిలీజయిన పది, పదిహేను రోజుల వరకు క్యూలో నిలబడ్డ జనానికి టిక్కెట్లు ఇవ్వ కుండా మీ మనుషులచేత టిక్కెట్లన్నీ అధిక మొత్తానికి బ్లాక్‌లో అమ్మించడం ఏమైనా సమంజసంగా ఉందా? " అని రాజు ఎదురు ప్రశ్నించాడు.

ఓనరు తెల్లబోయాడు.

"అసలు ఈ వాదనలన్నీ అనవసరం. టిక్కెట్లు సగం ధరకి ఇస్తారా? లేక మమ్మల్ని పొమ్మంటారా? " అసహనం ప్రద ర్శిస్తూ రాజు అడిగాడు.

ఆయన లోలోపల పళ్లు నూరుకుంటూ "ఇవ్వక చస్తామా! ఇస్తాం" అని కౌంటరులో కూర్చునే వ్యక్తిని పిలిచి "వీళ్లందరికీ బాల్కనీ టిక్కెట్లు సగం రేటుకి ఇవ్వు" అన్నాడు దిగాలుగా.

రాజు అందరికీ టిక్కెట్లు తీసుకున్నాడు. అప్పుడే అక్కడికి వచ్చిన పట్టాభికి ఆ

టిక్కెట్లు ఇచ్చి "అందర్నీ తీసుకుని హాలులోకి వెళ్లు. నేను తర్వాత వస్తాను"అన్నాడు.

పట్టాభి తలూపి అమ్మాయిల్ని వెంటబెట్టుకుని థియేటరులోకి నడిచాడు. థియేటరులో అంతా కూర్చున్న తర్వాత మిథిల పట్టాభిని అడిగింది మృదువుగా.

"అవునూ... మొన్న మీరు ఈ సినిమా చూసివచ్చిన తర్వాత చాలా బాగుందని సర్టిఫికెట్ ఇచ్చారు కదా! మరి ఈరోజేమిటి మీ మాటలకి పూర్తి విరుద్ధంగా ఇక్కడ మనం తప్ప మరెవరూ కన్పించడంలేదు? "

పట్టాభి గర్వంగా నవ్వి "ఇదంతా మా గురువుగారి మాయాజాలం" అన్నాడు.

అమ్మాయిలు ఒకర్నొకరు చూసుకున్నారు.

"అద్సరే. పాపం అసలే జనం రాక ఆ ఓనరు కొట్టుమిట్టాడుతూ ఉంటే అతని పరిస్థితిని క్యాష్ చేసుకుంటూ రాజు టిక్కెట్లన్నీ సగంరేటుకి బేరమాడి మనీ తీసుకున్నాడు. అది తప్పుకదూ? " అంది అంకిత సానుభూతిగా.

"అది కూడా మా గురువుగారి మాయాజాలంలో ఒక భాగమే" అన్నాడు పట్టాభి ఉత్సాహంగా.

అమ్మాయిలంతా కొద్ది క్షణాలపాటు నిశ్శబ్దంగా ఉండిపోయారు. మిథిల లేచి వచ్చి పట్టాభి పక్కన ఉన్న సీట్లో కూర్చుని అతనివంక చూసి తియ్యగా నవ్వింది. అతను పొంగిపోతూ "హి... హిహి... హిహిహ" అంటూ వికారంగా నవ్వాడు.

"పట్టాభి! నిజంగా మీ గురువుగారు చాలా గొప్పవాడు. ఇంతకీ రాజు థియేటరుకి జనం రాకుండా ఎలా అడ్డుకట్ట వేశాడంటావ్" అంటూ చాలా క్యాజువల్ గా అడిగినట్లుగా అడిగింది మిథిల.

"అదా... అది" అని ఆగి అటూ ఇటూ చూశాడు పట్టాభి.

"మీరు ఎవరికీ చెప్పనని మాటిస్తే చెప్తాను" అని చేయి సాచాడు పట్టాభి.

మిథిల అతని చేతిలో చేయివేసి "అలాగే ఎవరికీ చెప్పం" అంది మాటిస్తూ.

అతను క్రితంరోజు రాత్రి తను రాజు

## ఎందుకు కుదరదు?



బాంబే విమానాశ్రయానికి వచ్చిన ఒకాయన ఎయిర్‌లైన్స్ చెక్-ఇన్- కౌంటర్ వద్దకు వెళ్లాడు. అక్కడున్న అధికారితో 'ఇదుగో చూడండి.. ఈ బ్రౌన్‌బ్యాగ్‌ను ఢిల్లీ పంపండి. నల్లబ్యాగ్‌ను కోల్‌కతా పంపేయండి. ఈ మూడో బ్యాగ్‌ను మాత్రం ఇక్కడే ఉంచండి.. వచ్చేవారం వచ్చి తీసుకుంటా..' అన్నాడు.

అధికారి తెల్లబోయాడు. అక్కడే ఉన్న సూపర్‌వైజర్ 'ఈ లగేజి ఆ ఊరికి ఆ సూట్‌కేసు ఈ ఊరికి పంపడానికి మాదేమైనా పోస్టాఫీసు అనుకున్నావా? అన్నాడు కోపంగా.

వెంటనే అతను 'ఎందుకు కాదు? కిందటిసారి అడక్కుండానే ఇలాగే పంపేశారుకదా?' అని ధుమధుమలాడాడు.

కల్సి పాత సినిమా వాల్‌పోస్టర్లని ఎలా కొత్త సినిమా వాల్‌పోస్టర్ల మీద అంటించిందీ అంతా వివరంగా చెప్పాడు. అంతే కాదు బయట ఉన్న రాజు ఏం చేయబోతున్నదీ కూడా చెప్పాడు.

అమ్మాయిలంతా నిర్ఘాంతపోయారు. డబ్బుకోసం రాజు చాలా నీచానికి పాల్పడుతున్నాడని అమ్మాయిలంతా భావించారు. ఇప్పుడు అతని ఉనికి అంటేనే వాళ్లందరికీ అసహ్యంగా, ఏవగింపుగా అన్పిస్తోంది.

"ఛ. మనం ఈ సినిమాకి రాకపోయినా బావుండేది" అంది మిథిల చిరాకుగా.

"అవును" అన్నారు మిగిలిన అమ్మాయిలు కూడా ముక్తకంఠంతో.

వాళ్ల మాటల్ని మరోలా అర్థం చేసుకున్న పట్టాభి "లేదు. ఈ సినిమా బావుంటుంది. ఎక్కడా బోర్ ఉండదు" అన్నాడు నచ్చచెప్తూ.

సరిగ్గా అదే సమయంలో థియేటరు ఆవరణలో రాజు ఓనర్ని అడిగాడు.

"ఇంతకీ మీ హిట్టు సినిమాకి జనం ఎందుకు రావడంలేదు? "

"అదే అర్థంగాక చస్తున్నాను. నా థియేటరుకి ఎవరైనా చేతబడి చేశారేమోనన్న. అనుమానంగా ఉంది" అన్నాడు ఓనరు నిర్వేదంగా.

రాజు సన్నగా నవ్వాడు.

"అదేం కాదుగాని, మీ థియేటరుకి జనం ఎందుకు రావడంలేదో నేను చెప్పగలను" అన్నాడు రాజు.

ఆయన విస్మయంగా రాజువంక చూశాడు.

"మీకు... మీకు తెలుసా? " ఉద్విగ్నతతో అడిగాడాయన.

"అవును"

"బాబ్బాబు! నీకు పుణ్యముంటుంది. అదేమిటో చెప్పి పుణ్యం కట్టుకో. వచ్చే జన్మలో నువ్వు థియేటరు ఓనరువై పుడితే నేను టిక్కెట్లు ఇచ్చే బుక్కింగ క్లర్కునై పుట్టి నీ రుణం తీర్చుకుంటాను" అన్నాడు అర్థింపుగా.

"ఆ రుణాలన్నీ తర్వాత. ఇప్పుడు మీ థియేటరుకి జనం తండోపతండాలుగా రప్పించే బాధ్యత నాది. అయితే ఈ విషయంలో మీరు ఓ షరతుకి ఒప్పుకోవాలి" అన్నాడు రాజు.

"ఏమిటది? "

"ఒక షోకి వచ్చే లాభంలో పావలా వంతు నాకు ఇవ్వాలి. అలా ఒకరోజుకి నాలుగు షోలు కాబట్టి ఆ నాలుగు షోలుకి ఇవ్వాలి. ఆవిధంగా వందరోజులపాటు ఇవ్వాలి"

థియేటరు ఓనరు ఆలోచనలో పడ్డాడు.

"కాస్త తగ్గించుకోరాదూ" అన్నాడు.

"ఇక లాభం లేదు. నేను థియేటరులోకి వెళ్తున్నాను. షో మొదలుపెట్టు" అన్నాడు రాజు విసుగ్గా.

"నువ్వెక్కడ దొరికావయ్యా బాబూ! నీ మాట నీదేగాని నా మాట విన్పించుకోవా? " అన్నాడు ఓనరు.

"వినను. వినాల్సిన అవసరం నాకులేదు. ఏదో పదిలక్షలకి బాక్సు కొనుక్కున్నావు కదా! ఎక్కడ నష్టపోయి ఈ థియేటరు అమ్ముకుని పల్లీలు అమ్ముకుంటావో అని జాలిపడి ఆదుకుందామని చూస్తుంటే బేరాలాడతావా బేరాలు" అన్నాడు రాజు మండిపడుతూ.

దాంతో ఓనరు దారికొచ్చాడు.

"సరే కానీయ్! నీ ఇష్టప్రకారమే పావలా వంతు ఇస్తాను" అన్నాడు ఏడుపు మొహం పెట్టి.

"అలా మాటంటే కుదర్దు. మనకు అంతా రాతల్లో కన్పించాలి. అంచేత మీరు పావలా వంతు ఇవ్వడానికి అంగీకరిస్తున్నట్లుగా స్టాంప్ పేపరు మీద రాసి ఇవ్వండి"

అన్నాడు రాజు నిర్మొహమాటంగా.

ఆయన తలబాదుకుంటూ, మనసులో రగిలిపోతూ అప్పటికప్పుడు స్టాంప్ పేపర్ తెప్పించి రాజు చెప్పినట్టుగా రాసి సంతకం చేసి రాజుకి అందించాడు.

"ఇప్పుడు చెప్పు నా థియేటరుకి జనం ఎందుకు రావటంలేదో? " అడిగాడు ఓనరు.

ఆయన ఇచ్చిన స్టాంప్ పేపర్ని మడిచి జేబులో పెట్టుకుంటూ "మీ సినిమా తాలూకు అన్ని వాల్ పోస్టర్ల మీద ఒక యాభై ఏళ్ళ క్రితం నాటి స్త్రీ పాతివ్రత్యం అనే సినిమా వాల్ పోస్టర్లని ఎవరో అంటిం చేశారు. మీ థియేటరులో ఆ బ్లాక్ అండ్ వైట్ సినిమా ఆడుతుందని జనం ఇటువైపు అసలు తొంగిచూడటంలేదు" అంటూ అసలు విషయం చెప్పాడు రాజు.

ఆయన షాక్ తిన్నాడు.

అంతలోనే తేరుకుని "మీరు... మీరు చెప్పేది నిజమా? " దిగ్భ్రాంతిగా అడిగాడు.

"కావాలంటే ఒకసారి వెళ్ళి మీ థియేటరు ప్రహరీగోడమీద చూసుకోండి. మీకు హార్ట్ ఎటాక్ వుంటే మాత్రం చాలా జాగ్రత్త. గుండె దిటవు పరుచుకుని చూడండి" అన్నాడు రాజు హెచ్చరిస్తూ.

ఆయన తన సిబ్బందితో కల్సి ప్రహరీగోడ దగ్గరికి పరుగున వెళ్ళి తన సినిమా వాల్ పోస్టర్ల మీద అంటించిన ఆ పాత సినిమా వాల్ పోస్టర్లని చూసి గుండెలు బాదుకున్నాడు.

"ఓర్నాయనో! ఓరి దేవుడో! నా కొంపకే ఎసరు పెట్టారు కదరో!" అంటూ వాపో యాడు.

"ఆ అరుపులు తర్వాత. ముందు ఆ పాత సినిమా వాల్ పోస్టర్లు పీకించి మీ కొత్త సినిమా వాల్ పోస్టర్లని అన్నిచోట్లా అంటించే కార్యక్రమం చూడండి" అని రాజు సలహా ఇచ్చాడు.

"అవును కదూ! మర్చేపోయాను" అని తన సిబ్బంది వైపు తిరిగి "మీరంతా మన సినిమా వాల్ పోస్టర్లు తీసుకుని అన్నిచో ట్లకూ వెళ్ళి ఎక్కడా వదలకుండా మన పోస్టర్లు అంటించండి. ఇంకో పావుగంటలో జనం మన థియేటరు ముందుండాలి" ఆదే శించాడాయన.

ఆయన సిబ్బంది వెంటనే వాల్ పోస్టర్లు, ఉడకబెట్టిన మైదా, నిచ్చెన తీసుకుని అక్కడి నుండి బయల్దేరారు.

రాజు వైపు ఆయన కృతజ్ఞతగా చూస్తూ "ఏది ఏమైనా ఈ రోజు ఓ భారీ నష్టం జర గకుండా అడ్డుపడి ఆపద్బాంధవుడిలా నన్ను ఆదుకున్నావు. నువ్వు చేసిన మేలు ఎప్ప టికీ గుర్తుపెట్టుకుంటాను" అన్నాడు.

"అంటే లాభంలో పావలా వంతు ఇవ్వడం మాత్రం మర్చిపోతావా? " రాజు నవ్వుతూ అడిగాడు.

"అబ్బే అలాంటిదేమీ లేదు. మీరు అడిగి నంత తప్పక ఇస్తాను. అందులో ఎలాంటి అనుమానం లేదు. రండి. నా రూములో కూర్చుందాం" అంటూ ఆయన రాజుని సాదరంగా ఆహ్వానించాడు.

రాజు ఆయన వెంట కదిలి ఆయన రూములోకి వెళ్ళాడు.

"కూర్చోండి" కుర్చీ చూపించాడాయన. రాజు కూర్చున్నాడు. ఆ రూము చల్లగా హాయిగా ఉంది. రాజు వద్దంటున్నా విన కుండా ఆయన కూల్ డ్రింక్సు తెప్పించి రాజుకి ఒక బాటిల్ ఇచ్చి తానొకటి తీసు కున్నాడు. ఇద్దరూ డ్రింక్ సిప్‌చేస్తూ మాట్లా డుకుంటుండగా ఓ అరగంటలో జనం ఒక వరదలా ఆ థియేటరు దగ్గరికి తరలివ చ్చారు. టిక్కెట్ల కోసం అక్కడ తొక్కిసలాట మొదలయింది. రణగొణ ధ్వనులతో ఆ ప్రదేశమంతా సందడిగా మారింది. ఆ దృశ్యాన్ని ఎంతో తృప్తిగా కన్నుల పండు

పంచేంద్రియాల అదుపులోనే పూర్తి విజయం దాగి వుంటుంది. – పంచతంత్రం



వగా చూస్తుండిపోయాడు ఆ ఓనరు.

కాసేపటి తర్వాత రాజు లేచి థియేటరు లోకి వెళ్ళాడు. అమ్మాయిలు అతన్ని చూసినా చూడనట్లే మొహం తిప్పుకు న్నారు. ఆ విషయాన్ని రాజు గమనించినా అంతగా పట్టించుకోలేదు. ఓ పదినిమిషాల తర్వాత సినిమా మొదలయింది. అంతా సినిమా చూడటంలో మునిగిపోయారు.

మార్నింగ్ షో వదిలారు.

రాజు, పట్టాభి, అమ్మాయిలు, హాలు లోంచి బయటకు వచ్చారు. వాళ్ళ కోసమే ఎదురుచూస్తున్న థియేటరు ఓనరు రాజు దగ్గరికి వచ్చాడు.

"ఈ మార్నింగ్ షోకి వచ్చిన లాభంలో పావలా వంతు లాభం ఇస్తున్నాను తీసు కోండి" అని ఆయన డబ్బు రాజుకి ఇవ్వబో యాడు.

రాజు ఆ డబ్బు అందుకోకుండా పట్టాభి వంక చూశాడు. పట్టాభిముందుకొచ్చి ఆ డబ్బు అందుకున్నాడు.

"మీరు ప్రతిరోజూ వచ్చి నాలుగు షోలుకి సంబంధించిన మీ వంతు సొమ్ము కలెక్టు చేసుకుని వెళ్ళండి" అని చెప్పాడాయన.

"నేను రాను. నా తరపున నా మిత్రుడు పట్టాభి వచ్చి ఆ సొమ్ము తీసుకుంటాడు" అన్నాడు రాజు పట్టాభిని చూపిస్తూ.

"మీ ఇష్టం" అన్నాడాయన ఎంతో ఒద్ది కతో.

"మరి మేము వస్తాం" రాజు సెలవు తీసుకుంటూ అన్నాడు.

ఆయన అలాగేనన్నట్లుగా తలూపాడు.

అమ్మాయిలంతా ఆ ఓనరు వంక ఎంతో సానుభూతిగా చూశారు. రాజు చేసిన మోసం గురించి ఆయనకి చెప్పి రాజు యొక్క నిజస్వరూపాన్ని బయటపెట్టాలన్న



ఆలోచన వాళ్ళందరికీ కలిగింది. కాని ఆ తర్వాత ఇక్కడ జరిగిన గొడవ మొత్తం అన్ని పేపర్లలో వస్తే దాని ప్రభావం హాస్టలు మీద కూడా పడి తామందరి పరువు మంటగలిసిపోతుందనే ఉద్దేశంతో ఎవరికి వారే తమ ప్రయత్నాన్ని విరమిం చుకున్నారు.

క్రీగంట వాళ్ళని గమనిస్తున్న రాజుకి వాళ్ళ ఆలోచన ఏమిటో అర్థమైనా చిన్నగా నిట్టూర్చి ఊరుకున్నారు తప్ప వాళ్ళని పల్లెత్తు మాట అనలేదు.

అంతా రోడ్డు మీదకు వచ్చారు. కాస్త దూరం వెళ్లాక రోడ్డు పక్కగా వున్న ఒక కూల్‌డ్రింకు షాపు ముందు ఆగిన రాజు అమ్మాయిలతో అన్నాడు "రండి. కూల్‌డ్రింక్సు తాగుదాం"

అమ్మాయిలంతా రాజు వంక నిరసనగా చూశారు.

"ఆ మోసం చేసి సంపాదించిన సొమ్ముతో మాకు కూల్‌డ్రింక్సు ఇప్పిస్తావా" మిథిల ఈసడింపుగా అంది.

"ఆ డబ్బుతో నువ్వు కూల్‌డ్రింక్సు ఇప్పిస్తానన్నా మేము తాగడానికి సిద్ధంగా లేం" స్థిరంగా అంది అంకిత. వాళ్ళలా ఆవేశంగా ఎందుకు మాట్లాడుతున్నారో రాజుకి అర్థమైంది. కాని పట్టాభి మాత్రం ఆగ్రహం పట్టలేక విసురుగా ఏదో అనబోయాడు. వెంటనే రాజు అతన్ని వారించాడు.

"మీకు ఇష్టం లేకపోతే అలాగే వద్దులే. పదండి పోదాం" అన్నాడు రాజు ముందుకు కదుల్తూ.

అంతా అతన్ని అనుసరించారు. అలా కొద్దిదూరం వచ్చాక రోడ్డు పక్కగా ఒక ఖరీదైన ప్రైవేట్ హాస్పిటల్ గేటు ముందు రాజు కోసం ఎంతో ఆరాటంగా ఎదురు చూస్తున్న ఒకామె అతన్ని చూడగానే మెరుస్తున్న కళ్ళతో పరుగున అతని దగ్గరికి వచ్చింది.

"వచ్చారా! మీ కోసమే చాలా సేపట్నుంచి ఈ గేటు దగ్గర ఎదురుచూస్తున్నాను. మీరు వస్తారో రారోనని తెగ కంగారు పడుతున్నాను. మీరు వచ్చారు. అంతే చాలు" అంది ఎంతో ఉద్విగ్నతతో.

రాజు ఆమె వంక జాలిగా చూశాడు.

"ఆపరేషనుకి అన్ని ఏర్పాట్లూ పూర్తయ్యాయా? " రాజు అడిగాడు.

"అయ్యాయి. కాని డబ్బు కట్టనిదే ఆపరేషను చెయ్యమని డాక్టర్లు తెగేసి చెప్తున్నారు" అందామె ఏడుస్తూ.

ఊరుకోమ్మా! నేను వచ్చేశానుగా! ఇక ఏ అడ్డంకీ వుండదు" అన్నాడు అనునయంగా.

ఆమె కళ్ళు తుడుచుకుంది.

"పదండి" అన్నాడు రాజు.

అమ్మాయిలందరికీ జరుగుతున్నదంతా అయోమయంగా అన్పించింది. వాళ్ళ మనసుల్లో ఎన్నో ప్రశ్నలు తలెత్తాయి. అంతా హాస్పటల్లోకి నడిచారు. ఒక డాక్టర్ ధుమధుమలాడుతూ ఆమె దగ్గరికి వచ్చాడు.

"ఏంటమ్మా ఇది? ఎవరో డబ్బు తెస్తారని ఆపరేషనుకి ఏర్పాట్లు చెయ్యమని నమ్మకంగా చెప్పావు. ఇంతవరకు ఆ మనిషెవరో రాలేదు. నువ్వు డబ్బు కట్టలేదు. అంచేత మీ పేషెంటుని మీరు తీసుకువెళ్ళిపోవడం మంచిది" అన్నాడు చిరాకుగా.

ఆమె రాజువంక చూసింది.

"మొత్తం ఎంత డబ్బు కట్టాలర్సార్? " రాజు వస్తున్న కోపాన్ని నిగ్రహించుకుంటూ అడిగాడు.

"లక్షా పాతికవేలు" అన్నాడాయన విసుగ్గా.

"ఆ డబ్బు నేను కడతాను సార్! ఎక్కడ కట్టాలో చెప్పండి" అన్నాడు రాజు.

ఆయన మొహం వికసించింది. దూరంగా ఉన్న అకౌంట్ సెక్షన్ చూపించి "అక్కడ కట్టి కట్టినట్టుగా బిల్లు తీసుకు రండి. వెంటనే ఆపరేషను ప్రారంభిస్తాం" అన్నాడాయన.

మనిషి ప్రాణాలకన్నా డబ్బుకి ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చే ఆ డాక్టరు తీరుని చూస్తూంటే రాజు రక్తం మరిగిపోయింది. కాని అది ఆవేశపడే సమయం కాదని భావించి తనని తాను తమాయించుకున్నాడు.

రాజు ఆ అకౌంట్ సెక్షన్ వైపు వెళ్ళాడు.

"ఎవరమ్మా మీరు? అసలేం జరిగింది? ఆపరేషను ఎవరికి? " అప్పటివరకు మౌనంగా ఉన్న మిథిల ఆ అపరిచిత స్త్రీని ఆసక్తిగా అడిగింది.

"నా పేరు కరుణ. నా భర్తకి ఉన్న రెండు కిడ్నీలు చెడిపోయాయి. నాకున్న రెండు కిడ్నీలలో ఒకటి తీసి ఆయనకు అమర్చమని కోరాను. అయితే నా కిడ్నీ ఆయనకు అనుకూలించదట. దాంతో ఏం చెయ్యాలో నాకు దిక్కుతోచలేదు. అప్పుడే ఎవరో ఇచ్చిన సలహా మేరకు నా భర్తకు ఎవరైనా ధర్మాత్ములు ఉంటే కిడ్నీ దానం చెయ్యమని లేదా కిడ్నీ కొనుక్కోవడానికి సరిపడ ఆర్థిక సహాయం చెయ్యమని అర్థిస్తూ అన్ని పేపర్లలో ప్రకటన ఇచ్చాను. కాని ఎవరూ ఆ ప్రకటనకి స్పందించి ముందుకు రాలేదు. ఒకరోజు ఈ రాజాబాబు హాస్పటల్ కి వచ్చి నన్ను కలిసి ఆపరేషనుకి అయ్యే ఖర్చంతా తాను భరిస్తానని ఫలానా రోజున డబ్బు పట్టుకుని హాస్పటల్ కి వస్తానని చెప్పి వెళ్ళాడు. అతని మాట మీద నమ్మకంతో ఈరోజు ఆపరేషనుకి ఏర్పాట్లు చెయ్యమని నేను డాక్టర్లకి చెప్పారు. ఆపరేషనుకి ఏర్పాట్లు పూర్తయ్యాయి. అయితే నా నమ్మకాన్ని వమ్ము చేయకుండా రాజాబాబు సమయానికి వచ్చి నా భర్త ఆపరేషన్ కోసం డబ్బు కడుతున్నాడు. ఇలాంటి మహోన్నతమైన వ్యక్తులు ఈ ప్రపంచంలో ఎంతమంది ఉంటారు? నిజంగా అతను నా దృష్టిలో దేవుడే! అతనికి మా దంపతులం జీవితాంతం రుణపడి ఉంటాం" అందామె భావోద్వేగంతో.

ఒక్కసారిగా ఈడ్చి చెంపలమీద కొట్టిన ట్టుగా అమ్మాయిలంతా ఉలిక్కిపడ్డారు. అప రాధ భావంతో వాళ్ళందరి తలలు వాలిపో యాయి. అక్కడే ఉన్న పట్టాభి కల్పించు కుని "ఇప్పుడైనా అర్థమైందా? రాజు డబ్బు కోసం ఏనాడూ కక్కుర్తిపడడు. పాపం ఈమె భర్త ప్రాణాపాయంలో ఉన్నాడని పేపరు ప్రకటన ద్వారా తెల్సుకుని అతని కిడ్నీ ఆపరేషన్‌కి అయ్యే ఖర్చు నిమిత్తం మాత్రమే రాజు మీతో కల్సి ఆ యాడ్ ఫిల్ములో నటించాడు తప్ప లక్షాయాభైవేల రూపాయలు తన స్వంతం చేసుకోవాలని ఎంత మాత్రం కాదు. అలాగే మనం వెళ్ళిన సినిమా థియేటరు ఓనరు తన థియేట రులో అగ్ర హీరోల సినిమాలు ఏది రిలీ జైనా మొదటి ఇరవై రోజులూ తనే స్వయంగా తన మనుషుల ద్వారా సినిమా టిక్కెట్లన్నీ బ్లాక్‌లో అమ్మించి లక్షలకు లక్షలు ఆర్జిస్తూ క్యూలో గంటల తరబడి నిలబడే జనాన్ని దారుణంగా మోసం చేస్తు న్నాడు. అలాంటి నయవంచకుడికి బుద్ధి చెప్పడమే కాకుండా అతన్నుండి ప్రతి షోకి వచ్చిన లాభంలో పావలా వంతు ముక్కు పిండి వసూలు చేస్తున్నది పేదరికంతో మగ్గి పోతున్న ఈ కుటుంబాన్ని ఆదుకోవడంకో సమే తప్ప తన బ్యాంకు బేలన్స్ పెంచుకో వాలని రాజు ఏ మాత్రం తాపత్రయపడటం లేదు. ఇప్పుడు ఈమె భర్తకు ఆపరేషను అయితే ఆ తర్వాత మూడునెలలపాటు ఖరీ దైన మందులు వాడవలసి ఉంటుంది. అందుకు ఎంతలేదన్నా నెలకు పదివేల రూపాయలు ఖర్చవుతాయి. పైగా ఇల్లు కూడా గడవాలి. ఈ రెండు విషయాల్ని రాజు దృష్టిలో పెట్టుకుని ఆ థియేటరు ఓన రుతో వందరోజులపాటు పావలావంతు లాభం తీసుకోవడానికి ఒప్పందం కుదుర్చు కున్నాడు. ప్రజల సొమ్ముని జలగలా పీల్చే ఆ థియేటరు ఓనరు వద్ద నుండి అలా తీసుకోవడం తప్పంటారా? అది దారుణ మైన నేరంగా మీరు పరిగణిస్తారా? ఒక పావుగంట సేపు కెమేరా ముందు నిలబడి ఆ వచ్చిన పారితోషికంతో ఒక అభాగ్యుడిని ఆదుకోవడం అన్యాయమంటారా? అలా అని మీరు భావిస్తే ఇక మేము చేసేదేం లేదు" అన్నాడు నిష్ఠూరంగా.

పట్టాభి మాటలతో ఒక్కసారిగా కదిలిపో యిన అమ్మాయిలంతా పశ్చాత్తాపంతో దహించుకుపోతూ సన్నగా రోదించసా గారు. వాళ్ళ కళ్ళల్లోంచి కారుతున్న కన్నీ టితో వాళ్ళ చెక్కిళ్ళు తడిసిపోతున్నాయి.

అప్పుడే వచ్చిన రాజు అమ్మాయిల్ని అలా మూర్తీభవించిన శోకదేవతల్లా ఉండడం చూసి కలవరపడ్డాడు.

"ఏమైంది? ఎందుకలా ఏడుస్తున్నారు?" గాభరా పడుతూ అడిగాడు రాజు.

అమ్మాయిలంతా అతన్ని చుట్టుముట్టి అతని చేతులు పట్టుకుంటూ "రాజూ! మమ్మల్ని క్షమించు. నువ్వు క్షమిస్తానంటే తప్ప మా మనసులకి శాంతి లేదు. ఇన్నిరో జులుగా మాలో ఒకడిగా ఉంటున్న నీలోని ఔదార్యం, త్యాగం, ఔన్నత్యం తెలిసి కూడా నిన్ను తక్కువగా అంచనావేసి, అనుమా నించి మమ్మల్ని మేము దారుణంగా అవ మానించుకున్నాం. మాలోని సంస్కారాన్ని ఇంగిత జ్ఞానాన్ని చంపేసుకున్నాం. హిమా లయాలంత ఎత్తుకి ఉన్నతంగా ఎదిగిన నిన్ను అద్దంలో చిన్నగా చూసి హేళన చేశాం. పరాభవించాం. మా పాపానికి నిష్కృతిలేదు. నీకు మా మొహాలు ఎలా చూపించాలో అర్థం కావడంలేదు" అంటూ బావురుమన్నారు.

రాజుకి వాళ్ళని చూస్తుంటే అప్యాయత, ఆత్మీయత పొంగుకొచ్చాయి. జాలి కూడా కలిగింది. వాళ్ళందరి తలలమీద చెయ్యివేసి ఆర్తిగా నిమిరాడు.

"మీరు వట్టి అమాయకుల్లా ఉన్నారు. ఈ చిన్న విషయానికేనా ఇంతగా తల్లడిల్లిపోతు

న్నారు! మీరు ఎప్పటికీ నావాళ్ళు, నా ఆప్తులు, ఆత్మీయులు, ప్రాణస్నేహితులు. అలాంటప్పుడు మీకు నన్ను ఒకమాట అనే అధికారం ఉంది. నేను అడ్డదారిలో నడుస్తున్నాననే భావంతో మీరు మీ నిరసనని తెలియజేశారు తప్ప కావాలని కాదుగా. అలా ప్రవర్తించడంలోనే మీకు నా పట్ల ఉన్న మమకారం స్పష్టమవుతోంది. అందుకు నేను చాలా గర్వపడుతున్నాను కూడా. మీరు ఆ విషయం గురించి మర్చిపోయి ఇదివరకటిలా నవ్వుతూ తుళ్ళుతూ హాయిగా ఆనందంగా ఉండాలి. మీ మొహాల్లో ఎప్పుడూ ప్రశాంతంతో కూడిన చిర్నవ్వులు వెలుగుతూ వుండాలి" అన్నాడు రాజు అందరి కళ్ళు తుడుస్తూ అనునయంగా.

అమ్మాయిలందరి మనసులు ఆ మాటలతో ఎంతో ఊరట పొందాయి. అంతా ఆహ్లాదకరంగా నవ్వారు. ఉల్లాసంతో మళ్ళీ వాళ్ళందరి మొహాలు కళకళలాడాయి. అలా వాళ్లని చూస్తుంటే రాజుకి ఎంతో సంతృప్తిగా అన్పించింది.

"మీ మధ్య వున్న అనిర్వచనీయమైన అనుబంధాన్ని చూస్తుంటే ఎంతో ముచ్చట వేస్తోంది. వేలతారలు ఒక్క చంద్రుడిలా అన్పిస్తున్నారు మీరంతా" ఆ స్థితిలో కూడా కరుణ వాళ్ళందరినీ విభ్రాంతిగా చూస్తూ అభినందనగా అంది.

కిడ్నీ ఆపరేషను విజయవంతంగా ముగిసింది. ఆపరేషను థియేటరులోంచి డాక్టరు బయటకు వచ్చాడు. కర్చీఫ్‌తో మొహం తుడుచుకుంటూ ఆయన రాజు వంక చూసి చిన్నగా నవ్వాడు. దాంతో ఎంతో ఉద్విగ్నతతో వున్న అందరి మనసులు కుదుటపడ్డాయి.

ఆయన రాజు భుజంమీద చెయ్యివేసి "పేషెంటుకొచ్చిన భయమేం లేదు. రెండు మూడు రోజుల్లో పూర్తిగా కోలుకుంటాడు. చెప్పాలంటే ఆ ఆపరేషను మేం చేసినా ఆ ఆపరేషను నిరాటంకంగా జరగడానికి పరోక్షంగా మీరే కారణం. ముక్కూ మొహం తెలియని వ్యక్తికోసం ఇంతగా చేస్తున్న మీరు డాక్టరు మనుషుల ప్రాణాల్ని నోట్లతో తూచే మాలాంటి వారికన్నా ఎంతో గొప్పవారు. మిమ్మల్ని చూసి మేమంతా చాలా నేర్చుకోవాలి" అని ఆగి "ఒక అరగంట తర్వాత మీరంతా వెళ్ళి పేషెంటుని చూడవచ్చు" అన్నాడు.

రాజు సిగ్గుపడుతూ నవ్వి "థాంక్యూసార్! థాంక్యూ!" అన్నాడు.

ఆయన తలపంకించి "మీకు ఏం కావాల్సి వచ్చినా నా ఛాంబరుకి రండి" అన్చెప్పి వెళ్ళిపోయాడు. కరుణ గభాల్న వంగి రాజు పాదాలకు నమస్కరించబోతూంటే రాజు ఆమెను వారించాడు.

"చూడమ్మా! మీరు నాకంటే పెద్దవారు. అక్కలాంటివారు. నన్ను మీ తమ్ముడే అనుకోండి. మీకో తమ్ముడే వుంటే మీ కోసం ఈ మాత్రం సాయం చెయ్యడా? " అన్నాడు రాజు ఆత్మీయంగా. ఆ మాటలకు ఆమె కదిలిపోయింది. కళ్ళల్లోంచి కన్నీరు ఉప్పొంగింది. ఆమె రాజు వంక అనిర్వచనీయమైన భావంతో చూస్తూ "మా జీవితాల్లో వెలుగుల్ని నింపిన మీరు మాత్రం మా కోసం ఆదేవుడు పంపించిన కారణ జన్ముడే అనుకుంటాం" అంది.

రాజు మిగిలిన పాతికవేలు ఆమెకు అందిస్తూ "చూడమ్మా! ఈ డబ్బు ఖర్చులకి ఉపయోగపడుతుంది. ఉంచండి. అలాగే ప్రతిరోజూ మందులకి అయ్యే ఖర్చు నిమిత్తం మా పట్టాభి ఏరోజుకారోజు మీకు కొంత డబ్బు తీసుకొచ్చి ఇస్తాడు. మీరు ఎలాంటి దిగులు పడకుండా హాయిగా వుండండి. ఇంకా డబ్బు అవసరం అయితే మొహమాటం పడకుండా మా పట్టాభిచేత నాకు కబురు చేయండి. నేను వెంటనే



ఎదురుచూడని పరిస్థితులతో నిరంతరం సర్దుకుపోవడాన్నే వివాహం అంటారు. – హెన్నీథామస్

ఏర్పాటు చేస్తాను" అన్నాడు ఆదరంగా.

"మీకు... మీకు నేను చాలా శ్రమ కల్గిస్తున్నాను" అందామె.

"అలాంటి ఆలోచనలేవీఁ మనసులో పెట్టుకోవద్దు. ఇస్తున్నది మీ తమ్ముడే అనుకోండి" అన్నాడు రాజు వారిస్తూ.

తమ ఊహలకే అందనంత ఎత్తుకి ఎదిగిపోయిన రాజువంక అమ్మాయిలంతా ఆరాధనా భావంతో చూశారు. కృష్ణుడిని పెంచి పెద్దచేసే అవకాశం వచ్చినందుకు యశోద జీవితం ఎలా ధన్యమైందో అలా రాజుని తమ హాస్టల్లో తమతోపాటు వుంచుకున్నందుకు తమ జన్మ చరితార్థమయిందని భావించారు.

★ ★ ★

ముఖ్యమంత్రి శ్రీరాములుగారు తలపట్టుకుని కూర్చుని ఉన్నారు. ఎమ్మెల్యేల్ని ఎవరు కిడ్నాప్ చేశారో తెలియక ఆయన తల్లడిల్లిపోతున్నాడు. నిన్నగాక మొన్న మతఘర్షణల వలన ఏర్పడిన అస్థిరత నుండి పార్టీని ఆ అజ్ఞాత వ్యక్తి చలవ మూలంగా 'రక్షించుకో గలిగాడు. మళ్ళీ ఇంతలోనే ఈ ఉపద్రవం ముంచుకొచ్చింది. ఇప్పుడు ఈ విపత్తు నుండి ఎలా బయటపడాలో తెలియడం లేదు.

అదే సమయంలో ఆయన ఆలోచనల్ని భగ్నం చేస్తూ టేబుల్ మీద ఉన్న ఫోన్ మోగింది. ఆయన రిసీవరు అందుకుని "ముఖ్యమంత్రి స్పీకింగ్" అన్నాడు నిరాసక్తంగా.

అటువైపు నుండి క్రూరంగా నవ్వు విన్పించింది. "పాపం ముఖ్యమంత్రిగారు సామ్రాజ్యం కోల్పోయిన మహారాజులా నిర్వేదంగా వున్నట్లున్నారు" అన్నాడు అవతలి వ్యక్తి వ్యంగ్యంగా.

శ్రీరాములుగారు నిటారుగా అయ్యారు.

"ఎవరు మీరు? " కోపంగా అడిగాడాయన.

"నా పేరు చెప్తే నీ గుండె ఆగిపోతుందేమో? " హేళనగా అన్నాడు.

ఆయనకి వళ్ళు మండింది.

"చూడూ! నీ పేరు చెప్తే చెప్పు. లేదా ఫోన్ పెట్టేయ్" అన్నాడాయన చిరాగ్గా

"అయితే మీ పార్టీ ఎమ్మెల్యేల సంగతి మీకెవరు చెప్తారు? " అన్నాడతను ఎగతాళిగా.

ఆయన ఉలిక్కిపడ్డాడు.

"ఎవర్నువ్వు? " ఆత్రంగా అడిగాడాయన

## జాగ్రఫీ



వేదికపై ఎక్కి ఓ సర్దార్జీ తనగురించి తాను గొప్పగా చెప్పుకుంటున్నాడు.తానెన్నో దేశాలు.. నగరాలు తిరిగానని చెబుతూ లండన్, ప్యారిస్, న్యూయార్క్, రోమ్, కరాచీ అంటూ చెప్పుకుపోతున్నాడు.

అంతలో ప్రేక్షకుల్లోంచి 'అబ్బో చాలా తిరిగారే.. అయితే మీకు జాగ్రఫీ కూడా బాగా తెలిసి ఉండాలే?' అన్నారెవరో.

వెంటనే సర్దార్జీ 'తెలియకపోవడం ఏమిటి? నేను జాగ్రఫీలో స్వయంగా నాలుగురోజులు బసకూడా చేశాను..' అన్నాడు.

ఆదేశం కంటే అనుకరణ ద్వారానే పిల్లలు ఎక్కువగా నేర్చుకుంటారు. - డా.టి.సి. గోయెల్

"ఉస్మాన్"

పక్కన బాంబు పడ్డట్టుగా అదిరిపడ్డారు ముఖ్యమంత్రిగారు. ఆయన వెన్ను జలదరించింది. ఎక్కడో కాశ్మీర్ బోర్డరులో వుండాల్సిన ఉగ్రవాద నాయకుడు ఉస్మాన్ ఈ రాష్ట్రంలోకి ఎందుకు అడుగుపెట్టాడు?

అతి ప్రయత్నం మీద ఆయన గొంతు పెగుల్చుకుని "ఏం కావాలి నీకు?" అని అడిగాడు.

ఉస్మాన్ విజయగర్వంతో నవ్వాడు.

"నీకు ఇరవై నాలుగు గంటల టైమిస్తున్నాను. ఈలోగా నువ్వు నాకు మత ఘర్షణల్నుండి నిన్నూ నీ పార్టీని, జంటనగరాల్ని రక్షించిన అజ్ఞాత వ్యక్తిని నాకు అప్పగించాలి. లేకపోతే ఇరవై నాల్గవ గంట గడిచిన మరుక్షణం యాభై మంది ఎమ్మెల్యేల శవాలు సచివాలయం ముందు నీకు స్వాగతం పలుకుతాయి" అని క్రూరంగా హెచ్చరించాడు ఉస్మాన్.



ముఖ్యమంత్రిగారి మొహంలో నెత్తురు చుక్కలేదు.

"గుర్తుంచుకో ఇరవై నాలుగు గంటలు మాత్రమే" మరోసారి హెచ్చరించిన ఉస్మాన్ అజ్ఞాత వ్యక్తిని ఎక్కడికి పంపించాలో చెప్పి ఫోన్ పెట్టేశాడు.

★ ★ ★

ఎమ్మెల్యేల్ని రక్షించుకోవడానికి ముఖ్యమంత్రిగారు అతికిరాతకులయిన ఉగ్రవాదులకి అజ్ఞాతవ్యక్తిని అప్పగించబోతున్నాడన్న పుకారు రాష్ట్రమంతటా వ్యాపించింది. దాంతో అన్ని జిల్లాల్లో వున్న అజ్ఞాత వ్యక్తి అభిమానులందరూ రాష్ట్ర రాజధానికి తరలివచ్చి భారీ ఊరేగింపుతో సచివాలయానికి చేరుకుని నినాదాలు చేయసాగారు.

"అజ్ఞాత వ్యక్తీ... ఒక మహాశక్తి"

"అజ్ఞాత వ్యక్తీ... పేదల పాలిట పెన్నిధి"

"అజ్ఞాతవ్యక్తిని ఉగ్రవాదులకు అప్పగించడానికి వీల్లేదు".

ఆ నినాదాలతో ఆ ప్రదేశం దద్దరిలిపోసాగింది. అప్పుడే ముఖ్యమంత్రిగారి ఛాంబరులోకి ప్రవేశించిన హోమ్ మినిష్టరు, డి.జి.పి., మిగిలిన పోలీసు అధికారులు ఆయనతో చెప్పారు ఆందోళనగా. "మీరు ఎట్టి పరిస్థితుల్లో కూడా బయటకు వెళ్ళవద్దు. బయట లక్షల సంఖ్యలో అజ్ఞాత వ్యక్తి అభిమానులు కోపావేశాలతో ఉన్నారు."

ఆయన సన్నగా నవ్వి తన సీట్లోంచి లేచాడు. ఆ పోలీసు అధికారులు ఎంత వారిస్తున్నా వినకుండా బయటకు నడిచాడు.

గేటు తీసుకుని బయటకు వస్తున్న ముఖ్యమంత్రిగారిని చూసి అజ్ఞాతవ్యక్తి అభిమానులు బిగ్గరగా నినాదాలు చేయసాగారు.

ఆయన నిశ్శబ్దంగా కదిలి ముందు వరుసలో నిలబడి ఉన్న ఒకతని చేతిలోని కర్రకు బిగించిన అట్టను అందుకున్నాడు. దాని మీద అజ్ఞాత వ్యక్తిని అప్పగించడానికి వీల్లేదు అని రాసి వుంది.

ఆయన సచివాలయం వైపు తిరిగాడు.

"అజ్ఞాత వ్యక్తి అభాగ్యులపాలిట మహాపెన్నిధి. అతన్ని ఉగ్రవాదులకు అప్పగించడానికి వీల్లేదు" అని బిగ్గరగా నినాదాలు చేశాడు.

లక్షల సంఖ్యలో హాజరైన అజ్ఞాతవ్యక్తి

అభిమానులంతా దిగ్భ్రాంతులయ్యారు.

ఆయన జనం వైపు తిరిగి సన్నగా నవ్వాడు.

"నేను మీ అందరికంటే ఎక్కువగా అజ్ఞాతవ్యక్తిని అభిమానిస్తాను. ఆరాధిస్తాను. నా ప్రాణానికి ప్రాణమైన అతన్ని ఆ ముష్కరులకు ఎలా అప్పగిస్తాననుకుంటున్నారు. మీరంతా నిశ్చింతగా ఉండండి" అన్నాడు.

అప్పుడుగాని ఆ అభిమానులు శాంతించలేదు.

★ ★ ★

"ఏమిటి నువ్వనేది? ఆ ఉగ్రవాదుల దగ్గరకు వెళ్తావా?" ఎదురుగా నిలబడి వున్న రాజును ఆందోళనగా చూస్తూ అన్నాడు ముఖ్యమంత్రి.

"అవున్సార్" అన్నాడు రాజు స్థిరంగా.

"అదెంత ప్రమాదమో నీకు తెలుసా? వాళ్ళు పరమకిరాతకులు. అన్యాయంగా నీ ప్రాణాలు తీస్తారు" హెచ్చరిస్తూ అన్నారు ముఖ్యమంత్రి.

రాజు సమాధానంగా నవ్వాడు.

అక్కడే వున్న సుందరయ్యగారు కల్పించుకుని "మీరు చాలా పొరపాటు పడుతున్నారు శ్రీరాములుగారూ! రాజుని వాళ్ళు ఆహ్వానించడం అంటే నేరుగా మృత్యువుని చప్పట్లు కొట్టి పిలవడమే. మీరు రాజు గురించి దిగులుపడటం కంటే రాజు మూలంగా నాశనం కాబోతున్న ఆ దుర్మార్గుల జీవితాల గురించి జాలిపడండి" అన్నాడు.

ముఖ్యమంత్రిగారి మనసు కుదుటపడింది.

"మీరు చెప్తున్నారు కాబట్టి రాజుని ధైర్యంగా పంపిస్తాను" అన్నారు ముఖ్యమంత్రి.

"ఆ విషయంలో మీరు ఎలాంటి భయాలు పెట్టుకోవద్దు" అన్నారు సుందరయ్య.

రాజు ఆ ఇద్దరి ఆశీర్వాదం తీసుకుని అక్కడ నుండి కదిలాడు.

★ ★ ★

నవాబుల కోట ముందు నిలబడి ఓంప్రకాష్, ఉస్మాన్, పాండు తమ చేతుల్లోని బైనాక్యులర్స్ ద్వారా దూరంగా కన్పిస్తూన్న కాలిబాటనే తదేకంగా చూస్తున్నారు. అటుగా ఎవరు వచ్చినా ఆ కాలి బాట మీదుగానే రావాలి.

అప్పుడే వాళ్ళకు దూరంగా హీరోహోండా మీద వస్తూన్న రాజు కన్పించాడు.

"ఎవరో ఒకతను బైక్ మీద వస్తున్నాడు" అన్నాడు పాండు.

"అవును. కాని అతన్ని ఇంతకుముందెప్పుడూ చూసిన గుర్తులేదు" అన్నాడు ఓంప్రకాష్.

"అతను అపరిచిత వ్యక్తే" అన్నాడు ఉస్మాన్.

అంతలో హీరోహోండా వచ్చి వాళ్ళకు కాస్త దూరంలో ఆగింది. రాజు బైక్ దిగకుండానే కాలు క్రిందకు పెట్టి తలెత్తి వాళ్ళ వంక చూశాడు.

"మీరు ఎవరికోసమయితే ఎదురుచూస్తున్నారో ఆ అజ్ఞాత వ్యక్తిని నేనే" అన్నాడు రాజు నిర్భయంగా. వాళ్ళు ముగ్గురూ ఒకర్నొకరు చూసుకున్నారు. "నువ్వు అజ్ఞాత వ్యక్తివని గ్యారంటీ ఏమిటి?" అని అడిగాడు ఓంప్రకాష్ అనుమానంగా.

రాజు నవ్వాడు.

"నీ నియోజకవర్గ ప్రజలు మూకుమ్మడిగా నీ ఇంటి మీదకు దాడిచేసి నిన్ను చితకబాదుతున్నప్పుడు నీ ఇంటిలోని రహస్య గదిలోకి ప్రవేశించి అక్కడ నువ్వు భద్రపరిచిన వేల కోట్ల రూపాయల్ని, విలువైన డైమండ్స్, నగల్ని అపహరించి పేదప్రజలకు పంచిపెట్టింది నేనే" అంటూ వాటి లెక్కల వివరాలు మొత్తం చెప్పాడు రాజు.

అతను అంత ఖచ్చితంగా లెక్కలు చెప్పే



సరికి ఓం ప్రకాశ్ మొహం క్రూరంగా మారింది. కళ్ళు చింతనిప్పుల్లా మారాయి. ఆగ్రహావేశాలతో ఆయన శరీరం కంపించ సాగింది.

చివ్వున తలతిప్పి తన అనుచరుల వంక, ఉగ్రవాదుల వంక చూసి చెప్పాడాయన.

"వాడే... వాడే... వాడే అజ్ఞాతవ్యక్తి. వాడిని వదలకండి. ముక్కలు ముక్కలుగా నరికి నా దగ్గరకు తీసుకురండి. ఒక్కో ముక్కను ఒక్కో గద్దకు ఎగరేసి నా కసిని తీర్చుకుంటాను".

అంతే! దరిదాపుగా ఓ రెండు వందల మంది వరకు వున్న ఉగ్రవాదులు, ఆయన అనుచరులు పరుగున వచ్చారు. వాళ్ళందరి చేతుల్లో మారణాయుధాలున్నాయి.

రాజు బైక్‌ని స్టార్ట్ చేసి మెరుపువేగంతో వచ్చినదారినే ముందుకు పోనిచ్చాడు.

"వాడు పారిపోతున్నాడు. పట్టుకోండి.




వదలకండి" బిగ్గరగా అరుస్తూ చెప్పాడు ఉస్మాన్.

వాళ్ళు మూడు వ్యానుల్లో రాజు వెంటపడ్డారు. రాజు వాళ్ళకు దొరక్కుండా వేగంగా తన బైక్‌ని ముందుకు పోనిచ్చాడు. పట్టువదలకుండా వాళ్ళు రాజు వెంటబడుతూనే వున్నారు. రాజు అదే వేగంతో బైక్‌మీద బొల్లారం మిలటరీ క్యాంపస్ దగ్గరికి చేరుకున్నాడు. ఆ క్యాంపస్ ప్రహరీగోడ దగ్గర బైక్‌ని వదిలేసి ప్రహరీగోడ ఎక్కి లోపలకు దూకాడు. అంతేకాదు ఆ క్యాంపస్ ఆవరణలో వున్న ఒక వేప చెట్టుపైకి ఎక్కి గుబురుగా వున్న ఒక కొమ్మమీద కూర్చున్నాడు.

రాజు ప్రహరీగోడ ఎక్కడం దూరం నుండి గమనించిన ఉగ్రవాదులు, ఓం ప్రకాశ్ అనుచరులు తాము కూడా ప్రహరీ గోడ ఎక్కి లోపలికి దూకారు.

ఆ క్యాంపస్ ఆవరణలో దరిదాపుగా ఓ అయిదు వందల మంది వరకు మిలటరీ వాళ్ళు ఒక క్రమపద్ధతిలో నిలబడి సాయుధులై కమాండర్ చెప్పిన ప్రకారం కవాతు చేస్తున్నారు.

అదే సమయంలో రాజు ప్యాంటు జేబులోంచి ఒక బాంబు తీసి ఖచ్చితంగా ఆ మిలటరీ వాళ్ళ ముందుపడేలా విసిరాడు. అది దిక్కులు పిక్కటిల్లేలా శబ్దం చేస్తూ బద్దలయింది.

ఆ మిలటరీ వాళ్ళంతా నేలమీద బోర్లాపడుకుండిపోయారు.



బాంబు పేలిన చోటు నుండి దుమ్ము పొగలా పైకి లేస్తోంది.

ఊహించని ఆ సంఘటనకి కొద్దిక్షణాల పాటు బిత్తరపోయారు ఉగ్రవాదులు, ఓం ప్రకాశ్ అనుచరులు.

బోర్లాపడుకుని వున్న మిలటరీ వాళ్ళు నెమ్మదిగా తలెత్తి చూశారు. అప్పుడు వాళ్ళకు ఎదురుగా మారణాయుధాలతో కన్పించారు ఉగ్రవాదులు.

ఆ బాంబు విసిరింది ఆ ఉగ్రవాదులేనని భావించిన కమాండర్ బిగ్గరగా అరిచి చెప్పాడు.

"ఎటాక్"

మరుక్షణం మిలటరీ వాళ్ళ చేతుల్లోని తుపాకులు భీకరంగా గర్జించాయి. ఉగ్రవాదులు, ఓంప్రకాశ్ అనుచరులు తేరుకునే లోగా వాళ్ళ శరీరాల్లోంచి బుల్లెట్లు దూసుకుపోయాయి.

వాళ్ళ ఆక్రందనలతో ఆ ప్రదేశం దద్దరిల్లిపోయింది. ఆ రెండు వందల మంది కూడా కుప్పకూలిపోయారు. ఏ ఒక్కరు కూడా ప్రాణాలతో మిగల్లేదు.

రాజు ఆ శవాల వంక జాలిగా చూసి ఆ వేప చెట్టు కొమ్మమీద నుంచి ప్రహరీ గోడ మీదుగా బయటకు దూకాడు. మళ్ళీ బైక్ స్టార్ట్ చేసుకుని నవాబుల కోట వైపు బయల్దేరాడు.

★ ★ ★

రాజు బైక్ మీద వెళ్తోండగా దారిలో ఒకచోట ఓ నలుగురు ఫారెస్టు డిపార్టుమెంటు వాళ్ళు ఓ ప్రత్యేకమైన తుపాకులు పట్టుకుని తిరుగుతూ కన్పించారు.

"ఎవరు మీరు? దేని కోసం వెదుకుతున్నారు?" అని రాజు వాళ్ళని అడిగాడు.

"జూ పార్కు నుండి ఒక క్రూర మృగం తప్పించుకుని ఈ ప్రదేశంలో తిరుగుతోంది. దాన్ని పట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నాం" అన్నాడు వాళ్ళు.

రాజు నవ్వి "ఒక క్రూర మృగం కాదు మూడు క్రూర మృగాలు ఈ ప్రదేశంలో సంచరిస్తుండగా నేను చూశాను" అన్నాడు.

"మూడా?" విభ్రాంతిగా అన్నారు వాళ్ళు.

"అవును"

"అవి ఎక్కడ వున్నాయో కాస్త చూపిస్తారా?" ఆసక్తిగా అన్నారు వాళ్ళు.

"చూపించడమే కాదు. ఆ క్రూర మృగాల్ని పట్టిస్తాను కూడా" అని రాజు ఒకతని చేతిలోని తుపాకి అందుకున్నాడు.

ఆ తుపాకి ప్రత్యేకంగా చేయబడ్డది. దాన్ని పేల్చగానే దానిలోని సూదులు గాల్లో దూసుకుపోయి క్రూరమృగం శరీరంలో దిగ



అవివేకమైన చమత్కారం కన్నా చమత్కారంగా మాట్లాడే అవివేకి మేలు. – షేక్స్పియర్

బడతాయి. ఆ క్రూర మృగం రక్తంలో కలిసి అది స్పృహ తప్పేలా చేస్తుంది. ఆ తర్వాత ఒక అయిదారుగంటలవరకు దానికి స్పృహరాదు.

రాజుని అనుసరించారు ఆ ఫారెస్టు డిపార్టుమెంటు వాళ్ళు.

రాజు శవాన్ని ముక్కలు ముక్కలుగా నరికి తమ అనుచరులు తీసుకువస్తారని ఓంప్రకాశ్, ఉస్మాన్, పాండు ఎదురుచూస్తున్నారు.

కాని ఆ ముగ్గురూ ఊహించని విధంగా రాజు ఆ కోట వెనకవైపు నుండి నిశ్శబ్దంగా ముందుకు కదిలాడు. ఇప్పుడు అతనికి కొన్ని అడుగుల దూరంలో ఓంప్రకాశ్, ఉస్మాన్, పాండు నిలబడి వున్నారు. రాజు వెనకవైపు నుండి రావడంవలన అతని రాకను వాళ్ళు గమనించలేదు.

రాజు తుపాకిని మూడుసార్లు పేల్చాడు. ఆ తుపాకిలోంచి దూసుకుపోయిన సూదులు ఆ ముగ్గురు శరీరాల్లో దిగబడ్డాయి. ఆ సూదుల గుండా వాళ్ళ శరీరాల్లోకి ప్రవేశించిన మందు వాళ్ళు ముగ్గురూ స్పృహ కోల్పోయేలా చేసింది. ఆ ముగ్గురి శరీరాలు నేలమీద ఒరిగి వున్నాయి.

రాజు చేసిన పనికి ఫారెస్టు డిపార్టుమెంటు సిబ్బందికి అతని మీద విపరీతమైన కోసం ముంచుకువచ్చింది.

"క్రూరమృగాల్ని పట్టిస్తానని చెప్పి మనుషుల్ని కాల్చావెందుకు? " అంటూ మండిపడ్డారు.

రాజు నవ్వి "వీళ్ళు ముగ్గురూ ఆ క్రూర మృగాలకన్నా చాలా ప్రమాదకరమైన వాళ్ళు. క్రూర మృగాలు తమకు ఆకలేసినప్పుడో లేక తమ జోలికి ఎవరైనా వచ్చినప్పుడో మాత్రమే అవి హాని చేస్తాయి. కాని మానవరూపంలో వున్న ఈ క్రూరమృగాలు యావత్ మానవాళికి, కన్నతల్లి కన్నా మిన్న అయిన దేశమాతకే తీరని ద్రోహం చేయాలని ప్రయత్నం చేస్తున్నాయి. అందుకే వీళ్ళను పడగొట్టాను" అన్నాడు.

వాళ్ళు ఆశ్చర్యంగా ఒకర్నొకరు చూసుకున్నారు.

"ఇంతకీ మీరెవరు? " సందేహంగా అడిగారు. రాజు వాళ్ళకి సమాధానం చెప్పకుండా ఆ పాడుబడ్డ కోటలోకి వెళ్ళి బందీలుగా వున్న యాభై మంది ఎమ్మెల్యేల్ని బయటకు తీసుకొచ్చాడు.

"అంటే ఉగ్రవాదులు బంధించిన ఎమ్మెల్యేలు వీరేనా? " ఫారెస్టు డిపార్టుమెంటు సిబ్బంది విభ్రాంతిగా అడిగారు.

"అవును" అన్నాడు రాజు.

ఆ ఎమ్మెల్యేలు రాజువంక ఆరాధనాపూర్వకంగా చూస్తూ "మా కన్నా చాలా చిన్నవాడివి. అందుకే చేతులు జోడించి నమస్కరించలేకపోతున్నాం. మమ్మల్ని ఈ రాక్షసుల బారినుండి రక్షించినందుకు జీవితాంతం నీకు రుణపడి వుంటాం" అన్నారు కృతజ్ఞతగా.

రాజు ఏదో అనబోతుండగా ఫారెస్టు డిపార్టుమెంటు సిబ్బంది కలగజేసుకుని "మీరెవరో చెప్పలేదు" అన్నారు రెట్టిస్తూ.

అప్పుడే అక్కడికి వచ్చి ఆగిన కారులోంచి ముఖ్యమంత్రి శ్రీరాములుగారు, సుందరయ్యగారు క్రిందికి దిగారు.

"అతనెవరో నేను చెప్తాను" అన్నారు ముఖ్యమంత్రి. ఎమ్మెల్యేలు, ఫారెస్టు డిపార్టుమెంటు సిబ్బంది విస్మయంగా, ఆసక్తిగా చూశారు.

"అజ్ఞాత వ్యక్తి" అన్నారు ముఖ్యమంత్రి. వాళ్ళంతా దిగ్భ్రాంతులయ్యారు.

కొద్దిసేపట్లోనే అక్కడికి లక్షల సంఖ్యలో జనం తరలివచ్చారు. తమ అభిమాన వ్యక్తి అయిన అజ్ఞాత వ్యక్తిని చూడటానికి ఎగబడ్డారు. వాళ్ళని అదుపుచేయడం అక్కడికి

క్షమ ప్రశస్తమైన గుణం. - లావోట్జీ

చేరుకున్న పోలీసుల వల్ల కాలేదు.

స్పృహ తప్పి పడివున్న ఓంప్రకాశ్, ఉస్మాన్, పాండులని వ్యాన్‌లోకి ఎక్కిం చారు పోలీసులు.

వరుసగా వచ్చి ఆగిన వాహనాల్లోంచి విశ్వనాథం మాస్టారు, నవీన, మధు, తులసి, మిథిల, హాస్టలు అమ్మాయిలు, వార్డెన్, రాజు తండ్రి శివప్రసాదు, తల్లి సుభద్రమ్మ, అన్నలు వాసు, నరేష్, వది నలు అరుణ, కళ్యాణిలు కిందకి దిగారు.

రాజుని కౌగలించుకున్న ముఖ్యమంత్రి శ్రీరాములుగారు "మరోసారి ఈ రాష్ట్రానికి, ఈ ప్రజలకి ఎలాంటి హాని జరగకుండా కాపాడావు. నిన్ను ఈ రాష్ట్రంలో పుట్టించి నందుకు ఆ భగవంతునికి మరోసారి కృత జ్ఞతలు చెప్పుకుంటున్నాను. నిన్ను కన్న తల్లిదండ్రులు కూడా ఎంతో ధన్యులు" అన్నారు భావోద్వేగంతో.

శివప్రసాదుగారు చెమర్చిన కళ్ళతో కొడుకు వంక గర్వంగా చూశారు. సుభ ద్రమ్మ మనసు ఆనందంతో పరవళ్ళు తొక్కింది.

అంతలోనే నవీన అంది "ఇక నుండి రాజు మాతోనే వుంటాడు"

"అవును రాజుని మాతో తీసుకువెళ్దామ నుకుంటున్నాం" అన్నారు మధు, తులసి.

"అలా కుదరదు. ఎందుకంటే ఎప్పుడూ మాతోనే హాస్టల్లో వుంటానని రాజు మాకు మాటిచ్చాడు. రాజుని ఎవరితోనూ పంపించం" అంది మిథిల స్థిరంగా.

"అవును.. అవును" అన్నారు హాస్టలు అమ్మాయిలు మిథిలకు వత్తాసుగా.

"ఇన్ని రోజులు రాజుని వదిలి ఉన్నం దుకు కన్నతల్లిగా ఎంత వేదన అనుభ వించానో మీకు తెలీదు. నా పంచప్రాణాలే ఈ హైదరాబాద్‌లో ఉండిపోయినట్లుగా విలవిలలాడిపోయాను. ఇక నుండి రాజుని విడిచి ఒక్క క్షణం కూడా వుండలేను. వాడిని మాతోపాటు మా ఊరు తీసుకెళ్ళి పోతాం" అంది సుభద్రమ్మ కడుపుతీపితో.

అయితే వాళ్ళెవరూ ఊహించనివిధంగా లక్షల సంఖ్యలో అక్కడ హాజరైన జనస మూహంలోంచి ఓ ఇరవై అయిదేళ్ళ యువతి రాజు దగ్గరకి వచ్చింది.

ఆమె కళ్ళు వర్షిస్తున్నాయి. మొహం విషా దంగా వుంది.

ఆమె చేతులు జోడించి రాజుకి నమస్క రించింది.

"నా పేరు అలేఖ్య. నేను వైజాగ్ నుండి మీకోసం ఒంటరిగా వచ్చాను. వైజాగ్ సిటీలో సాంబ అనే ఒక గూండా ఉన్నాడు. అతనికి రాజకీయ అండదండలున్నాయి. అతను ఎలాంటి బీభత్సం చేసుకురమ్మన్నా చేసుకురావడానికి కిరాతకుల్లాంటి అనుచరు లన్నారు. వాళ్ల దౌర్జన్యాల్ని ఎదిరించినం దుకు నా భర్తను వాళ్లు అతిదారుణంగా నడిరోడ్డుమీద నరికి చంపారు. పెళ్లయిన రెండు నెలలకే నేను విధవనయ్యాను. శిథి లమయిన నా జీవితంలో ఎలాంటి ఆశలు లేవు. కాని ఒకేఒక్క ఆశ మాత్రం మిగి లింది. ఆ ఆశతోనే మీ దగ్గరికి వచ్చాను. అదేమిటంటే నా మాదిరిగా ఎంతో మంది అభాగ్యులు, అమాయకులు, అసహాయులు ఆ దుర్మార్గుడి అరాచకాలకు బలికాకూడదు. అలా జరగాలంటే మీరు మా నగరానికి రావాలి. మీరు రాకపోతే మా నగరం అతి కొద్దికాలంలోనే వల్లకాడుగా మారిపోతుంది. ఎంతోమంది ఆడపడుచులు తమ పసుపు కుంకుమలు పోగొట్టుకుంటారు. మరెంతో మంది అతివలు తమ శీలాన్ని పోగొట్టుకుని ఉరికొయ్యలకు వేలాడుతారు. మా ఊరి ప్రజల శ్రేయస్సునాశించి చేతులెత్తి నమస్క రించి అడుగుతున్నాను. మా ఊరిని కాపా డండి. బలి కాబోతున్న అభాగ్యుల జీవి తాల్ని నిలబెట్టండి. ప్లీజ్" అంది ఏడుస్తూ.

తన గుండెను ఎవరో పిండుతున్నట్లు విలవిలలాడిపోయాడు రాజు. అప్రయ

త్నంగా ఒకడుగు ముందుకువేసి ఆమె కన్నీరు తుడిచాడు.

"వస్తానమ్మా! నీతో తప్పక వస్తాను" అన్నాడు రాజు మాటిస్తూ.

ఆమె మొహం వెలిగిపోయింది.

"థ్యాంక్యూ... థ్యాంక్యూ" అంది ఆనం దంలో ఉక్కిరి బిక్కిరి అవుతూ అలేఖ్య.

సుభద్రమ్మ కంగారుగా "అదేమిటి రాజూ! నువ్వు మాతో ఇంటికి రావడం లేదా? " అంది.

"రాజూ! నువ్వు మా హాస్టలుకి రావా? " అదుర్దాగా అడిగింది మిథిల.

"రాజూ! నువ్వు మా ఇంటికి రావా? " కలవరపడుతూ అడిగింది నవీన.

వాళ్లందరి ఆరాటాన్ని, ఆవేదనని అర్థంచే సుకున్న విశ్వనాథం మాస్టారు తలెత్తి చూశాడు.

"చూడండి. సూర్యుడు అందరికీ సమా నంగా వెలుగుని పంచుతాడు. అలాగే గాలి కూడా అంతటా వీస్తూంది. అప్పుడే అన్ని ప్రాణులూ నిలబడగలుగుతాయి. అంతేగాని సూర్యుడు మనకు మాత్రమే వెలుగుని ఇవ్వాలి, గాలి మనింట్లోనే వీచాలి అని అను కోవటం ఎంతో స్వార్థం అన్పించుకుంటుంది. అలాగే ఎంతోమంది అభాగ్యుల జీవితాల్లో చీకటిని పారద్రోలి వెలుగుల్ని నింపే రాజు కూడా మన ఒక్కరికే స్వంతం అనుకోవడం కూడా స్వార్థం అవుతుంది. పెద్దమనసు చేసుకుని లోక కళ్యాణం కోసం రాజుని త్యాగం చేయండి" అని హితవు చెప్పాడు.

అందరి కళ్లూ తెరుచుకున్నాయి.

రాజు తమని వదిలి వెళ్తున్నందుకు అందరికీ బాధగా ఉన్నా అతని వలన ప్రజ లకి కలిగే మేలు గుర్తుకొచ్చి తమ మన సుల్ని దిటవు పరుచుకున్నారు.

రాజు పెద్దలందరి పాదాలకు నమస్క రించి వారి ఆశీస్సులు అందుకున్నాడు.

నవీన, మిథిల, హాస్టలు అమ్మాయిల దగ్గ రికి రాజు వచ్చాడు. వాళ్లందరి కళ్లు వర్షిస్తు న్నాయి. రాజు మనసు బరువెక్కింది.

"ఏయ్! ఏమిటిది? నేను శాశ్వతంగా ఈ దేశం విడిచి వెళ్లిపోతున్నట్టు ఎందుకలా బాధపడతారు? నేను వెళ్లేది వైజాగే కదా! అక్కడ పని అయిపోయాక తప్పకుండా మీ అందరి దగ్గరకు వస్తాను. నన్ను నవ్వుతూ మీరంతా సాగనంపండి" అన్నాడు అనున యంగా.

వాళ్లంతా అతిప్రయత్నం మీద తమ దుఃఖాన్ని అణచుకుని, పెదవుల మీదికి బలవంతంగా చిర్నవ్వు తెచ్చుకుని వీడ్కోలు పలుకుతూ చేతులూపారు.

"గుడ్... ఎప్పుడూ ఇలా నవ్వుతూ ఉండాలి" అన్నాడు రాజు.

దుఃఖంతో పూడుకుపోయిన వాళ్ల గొంతులు పెగల్లేదు.

"ఉంటాను" అందరికి చెప్పిర రాజు అలే ఖ్యతో కలిసి అక్కడి నుండి కదిలాడు.

రాజు దగ్గరికి పట్టాభి వచ్చి "గురూ! నేను కూడా నీవెంట వస్తాను" అన్నాడు ఉత్సాహంగా.

రాజు ఒక్క క్షణం ఆత్మీయంగా చూసి "వస్తావా? " అన్నాడు.

"అవును గురూ! రాముడు ఎక్కడ వుంటే లక్ష్మణుడు కూడా అక్కడే కదా!" అన్నాడు.

రాజు అభిమానంగా అతని భుజం తట్టి "పద" అన్నాడు.

పట్టాభి మొహం వికసించింది. కారు చీ కట్లు కమ్ముకున్న మానవ జీవితాల్లో వెలు గులు నింపడానికి సరికొత్త సూర్యుడై, కన్నీటి వరదల్లో, కడగండ్ల సుడిగుండాల్లో చిక్కుకుని తల్లడిల్లిపోతూన్న అభాగ్యులకి చేయూతని అందించే ఆపద్బాంధవుడై రాజు సాగిపోతున్నాడు.

అక్కడున్న లక్షలాది మంది జనం అత నిని నిండుమనసుతో దీవిస్తున్నారు.

"మా అందరి ఆయుష్షూ పోసుకుని చిరంజీవివై చిరకాలం వర్థిల్లు"

○

# చతుర ప్రపంచం

## పాదరక్షల ప్రహసనం

నల్లజాతి వారిని శ్వేత జాతీయులు పెట్టే అష్టకష్టాలను చూసి మార్టిన్ లూథర్ కింగ్ తల్లడిల్లిపోయేవాడు. నల్లజాతివారి అభ్యున్నతి కోసం ఆయన అహరహం పాటుపడ్డాడు. ఏ నల్లజాతివారికి ఏ అన్యాయం జరిగినా తెల్లజాతివారిని ఎదుర్కొనడానికి లూథర్‌కింగ్ వెనుకాడేవాడు కాదు.

ఒకసారి కింగ్ ఓ పెద్ద సమావేశంలో ఉపన్యసిస్తున్నాడు. ఆయనంటే సరిపడని ఒక వ్యక్తి నీగ్రోలను వెనకేసుకొస్తున్నాడనే అక్కసుతో ఓ చెప్పును ఆయనున్న వేదిక మీదకు విసిరాడు. అయితే ఆ చెప్పు వేదికముందున్న గట్టుకు తగిలి క్రిందపడిపోయింది. అదిచూసి జనంలో కలకలం బయల్దేరడంతో సభను నిర్వహిస్తున్న వారు సభలో కొట్లాటలు జరుగుతాయని భయపడ్డారు.

అయితే ఆ హఠాత్సంఘటనకు కింగ్ ఏమాత్రం చలించలేదు. ఆయన మౌనంగా క్రిందకు వెళ్లి అక్కడ పడివున్న చెప్పుపైకి తీసి దానివంక ఎంతో ప్రేమతో చూశాడు.




"ఈ దేశం ఎంతో గొప్పది! ఇచ్చటి ప్రజలు తమ సేవకుల కోసం ఎంతో ఆతృత చెందుతూ ఉంటారు. ఉదారస్వభావంగల ఓ వ్యక్తి నాబోటి వాని బాధచూసి, చెప్పులు లేకుండా నేను నడవడం గమనించి, వాటిని కొనే శక్తి నాకులేదని గ్రహించి ఈ చెప్పు విసిరాడు!" అన్నాడు కింగ్ ఎంతో నమ్రతగా.

రెండు క్షణాల నిశ్శబ్దం తర్వాత ఆయన తిరిగి ఇలా అన్నాడు. "ఆ జాలి గుండెగల వ్యక్తిని నేనొక కోరిక కోరుతున్నాను. దయచేసి అతను రెండవ చెప్పు కూడా విసిరితే

నాకు గొప్ప ఉపకారం చేసినవాడు అవుతాడు!"

సమావేశంలో ఉన్న జనమంతా కొద్ది సేపు స్తంభీభూతులై పోయారు. వారు కాస్సేపటికి తేరుకొని కింగ్‌ను అభినందిస్తూ, ఆ హాలంతా మారుమోగేలా చప్పట్లు కొట్టారు. లూథర్ కింగ్ మందహాసం చేస్తూ నిలబడ్డాడు.

---

## ప్రధాని సాహసం

ఇంగ్లాండు ప్రధాన మంత్రి హెరాల్డ్ మాక్‌మిలన్ ఆ దేశ ప్రధానిగా మంచిపేరు తెచ్చుకొన్నాడు. ప్రజల అభిమానాన్ని విశేషంగా చూరగొని, మంచి ప్రధాని అనిపించుకున్నాడు. ఆయన ఒకసారి ఆఫ్రికా పర్యటనకై వెళ్లాడు. బ్రిటిష్ వారి పొడగిట్టని నీగ్రోలు అతిపెద్ద సంఖ్యలో, బ్రిటిష్ ప్రధాని రాకను నిరసించారు. వారంతా ఆగ్రహంతో, మాక్‌మిలన్‌పై మండిపడ్డారు. తమపై బ్రిటిష్ వారి నిర్బంధాలు, వేధింపులు తొలగాలని వారు నినాదాలు చేశారు. అనేక బేనర్లు వ్రాసి, ప్రధానికి కనపడేలా పట్టుకున్నారు. హెరాల్డ్ మాక్‌మిలన్ ఒక వృద్ధుడు పట్టుకున్న బోర్డు చూశాడు. అతను ఆ భోర్డును తిరగేసి పట్టుకున్నాడు. వెంటనే ప్రధాని అతని వద్దకు వెళ్లి,

"పెద్దాయనా! నువ్వీబోర్డును తిరగేసి పట్టుకొనడం వలన నేను బోర్డుపై ఏమీ వ్రాసి ఉన్నదీ చదవలేకపోతున్నాను. కనుక దయచేసి బోర్డు తిప్పి పట్టుకో" అన్నాడు.

అదిచూసి గుంపులు గుంపులుగా గుమిగూడిన నీగ్రోలు అందరూ దిగ్భ్రాంతి చెందారు. వారు మేక్‌మిలన్ ధైర్యంగా తమవద్దకు వచ్చి, ఆవిధంగా వృద్ధునితో మాట్లాడడం చూసి ఎంతో ఆనందించారు. ప్రధాని సాహసాన్ని ప్రశంసించారు. పిమ్మట మాక్‌మిలన్ దారికి ఏ అవరోధం కలగకుండాచూసి, ఆయన వేదిక పైకి వెళ్లడానికి సహకరించారు. ప్రధాని ప్రసంగాన్ని శ్రద్ధగా విన్నారు.

☆



## సచిత్ర విచిత్రం



# కాయగూరల సంగీతం!

మనం ఎన్నెన్నో పాటకచేరీలకు వెళ్ళాం. వాటికి అనుగుణమైన సంగీతాన్ని విని పించిన వాయిద్యాలను చూశాం. అయితే కాయగూరలే సంగీత వాయిద్యాలుగా అవ తరించడం మనం ఎక్కడా చూళ్లేదుగదూ! ఆ విచిత్రాన్ని ఆస్ట్రియాలోని ముగ్గురు మహిళలు, ఆరుగురు పురుషులు సంయుక్తంగా, కాయగూరలనే వాయిద్యాలుగా వినియోగిస్తూ, ప్రేక్షకులను ఎంతగానో అలరిస్తున్నారు.

క్యారెట్ వారి చేతిలో ఫ్లూట్ వాయిద్యం అవుతోంది. సాక్సో ఫోన్‌గా ఆనపకాయను, దోసకాయలు డబుల్‌బాస్‌గా వారు వినియోగిస్తున్నారు. కచేరీ అయిన తర్వాత ఆ కాయగూరలన్నీ సూప్‌గా మారి వారి ఆహారంలో ఉపయోగపడుతున్నాయి!

# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 082 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యం కాదు.

**కూపన్**

డిసెంబర్ చతుర నవల **పైసాలేని ప్రయాణం**

చిరునామా: ____________________

____________________

____________________

____________________

# 'సాగర సంగీతం' పై సమీక్షలు

అక్టోబర్ చతురలో ప్రచురించిన ఇచ్ఛాపురపు రామ చంద్రం నవల 'సాగర సంగీతం'పై పాఠకులు రాసిన లేఖల నుండి ఎంపిక చేసిన సమీక్షలు..

## మానవ ప్రయత్నంతో మంచి మార్పు

*(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

జీవితాన్ని ముగించుకోవాలనుకున్న ఓ మనిషి - స్వార్థం విడిచి, సమాజ శ్రేయస్సే లక్ష్యమని ఎంచి, నిక్కచ్చిగా పరితపించి, ప్రయత్నిస్తే, ఎంతటి అద్భుతాలు సాధించ వచ్చో కళ్లకు కట్టినట్టు వివరించి, నిరూపిం చింది సాగర సంగీతం. తెలియని ఊళ్లో మాధవ్ ప్రవేశించి క్రమక్రమంగా వాళ్ల మనసులను ఆకట్టుకుని మంచి మార్పులు తీసుకురావటం, ఆ ఊరందరికీ ఆప్తుడు, అభిమానపాత్రుడూ కావటం చాలా ఆదర్శ వంతంగా ఉంది. ప్రతి సమస్యకి ఆత్మహత్యే పరిష్కారమని భావించేవారికి, ఏం చేస్తే మాత్రం ఎంత చేస్తే మాత్రం ఈ సమాజం మారుతుందిలే అని నీరసించిపోయే మను షులకీ ఈ నవల కనువిప్పు.

పక్కవాడి అవలక్షణాలకు, తప్పిదాలను నిరసించి నీరుకారిపోయేకన్నా, వాటిని వివ రించి చైతన్యపరచటం వివేకవంతమైన పని. మాధవ్ అలా చేశాడు కాబట్టే చదువు సంధ్య లకు దూరంగా, చెడు అలవాట్లు జీవితంలో భాగంగా ఉన్న మత్స్యకార గ్రామంలో మహా ద్భుతాలు సృష్టించగలిగాడు. చదువూ, సంగీతం, మేధను పెంచే ఆటలవైపు మనస్సు మళ్లించి, వాటిలోని హాయిని, అవ. సరాన్నీ ప్రణాళికాబద్ధంగా రుచి చూపిం చాడు. మంచిపనికి పూనుకున్నప్పుడు, ఒక పరిస్థితిని మార్చాలని ప్రయత్నించినప్పుడు- అప్పటి స్థితి ద్వారా లాభం పొందే శక్తుల నుంచి ప్రతిఘటనా, సవాళ్ళూ సహజం. కల్లు వ్యాపారి సూరిబాబు, చంద్రమతి తదితరుల నుంచి ఎదురైన పరిస్థితులు అలాంటివే. మార్పు కోసం ప్రయత్నించేవాళ్లకి అలాంటి సందర్భమే నిజమైన పరీక్షా సమయం. దానికి ఎదురొడ్డి నిలవగలిగాడు కాబట్టే మాధవ్ తర్వాతి కాలంలో ఊరిని మార్చగలి గాడు. మంచి మార్పులు తేగలిగాడు. అంత లీనంగా సాగిన ఈ అద్భుత సాధనే ఈ నవల గొప్పదనం.

*- జి. సత్యనారాయణ,*
*విశాఖపట్నం-13*

## ఎన్‌సైక్లోపీడియా

*(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

గంగపుత్రుల జీవన కడలిలోని ఆటుపో ట్లను ప్రత్యక్షంగా దర్శింపజేసిన 'చతుర' నవల 'సాగర సంగీతం'. ప్రకృతితో మమే కమైన జాలరుల జీవిత సరళికి సంబంధిం చిన 'ఎన్‌సైక్లోపీడియా' ఈ నవల. ఆ వ్యక్తు లతో, ఆయా ప్రదేశాలతో ఎంతో సాన్ని హిత్యం ఉంటే తప్ప ఇటువంటి నవల రాయడం అసాధ్యం. వారి యాస, వేషం, అలవాట్లు, కట్టుబాట్లు మొదలైనవాటినన్నిం టినీ అత్యంత సహజంగా చిత్రీకరించడానికి మూలమైన రచయిత పరిశీలనాశక్తి అబ్బు రపరిచింది. జాలరుల జీవితాలపై ఒక థీసిస్‌కు సరిపడా సమాచారం ఈ నవలలో అందించబడిందంటే అతిశయోక్తి కాదు.

'ఎప్పుడూ వెలుగు చూడటం నేర్చుకో! అప్పుడు అసలు చీకటే కనిపించదు' అనే సూక్తిలోని సత్యాన్ని గ్రహించిన మాధవ్

స్వార్థరహితుడై, దీనజనోద్ధరణకు నడుము బిగించడం అతని సంస్కారానికి సంకేతం. సంకల్పం కార్యరూపం దాల్చకుంటే అది నూనె లేని దీపం అవుతుంది. జీవన్మరణ పోరాటంలో కలిమి లేములనే తెగలు మాత్రమే మిగులుతాయనే వాస్తవాన్ని చక్కగా ఆవిష్కరించారు రచయిత.

తమ జీవన 'సాగర సంగీతం'లో 'శివరం జని' రాగాన్నే 'ఆనందభైరవి'గా మలచుకొన్న గంగపుత్రుల హృదయాలు సముద్రం కన్నా లోతైనవేమో అనిపించక మానదు.

నానాటికీ మృగ్యమవుతున్న సనాతన సంస్కృతీ సంప్రదాయాలు, సంస్కృత భాషా వినియోగం తిరిగి వెలుగులు విరజిమ్మాలనే రచయిత సత్సంకల్పం ప్రశంసనీయం. శ్రమైక సౌందర్యాన్ని ఆరాధించే ప్రతి ఒక్కరూ చదివి, దాచుకోవలసిన నవల ఇది.

*– టి.వి. శ్రీధర్,*
*గూడూరు-524 101.*

## వాస్తవ దర్పణం

***(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)***

ప్రతి జీవికీ ఓ పరమార్థం, ప్రతి జీవితా నికీ ఓ అర్థం ఉంటాయి. అవి నెరవేరనిదే మనిషి చావాలనుకున్నా చావలేడు అన్న జీవిత సత్యానికి- మాధవ్ జీవితమే ఓ నిద ర్శనం. అతని వల్ల ఓ మారుమూల చీకటి కోణంలో సముద్రపుటొడ్డున గడ్డు జీవితం వెళ్లబుచ్చే బెస్తల జీవితాలలో వెలుగు నింప వలసి ఉండగా, అతను చావాలనుకున్నా ఎలా చావగలడు!?

సముద్రపుటడుగున ముత్యాలూ, సము ద్రపు వొడ్డున మత్స్యకారులూ సాగరుడి సాక్షిగా సహజీవనం సాగించే పూడిమడకలు దేశంలో ఎన్నో! పూడిమడక బెస్తలు అమా యకులు, అల్ప సంతోషులు. షాహుకార్ల స్వార్థంతో, ప్రభుత్వాలు నిర్లక్ష్యతలో పావులు. తరాలుగా నరాలలో జీర్ణించుకుపోయిన వారి మూఢనమ్మకాలనూ విశ్వాసాలనూ మార్చడం అనుకున్నంత సులభం కాదు. అయినా వారిలో విద్య పట్ల, ఇల్లూ వొళ్లు గుల్ల చేసే మద్య రాక్షసి కథనం పట్లా, సమైక్యత పట్లా క్రమంగా అవగాహన కల్పించి, ఓ నిర్దిష్టమైన మార్గానికి మలిపించి, వారి జీవి తాను ఉద్ధరించడమే కాక - ఒకే జాతికి చెందిన రెండు కులాలనూ ఒకటిగాచేసి ఏక తాటిపైన- నడిపించాలంటే.... అచంచల ధ్యేయం, కఠోర దీక్షా అవసరం. అవి ఒక్క మాధవ్‌కే ఉన్నాయంటే అతిశయోక్తి కాదు. అందుకే సామాన్యుడు కాస్తా 'స్వామి' అయ్యాడు. గంగపుత్రుల జీవితాలను ఓ కొత్త కోణంలో చూపుతూ, తెలియని ఎన్నో విషయాలను తెలియజెప్పడం, ఉన్నతమైన ఇతివృత్తంతో, ఆద్యంతం వుత్కంఠతో సాగే ఈ నవల, అందలి కథనం, భావం, భాష, శైలి పాఠకుల్ని అమితంగా ఆకట్టుకుంటాయి. నవల పేరూ సముచితంగా వుంది. చానా ళ్లకు ఓ ఉత్తమ నవలను చదివామన్న అను భూతీ, తృప్తి మిగుల్చుతుంది...

*– పి.వి.వి. సత్యనారాయణ,*
*జంషెడ్‌పూర్-831009*

## అనేక అంశాలు

***(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)***

సముద్రం అంతులేనిది, అరాధ్యమయి నది, సంసారాన్ని సాగరంతో పోలుస్తారు. లెక్కలేనన్ని అనుభూతులు, ఆనందాలు, ఆవేదనలూ, మలుపులూ, గెలుపులూ, ఓట ములతో సాగే జీవితం ముఖ్యంగా సాంసా రిక జీవితాన్ని ఓ సాగరంలా భావించటం కద్దు. 'సాగర సంగీతం' ఈ శీర్షిక చాలా ప్రత్యేకత కలిగి ఉంది. మంచి సామాజిక అంశాన్ని అందించిన మీకు ధన్యవాదాలు.

జీవితాన్ని అంతం చేసుకొనే హక్కు మనిషికి లేదు. ఎంత బుద్ధుదప్రాయమని

తలచినా, క్షణికమైనది జీవితం అనుకున్నా ఆ 'జీవి' ఈ భూమిమీదికి ఎందుకు వచ్చాడో, ఏం చేసి వెళ్ళవలసివస్తుందో మన ఊహకు అందనిది. అయితే మనిషి జన్మ మహత్తరమైనది. సాటిమనిషిని మనిషిగా గుర్తించగలిగే మానవత్వం, ప్రతి మనిషిలోనూ మంచినే చూడగలిగే ఔన్న త్యమైన మనసు, సంస్కరణ కోసం, తాను సాగించదలచిన దాని కోసం, శ్రమించే పట్టుదల గలిగిన వ్యక్తిత్వం కలిగిన ఏ మనిషైనా ఇతరులను ప్రభావితంచేయగల డన్న సత్యాన్ని 'మాధవ్' పాత్ర ద్వారా నిరూపించారు రచయిత.

గంగపుత్రుల జీవితాలలోని అనేక సత్యా లను ఎరుకపరిచారు. నాకు నచ్చిన అంశాల్లో ప్రధానమైంది సముద్రం నేప థ్యంలో ఓ రచన సాగటం. నిరుద్యోగం, నిరాశ వంటివి పట్టుకొని జీవితాన్ని నిస్సా ర్థంగా భావించేవారికి ఈ రచన మార్గదర్శ కమౌతుంది. చదువుకున్న వారికి, జీవి తాన్ని మధురంగా భావించేవారికి తన చుట్టు ఉన్న పరిసరాలను తన ఆసక్తి ద్వారా ఆహ్లాదకరంగా, ప్రయోజనకరంగా మార్చగలగటం కష్టసాధ్యం కాదు అన్న విషయాన్ని సూటిగా చెప్తుంది. సమస్యలని పరిష్కార దిశగా ఆలోచించగలగాలి తప్ప భూతంగా భావించినంతకాలం అవి మనల్ని పీడిస్తుంటాయి. కాబట్టి యువతకి మంచి సందేశాత్మకమైన నవలగానే సాగర సంగీతం చెప్పుకోవచ్చు

– *ఇమ్మిడిశెట్టి చక్రపాణి,*
*అనకాపల్లి-531 001*

# గుమ్మడిపాదు

*(ఐదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

ఇచ్ఛాపురపు రామచంద్రంగారి 'సాగర సంగీతం' నవల సంసార సాగర తీరాన ఒక సైకతస్థలి. 'మాధవ్' లాంటి మామూలు మనుషుల్ని మహనీయుల్ని చేయగలిగే మహత్తుగల ఒక శక్తి స్థలి. తనదైన ఒక ప్రత్యేకశైలిలో కథాగమనాన్ని నిష్ణాతుడైన ఒక అశ్వకునిలా మన మనోవృ త్తులనే గమ్మత్తుగా నడిపించుకుంటూ వెళ్లారు రచయిత, యాత్రానంతర శ్రమ ఏమాత్రం తెలీకుండా.

అయితే రౌతుకూర్చునే పీఠంలో మాత్రం మొదటినుంచి చివరి వరకు ఒక అంతుబ ట్టని అసౌకర్యపు అవరోధంతో యాత్ర ముగిసింది. అదే కౌసల్య (కాసులమ్మ) ప్రస్తావన... మామూలు మనిషి గరటయ్య దగ్గరనుండి, పఠనాసక్తిగల ప్రతి పాఠకుడికి కొరకరాని కరక్కాయగా మిగిలిపోయింది... అలా మిగిలిపోయేదే చివరిలో కూడా! "అది కరక్కాయ కాదు, ఖర్జూరపు కాయ సుమా!" అని రచయిత తన తప్పుని విషమ పరిస్థి తుల్లో ఒప్పుకున్నట్లుగా 'కౌసల్య'ని సోదరిగా చివరిలో పరిచయం చేయకపోతే!!

ఈ ఒక్క 'హంసపాదు' మినహాయిస్తే మంచి సారవంతమైన నేలలో జరజరా ఎదు గుతూ, పాకి పాకి, పైపైకి పోయి తన పూలతో, కాయలతో అందరికీ కనుల పండుగ జేసే ఒక 'గుమ్మడిపాదు' ఈ నవల.

– *మంగళంపల్లి వెంకటసీతారామయ్య*
*భువనేశ్వర్-751017*

☆

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 220901; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804.

